

శ్రీ శివాజీ

చిత్రలేఖకుడు :
శ్రీ గోపాలకృష్ణ గోఖలే.



౧౬. సంపుటం. ప్రమాది, కార్తీకమాసము (1939) నవంబరు సంఖ్య. ౧౧

# శీలరక్ష

శ్రీ విశ్వనాథ సత్యనారాయణ

చెప్పుకొనిరి జనము చిలవలు పలవలు
క్రొత్తనాట్యకత్తెగూర్చి కథలు
అంత యాట పాట యవనిలో నుండదు
అంత యంద మనుచు ననలె లేదు.

చెదరి యనుకూలుఁడగు రాజు చెవులలో బా
జుంగుల నెలంతుకపొగడ్త గింగురుమనె
తొలుత నన్నూరు దీనారములకుఁ గోట
చెమను పెద్దకాసాయు బేరము కుదిర్చె.

అగరుపన్నీటిలో స్నానమాడి మల్లి
యల గులాబుల పూమాల లఱుతఁ దాల్చి
పసిడిమైచాయ వడపోయు పట్టువలిప
ముల ధరాపతి శయనించి పూలసెజ్జ,
తలుపువెనుక జిలుగు జిలుగు లేనవ్వులు
గడపముంగల ఘలఘలల నూపు
రముల సద్దు విన్న రాజు కన్నులు విచ్చె
నాస రూపుగొన్న యతివ కనఁగ
పూలకుచ్చుల పల్లకీవోలె వచ్చి
యచ్ఛమణిదీపికాస్తంభ మట్లు నిలచి
యున్న యానవబోడి నిల్చున్న తీరు
మొగముపోలిక కవళిక నగవు చూడ,

తన చెలియ లట్లె నిలుచుం
డును తన చెలియలిమొగంబునుం గవళిక య
ట్లనె యుండు నామె నవ్వుట
యును నట్లే రాజుగుండె యుష్మర మయ్యెన్.

మున్నె నన్నూరు దీనారములును జెల్లె
ధరణిపతి లేచి యామెఁ బ్రదక్షిణించి
చెల్లెలా! తప్పు! తప్పు చేసితి నటంచు
నృపుఁడు చనియె నాయిక దిగాలుపడి చూడ.

# ప్రేమలోకము

శ్రీ వేలూరి శివరామశాస్త్రి

౧

హరిహరి యీమహీతలమునందున నల్వురు చేరి నాటికిం
బురుషునకున్ బిరాన నురివోసి 'జగత్తున కెల్ల నిల్లిదే
యొరవడి' యంచుఁ బల్కెడు రహో! యిది యెక్కడికర్మ? ప్రేయసీ!
యురవడిఁ బ్రేమలోక మొకఁ డున్నెడ నాడకుఁ బాఱిపోదమా?

౨

అనుకొననట్టి పెన్గలలయద్దపుగోడ లొగిం గనంబడీ
కనఁబడకుండ నల్దెసలఁ గావలి కాయ, సుధాతరంగముల్
వినుసిగఁ దన్ను నొక్క తెలివెన్నెలసంద్రముమధ్య నూయమై
పానపాన ప్రేమలోక మదె పో కనుఁగొ మ్మెదుటన్ మనస్విని!

౩

క్రేఁగంటిచూపమ్ముక్రియ నాటి వెనుకటిపుట్టువుసంగతి చెప్పిపోవుచోటు
అల వియోగంబు మూఁడగన్నులయందు ముక్కాఁకలు దీఱి చక్కనగుచోటు
తలఁపులు కలలుగాఁ దలలెత్తుచుఁ గ్రమానుగుణముగా రూపు గైకొనెడిచోటు
జీవరహస్యాలప్రోవులు దీవులు దీవులై యట నటఁ దేలుచోటు
కళలు శిల్పంబులును నూడిగ మ్మొనర్చి
యందచందాలలో నోలలాడుచోటు
అదియచుమి ప్రేమలోక మల్లచటి కింక
లేచిపోదము వడిగ లే లెమ్ము సకియ!

౪

ఓ రుచిరాక్షి! సీదగు సముజ్జ్వల వక్ర విలోకనప్రభా
పూరముచే నపూర్వమగు పుష్పక మొక్కటి చేసి యూర్ధ్వహా
మేరకుఁ;— గాదు, నాకపురిమేరకుఁ, గా దది కాద,— యాయశా
రీరకమైన తావునకు రివ్వన నన్ గొనిపొమ్ము పేరిమిన్.

౫

విరివిల్తు నొక్కకంటన్, విరహానలుని నొక్కకంట వెసఁ గొనిరమ్మా
మరి భూలోకమునందుల, నిర వనునది లేదు వీరియిరువుర కెందున్.

# కవితాభిరుచులు : ప్రాతవీ కొత్తవీ*

శ్రీ రాయప్రోలు సుబ్బారావు

కావ్య మంటే కవికర్మ యని పెద్దలు నిర్వచించారు. ఇక్కడ కర్మ అంటే, ఆహార విహారాది కాయికం కాదు. రమ్యమైన అక్షరవ్యాపార మని విచక్షించుకోవాలి. వేదాలలోని ఋషులు కవులే. వారిఋక్కులన్నీ కావ్యాలే. కాళిదాసాదులు కవులే. కాదంబర్యాదులు కావ్యాలే. నన్నపార్యుడు కవే! మహాభారతము కావ్యమే. మంత్రాలన్నా, శ్లోకాలన్నా, కీర్తనలన్నా, అన్నీ, ప్రధాన సూత్రాన్ని పట్టి కావ్యకుటుంబానికే చెందుతవి—మాధుర్యం ప్రధానమైనా, ద్రాక్షా ఖర్జూరాలు, గుడ శర్కరలు, మధు ఫలరసాదులు, వేలు వేలుగా నున్నట్లు. అయితే యీకవి కుటుంబములో తపోధురీణులు, బ్రహ్మవాదులు, పురాణప్రవక్తలు, హ్లాదానురక్తులు కలరు. వీరంతా ఏత్రోవల బోయినా, అందఱికీ సామాన్యబంధం ఒకటి కనిపిస్తుంది. అనంతమైన యీ సృష్టిలో, ఏ అందమో అద్భుతమో పొడకట్టింది. అది వారి అంతఃకరణలో హత్తింది. దానిని అన్వేషించడంలో పరివర్తన మెంతో జరిగింది. చివరకు అభీష్టార్థం సిద్ధించింది. ఆ తన్మయావస్థలో నిక్షేపవిక్షేపాలకు అవకాశం ఉండదు. అందుచేతనే ఆయానందానుభూతి బయలెక్కింది. వాఙ్ముఖాన వస్తే కావ్య మయింది. చేష్టారూపంగా వెలువడితే నృత్యమయింది.

కవి అనేశబ్దం సిద్ధమైన వాచావిధాతకూ, చిత్రమయిన విహంగపోతానికీ చెల్లుతుంది. తూరుపురేకలు తెల్లవారేటప్పుడు చూడ సుందరంగా వుంటవి. ఆ రామణీయకంతో పులకరిస్తుంది శకుంతసంతానం. ఆనందం లోపల నిలిచేదికాదు. ఒక్కపెట్టున కంఠం పెకలించుకొని బయటపడుతుంది. అది మనోహరమైన మంజులస్వరాలతో కమ్మనిపాటగా వినబడుతుంది. లోకమంతా మేలుకొంటున్నది. ఈ ఉషస్సునే వైదికులుకూడా రక్తసూక్తులతో గానం చేశారు. వానిని విన్నప్పుడు ప్రసన్నమైన ఆనందం కలుగుతున్నది. భావస్థిరమై ఉన్న జాడ్య జాగ్రదవస్థాభేదం ప్రబోధ మౌతుంది. సంధ్యావందనం చేసే ద్విజకులానికీ, సంధ్యాగీతం పాడే ద్విజసంతానానికీ ఏమైనా సంబంధం ఉండేనా? ప్రకృతి అనుకృతు లనుకోవచ్చునా ?

వైదికులు మంత్ర దర్శనం చేశారు. వాల్మీకి రామవృత్తం వెలయించాడు. కాళిదాసు శాకుంతలం లాలించాడు. తిరుపతి కవులు శ్రవణానందం రచించారు. ఇదంతా వాగ్వ్యాపారమే! అయినా రూప కల్పనా భేదాలు కనిపిస్తూన్నవి. దీనికి కారణం ఆయా కవుల ఉపాధియోగమే! ఉపాధి జాతి గుణక్రియా సంజ్ఞాదికంగా విభక్తమైఉన్నది. అయితే అసలు ఆనంద సౌందర్యాలు రెండూ

* మద్రాసు ఆల్ ఇండియా రేడియోవారి అనుమతిని.

అనుపాధికాలుగానే ఉంట వని మనము మరువగూడదు. అది అవ్యక్తంకూడా. ఈ విచారణ అంతా వ్యక్తాన్నిగురించి మాత్రమే.

ఉపాధినిబట్టి సాధన సామగ్రి మారుతుంది. శీతలారణ్యాల్లో జీవించిన మహర్షులు బ్రహ్మాండప్రకృతిని పరిశీలించారు. కుటుంబ కలాపంలోపడ్డ వాల్మీకికి సీతారాముల దాంపత్యమే రుచించింది. కామార్తిని ఆకళింప గలిగిన మహాకవికి మేఘదౌత్యమే నచ్చింది. ఇట్లే ఆలోచిస్తే సమన్వయం దొరకకపోదు. ఆశ్రమాలు మహానగరాలుగా మారలేదా? పర్ణశాలలు సువర్ణసౌధాలుగా పరిణమింప లేదా? కృష్ణాజినాలు మూలపురుషులు ధరిస్తే పీతాంబరాలు వారిమనుమలు ధరించారు. నిరాహారులు నీవారాన్నం తిన్నారని నాగరకులు కలమాన్నం భుజింపక మానిరా? ఇందు గౌరవలాఘవాలున్నవా? విధినిషేధాలు కలవా? లేవు. ఇదంతా ఉపాధిపరిణామమే కాని ఆమూలాగ్రవిప్లవం కాదు.

ఈన్యాయాన్ని ఆంధ్ర కవులకూ, తెనుగుసాహిత్యానికీ లగించి చూతము. ఆంధ్రజాతి అతిపురాతనమైనదని గ్రంథనిదర్శనాలే ఉన్నవి. ఉపనిషత్తులనాటికే ఉన్నారు. కాని అప్పుడు వారు పుళిందసహవాసులై అనాగరకులుగా ఉండిరట! అయితే మగధ సామ్రాజ్యంనాటికి మహీచక్రం తిప్పగల సమర్థులైనారు. వైదికకర్మమార్గ మటుండగా బౌద్ధమతం అభిమానించారు. సంస్కృతమైన పాణినిభాష అటుండగా ప్రాకృతమైన ప్రజావాక్కునే పాటించారు. నే నీగొడవ తడవడం ఎందుకంటే ఆదినుంచీ వారు పరతంత్రులుకాక స్వతంత్రస్వభావం కలవారని తేల్చడానికి. కదనరంగంలో కత్తుల వలెనే కవితాఫలకంమీద వారిఘంటాలు మెఱసినవి.

ప్రస్తుతానికి వత్తము. ఆకాలపువాడే హాలుడు. ఆతడాంధ్రుడు. చక్రవర్తియై రాచరికం జరిపినట్లే సహృదయుడై సాహిత్య వ్యవసాయంకూడా నెఱపాడు. అందులో తియ్యని వాకిండ్లముందు మిథునానురాగ మాధుర్యం పొదివి చూపించాడు. హాలుని గాథలలో పడుచులలోకం కనిపిస్తుంది. వారి యనురాగభోగాలతోటే వాతావరణ మంతా పరిమళిస్తుంది. ప్రియుల ముద్దు ముచ్చట్లు, సరససంకేతాలు, ప్రణయోపచారాలు, విరహోపచారాలు - వీటిదే ప్రధాన ప్రసక్తి. చాతుర్యస్వాదిమలే తొణికిసలాడుతుంటవి. పతివ్రతాధర్మాలు, కులాచార సంప్రదాయాలు మొదలైన గతానుగతికాలు స్ఫురింపవు. ఇదే శృంగారం. దీని బీజాలు వెదపెట్టినవారు మొట్టమొదట ఆంధ్రులేనేమో? ఏలయన అంతకు ప్రాచీనమైన సంస్కృతవాఙ్మయంలో యావద్విశిష్టంగా ఇట్టిశృంగారం ఎక్కువ కానరాదు. ఊర్వశీవృత్తం వదిలితే ఋగ్వేదంలో ఉన్న యమీ యమ సంవాదం మిథునానురాగానికీ, ప్రాయశః శృంగారరసానికీ ప్రాతిపదిక అని వేత్తలమతం. ఆసంవాదం మిథునానురాగస్ఫోరకంగా ఉన్నమాట నిజం. ఆవేశి ఆతీపి అందులో స్ఫురిస్తున్నవి. కాని యమీయములు సహోదరులవడంచేత ఏతదనుబంధపరిణామమే కావ్యశృంగారమని చెప్పడానికి వీలు కాకున్నది. కాబట్టి హాలుడు విలక్షించిన మిథునానురాగమే 'శృంగార ఏవ రసః' అను అనంతరసిద్ధాంతానికి విత్తన మన

డం సమంజస మని నామనవి. ఇది చాలా ముఖ్యమైనది; ఎందుచేత నంటే తరువాతి కావ్యరచన అంతా యీసూత్రాన్ని పట్టే, ప్రధానంగా నడిచింది. ఇది మన కందరికీ స్పష్టమే!

ఇక ఆంధ్రకవులు- వీరిలో నూటికి తొంబదిమంది రామణీయకవాదులు. వీరి దీ రీతి సంప్రదాయం; అందువల్లనే పంచమవేదం తెనుగులో తీర్చినా, పాండురంగ మాహాత్మ్యాన్ని ప్రబంధించినా సజాతీయమైన స్వాదుపంథనుంచి దూరం పోలేకపోయినారు. సంస్కృతంలో భారతం ఇతిహాసమైనా తెనుగులో కావ్యరూపంతోటే కలకలలాడింది. తీర్థమాహాత్మ్యంలో సహితం తమ్ముడికి తలదువ్వే సోదరీచాతుర్య సౌందర్యాలే పరిణమించినవి. గీర్వాణంలో ఉన్న నైషధం, శృంగారించుకోకుండా తెలుగులోకి వచ్చింది కాదు. చెప్పదలచిం దేమంటే, సాహిత్యం ఎవరిదైనా పాకం తెలుగునాటిదని. అయినా ఏకవిఅభిరుచి ఆకూతాలు ఆకవిని నడిపినవి. ఏకాలపురంగు ఆకాలపు కవుల భావాంబరాలకు బాగా తగిలింది. ఏసంఘంలో మెదిగిన కవికి ఆ సాంఘిక నాగరకాభ్యాసాలు అవిభక్తంగా అంటినవి. అద్దాలలోవలె ఇవన్నీ వారికరణకౌశలాల్లో కనబడుతున్నవికూడా! నన్నయ్య అవిరళజపహోమతత్పరుడు. అతడు తనరచన 'పండితచేతోనిర్వృతి' చెయ్యవలెనని ఆశించాడు; సకలసూరిసభారమ్యంగా ఉండవలెనని ఉద్యమించాడు. తుదకు ఇతరులు అక్షరరమ్యతనైనా ఆదరింపకపోరని విశ్వసించాడు. సోమయాజి యైనప్పటికీ తిక్కన్నకు విద్వత్సభల గొడవ కానంత కూడా పట్టలేదు. శతసహస్రాక మైన ఆంధ్రావళికి ఆనంద మయ్యేటట్లు భారతం పూర్తిచేస్తానన్నాడు. ఎవ రేమంటే నాకే మన్నాడు శ్రీనాథకవిసార్వభౌముడు. కావ్యకన్యలను అమ్ముకొని పడుపుకూడు తినడంకంటె కవులు కానని కంతల్లో కందమూలాలు త్రవ్వుకోవడం లెస్స అన్నాడు పోతన్న. కర్పూర తాంబూలాలు, తూగుటుయ్యాలలు లేనిదీ కవిత్వమే రాదన్నాడు కవితాపితామహుడు. ఈలాగే యీజాబితా నింకా పెంచవచ్చు. వీరంతా యిలా చెప్పడానికి వారిస్వభావాభిరుచులేకాక తత్తత్కాలప్రభావానుభావాలు కూడా కారణాలని నావిధేయప్రతిపాదన.

బ్రదికిచెడ్డ ఆంధ్రులకు తిరిగీ ౧౧-వ శతాబ్దంలో స్థాయి కుదిరింది. దేశానికీ, ప్రభుత్వానికీ స్థిరమైన సీమాస్థాపనం జరిగింది. ప్రజలను, ప్రజానాగరికతను ప్రేమించే రాజులు సింహాసనా లెక్కారు. విద్యావినోదాలు, పండితసభలు ప్రతిష్ఠలోకి వచ్చినవి. మగధ సామ్రాజ్యం మోసిన ఆంధ్రజాతి అగాధవిస్మృతిలో పడిపోయిన విషాదఘట్టం సెలవేసింది. ఈ లోపం ఎలా వచ్చిం దని శోధన జరిగింది. స్వభాషను ఉపేక్షించడమే ఈ చేటుకు మూల మయిం దని తేల్చుకున్నారు. వాకిండ్లు తెరిస్తేనేకాని తెనుగుదీపం బయట ప్రకాశించ దని నిశ్చయించారు. అక్షరరమ్యాలయిందాకా జాతి అందచందాలకు, ప్రతిభా ప్రతిష్ఠలకు నిలకడ కుదరదని సిద్ధాంతం చేశారు. ఆచండాలాంతంగా ఒక ఆవేశం తాండవమాడింది. రాజరాజు కావలెనన్నాడు. వాగనుశాసనుడు సరే నన్నాడు. ఆయన సామాన్యుడు కాడు, బృహస్పతికి పాఠాలు చెప్పగల బుద్ధిశాలి. నానారుచి

రార్థసూక్తులకు నిధి. 'హరిః ఓమ్మ'ని గోదావరి ఒడ్డున ఘంటం పట్టాడు. వెంటనే ఎదురుగాలి తిరిగింది. ఆక్షేపణమేఘాలు ఉరిమినవి; ఏమంటే మహాభారతం ఐదోవేదం. తెలుగులోనికి తెస్తే దాని పావిత్ర్యం భ్రష్టమౌతుంది. అదిగాక సంస్కృతం పాణిన్యాదిష్టమైన భాష. తెనుగు వ్యాకరణంలేని నుడికారం. కాబట్టి యీ విప్లవాన్ని అరికట్టవలె అన్నారు పండితులు. నన్నయ జంకలేదు. పట్టిన పట్టు విడువలేదు. భాష బంగారంవంటిది. ఆభరణాలు తీర్చడం పనివాడి నేర్పునుబట్టి ఉంటుందన్నాడు. అపూర్వంగా అద్భుతంగా, అనన్యంగా, అర్థోన్ముక్తంగా ఆంధ్రంలో భారతం పొందించి అందించాడు. ఆ మహానుభావుడు ఆంధ్రుల కుపాస్యుడు. అమృతప్రదాత!

నన్నయ రాజాస్థానంలో ప్రధాన పండితుడు. తిక్కన్న రాజాస్థానంలో ప్రధాన మంత్రి ఒకరు రాజాదరణ పొందారు. ఇంకొకరు రాజ్యాధికారం నిర్వహించారు. ఇద్దరికీ దృష్టిభేదం ఉండదా? స్వానుభవం వేదాంతుల వాసనకంటే బలమైనది. భట్టారకుని ప్రతిభాపాండిత్యాలన్నీ శబ్దప్రతిష్ఠాపనంతోటీ, రీతిని రమణించడంతోటీ నిలిచిపోయినవి. - సోమయాజిప్రజ్ఞాబలాలు. భాషకు సర్వతోముఖమహత్వం కల్పించిందాకా ఆగలేదు. అందువల్లనే ఆయనవాక్కులో ఏరాగాని శ్రుతి దొరుకుతుంది. వేదాంతం చెప్పేటప్పుడు వేత్త- రాయబారం నడిపితే నేర్పరి- రణరంగంలో దిగితే వీరశిఖామణి- తగవులు సవరిస్తే తీర్పరి. ఈలాగా ఏరేఖ కారంగు, ఏవస్తువు కాపాకం కుదిరించే కౌశలం కావలసినంత గోచరిస్తుంది ఈయనదగ్గర. తిక్కనరచనతో మనభాష నిజంగా తెనుగుమీరిపోయింది.

ప్రజాచైతన్యం మహాప్రవాహంవంటిది. ఏయేటి కాయేడు క్రొత్తసీరు తగులుతుంది- ప్రాతజీవనాన్ని కదిలిస్తుంది. నన్నయభట్టారకుడు పుణ్యాహవాచనం చేసిన తరువాత ఆంధ్రదేశచక్రం గిఱ్ఱున తిరిగింది. గ్రహాలన్నీ ఉచ్చ కెక్కినవి. కాకతీయసామ్రాజ్యం విస్తరించింది. మగతనం మింట మెఱిసింది. ఐశ్వర్యం అతిశయించింది. సంఘంలో నాజూకు నాయకం బలిసింది. ఆంధ్రనగరి లోకాకర్షకమైంది. ఈ కాలంలో శ్రీనాథుడు కేశఖండనోత్సవంతోపాటు కవితావసంతోత్సవంలో ప్రవేశించాడు. నూనూగు మీసాల నాడే హాలుని గాథాపుత్రికలకు తెనుగు పుట్టింట్లలో జోలలు పాడాడు. పైలాపచ్చీసు వచ్చింది. అయఃపాకంలో వున్న సంస్కృత నైషధాన్ని నవనీతపాకంగా ఆంధ్రభాండంలోకి దింపాడు. పల్నాటిపాటతో పరవశుడైనాడు. ఇటు తిరిగి విద్వత్సభల కెక్కాడు. డిండిమభట్టుఢక్క పగులగొట్టించాడు. దీనారటంకాలతో తీర్థమాడాడు. కవిసార్వభౌముడై కుళ్లాయిపెట్టాడు. ఆపరంజికంచాలలో ఆరగించాడు. ఈ మహాకవి జీవితం అకాలపు తోకచుక్క అందామా? లేక సమకాలిక ప్రతిబింబ మందామా? గంధర్వాంగనలను చూడబోవలె, కస్తూరిదానం చెయ్యమని రాజుల నడిగిన కవిరాజు లున్నారా? మనము విన్నామా? శ్రీనాథు డెట్లు సాహసించెను? దీనికి ప్రత్యుత్తరం ఆ కాలపు ఆంధ్రుల చరిత్రలోనే ఉన్నది.

అది రెడ్డిరాజులప్రభుత్వం. వారు మొట్టమొదట క్షేత్రదేవత నారాధించి సుఖపడ్డ

కష్టజీవులు. ఐనా దేశం అరాజక మయ్యెత్తు వచ్చినప్పుడు నాగలిపగ్గాలు అవల పాఱేసి శస్త్రాస్త్రాలు పుచ్చుకొన్నారు. సింహాసనా లెక్కారు. రాజ్యతంత్రం నడిపారు. ఆ ప్రాభవంతోనే ఆ విశ్రాంతిసుఖంలోనే సాహిత్యసమ్మోహనాస్త్రం వీరిమీద పడ్డది. వాత్స్యాయనుడు చిత్రించిన నాగరకుడు వీరి నాకర్షించాడు. ధన్యజీవితానికి నాగరకుడే లక్ష్యంగా భావించారు. ఆలక్షణాలు అనుష్ఠానంలో పెట్టడానికి ప్రయత్నించారు. ఆవిషయం విస్తరించడానికి కాలం చాలదు. చారుదత్త అగ్నిమిత్రులకు ఆంధ్రుల్లో కుమారగిరిరెడ్డి, రఘునాథభూపాలురకు ఆ నాగరికలక్షణాలు అంది చాపులుగా పట్టుతవి. ప్రభువులు నాగరక సంప్రదాయాల్లో పడితే ప్రజలుమాత్రం ఊరుకుంటారా? సుగంధద్రవ్యాలకోసం భాండారాలే కట్టవలసి వచ్చింది. దేశమంతా వసంతోత్సవాలతో భల్లున తెల్లవారసాగింది. ఈ అతిక్రీడావిలాసంలో, అమితరాజోపభోగాల్లో, అపరిమిత ఉల్లాసలాలసంలో, ఆంధ్రు లుఱ్ఱూత లూగారు ఆ దినాలలో. దాక్షారామం తీర్థోపవాసాలకోసం పోదురా? అప్సరస్సహవాసంకోసం పోదురా? కాబట్టి శ్రీనాథుడి జీవితంలో ఆనాటి చైతన్య చిహ్నాలు ఉపలక్షిస్తే అది సాహసం కాదు; సహజమే అవుతుంది.

ఈవాతావరణమే విద్యానగరం విజృంభణంనాటికి మఱింత చిక్కపడ్డది. సామ్రాజ్యం దూరాతిదూరంగా విస్తరించింది. జయస్తంభాలు దిగ్దిగంతాల లేచినవి. విజయనగరం వీథుల్లో గుట్టలవలె గులాబీలు రాసులు పోసేవారు. అంగళ్లలో నవరత్నాలు బస్తాలు క్రుమ్మరించి అమ్మేవారు. పడుచులు దాగుడుమూత లాడేటంత విశాలంగా కృతకాద్రిమందిరాలు నిర్మించారు. ప్రాభవోన్మాదంతో తల దిమ్మెక్కొన్న ఆరోజులలో పెద్దన్న ఉయ్యాల తాంబూలాలు కావలెనన్నాడంటే ఆశ్చర్యం లేదు. సశరీర స్వర్గసుఖంలో తలమునక లౌతూన్న కన్నెలు కుశలత ఏ వ్రతాల్లో ఉన్నదని ప్రశ్నించడం ప్రగల్భం కాదు. ముక్కోపంతో చెయ్యి చేసుకొన్న బ్రాహ్మణ్ణి పింఛీపెట్టక వదలిపెట్టడమే గొప్ప. కాళ్లమీద పడ్డ నాయకుణ్ణి పడదన్నిన నాయికలను బాహాటంగా ఏకవులు వర్ణించారు? అది రసభంగం కాదని ఏనాటి సహృదయులు సమ్మతించారు? ఆనాటి ఉల్లాస ప్రవృత్తికీ రసిక మర్యాదకూ ఇవన్నీ ఛాయలని నా విశ్వాసము.

ఈ గంధానిలం ఆంధ్రు లెక్కడికి పోతే అక్కడికి ప్రాకింది. వీరు సాహిత్యప్రపంచంలో అక్షర రమ్య సంప్రదాయాన్ని పారమ్యం ముట్టించారు. తరువాత నాదోపాసకులై తంజావూరులో తంబుర పట్టారు. తోడ్తో నృత్యం ముందంజ వేసింది. నాటకరంగాలు కట్టారు. రఘునాథరాయ లీ మాధురీప్రకరణానికి సూత్రధారు డైనాడు. శోభనంపై శోభనం అవ్యృత్తమైన విజయవిలాసం వెలిసింది. శృంగారలీలామయంగా రాధికాసాంత్వనం సిద్ధించింది.

ఇక వర్తమాన కవులు- ఆంధ్రుల రాజ్యాలు నిద్రవోయినవి. ఓడరేవులు పూడిపోయినవి. ఐశ్వర్యం అత్తిపువ్వైంది. ప్రజ్ఞాబలాలు కూడా ఎండాకాలపు చెరువులైనవి. అయినా వాసన వదలలేదు. పూచి కాచిన పండ్లతోట కదా? వృద్ధవృక్షాలకు అంట్లు

రావా? నిక్షేపమైన బీజాలు సరియైన తొలకరి వస్తే మొలకరించవా? ఆంధ్రులు అసలు మతాంధులు కారు. అందులో సన్యాస ప్రవృత్తి వారికి బొత్తుగా గిట్టదు. నాగరక గృహస్థాశ్రమం వారికి అభీష్టాపత్తి, భోగభాగ్యాలు ఉపాదేయాలే కాని గర్హ్యాలు కావు. అందువల్లనే బైరాగులలో ఆంధ్రులు తక్కువ. దేశంలో కూడా వేదాంతులకన్న వైయాకరణు లధికం. కావ్యాలంకార శాఖలలో వారిది మీది చెయ్యి. కాశీలో కూడా సాహిత్యపీఠానికి రాజా గంగాధరశాస్త్రికే పిలుపు వచ్చింది. కావ్యమీమాంస అంతా ఆపోశన పట్టి రసగంగాధరం సృష్టించడానికి పండితరాయలే చాలినవాడైనాడు. ఇక మన పూర్వులిచ్చి పోయిన తెనుగుమాన్యం శృంగారవనం గాని వేదాంతమఠం కాదు. ఇట్టి దేశంలో ఇలాటి మోహన వారసత్వంతో నవ్యకవులు బయల్దేరారు. నవ్యసాహిత్యం సాగుతున్నది.

వీరు ఆదిలో "పురాణమిత్యేవ న సాధుసర్వం" అన్నారు. దానితో కావ్యావరణంలోంచి బ్రహ్మాది త్రిమూర్తులు నిష్క్రమించారు. చిల్లర దేవతలను చెప్పనక్కర లేదు. రాచనగళ్లలోను రాణీవాటికల్లోనూ మాత్రమే రామణీయకం బందెపడలేదన్నారు. సౌందర్యోపాసనకు సంభోగానుభూతే సిద్ధికాదన్నారు. దీనితో నాయికానాయకులకు చుట్టూ గీచిన హద్దులు చెరిగిపోయినవి. కవి స్వయముగా నాయకుడైనాడు. నిర్భయంగా అస్మచ్ఛబ్దంతో సంభాషించాడు. నాయికను ప్రాణసఖిగా హృదయేశ్వరిగా ప్రియసోదరిగా పవిత్రజననిగా ఆనంద స్వామినిగా ఆరాధించడానికి దిగాడు. ఈ సాధనలో ఇష్టదేవతల కోసం అన్వేషణ జరిగింది. అఖండ ప్రేమతో అనంత శోభలతో అక్షయ్యంగా ప్రత్యక్షంగా ఉన్న ప్రకృతినే పట్టుకొన్నాడు. హృదయతంత్రులు ఎలా మేళనమైతే ఆలా పాడుతున్నాడు.

నవ్య సాహిత్యంలో దేశాభిమానం పొంగులు పోతున్నది. తల్లి దేశంకంటె యిష్టదేవత లేదంటున్నారు నవ్యకవులు. కాని దీని విశృంఖలవ్యాప్తి మానవస్వభావం చిత్రించడంలో అధికంగా ఉన్నది. అది ఎంత కాలకరాళంగా కలుషింపగలదో అంత అమృతధవళంగాకూడ పవిత్రీకరింపగలదు. కొందరు కవులలో ఉత్సాహమే ప్రధాన రేఖ. మఱి కొందరిలో విషణ్ణభావం అధికం. మఱి కొందరి వాక్కులో ఆకలి చిచ్చువంటి ప్రచండ దావానలం మరుగుతున్నది ఇంక కొందరిలో ప్రసన్న ప్రణయమే కలదు. దీనికంతా వర్తమాన వాతావరణమే కారణం. భిన్న సాహిత్య శాస్త్రాల సాంగత్యాలు కూడా ఉపకారకం అయినవి. మానవుడు బుద్ధిచేతనేమి, సాధనచేతనేమి పురోగమనంలో వున్నాడనే ఆశయం ఒకటి నాటుకొన్నది— ఇదే అన్నిటికీ మూలాధారం.

---

# ఉదయ గీతి

'సంపత్'

ఉదయగిరిసీలసామ్రాజ్యలోపలపాళి
తొలిసంజ నెదురుకొన నిలిచినది జలదాళి
కంకేళికుసుమసంకాశ నీరాజనము
పూజాప్రసూనమో హొం పుమల కై సేయ.

శుభవసంతవిభాత సుషమాపరీమళము
గుబులుకొను బంధూక కుసుమకింజల్కమ్ము;
హరిదంతకలికించి తారుణాస్యప్రభల
నలముకొను నవజీవనానందమధురిమము.

ఉదయసంధ్యాలికోజ్జ్వలితకుంకుమరేఖ
చెరగిపోయిన దిరుల కురు లొ త్రిగిలి నిదుర
ఈప్రభాతోత్సవ మ్మెదురుకొని మనలేక
అదరిపడు కేయింత బెదరి కురులే కదల.

పవమానమంజులప్రాభాతసౌరభము
చ. దుషశ్శైలూషి ఫలిత రాగోదయము
ముసురుకొని నాయెడద మురువుమోసినసోన
మధురించి రసధునీసుధ లూర్చినది లోన.

ఈ యుషశ్శైత్యమ్ము లెద పిసాళించినవి
సోయగము పదనైన తీయదనముల వలపు
ఈప్రశాంతమ్ములో ఈప్రభాతమ్ములో
బ్రతుకె మధురమ్మైన భావగీత మ్మెమొ.

'రసపిపాసీ!' కదలిరా వేల నీ మూల
అదె నవోదయగీతి, అదె మధూత్సవరీతి
అదె వసంతాభ్యుదయ హసితరాగజ్యోతి
లేదు మసనపుకీల - లేదు నరకజ్వాల.

యుగయుగానంతభానూదయోత్సవయాత్ర!
హిమపదాంకితకుసుమకోమలారుణపాత్ర!
అందుకో జీవనానందబంధురయాత్ర
అందుకో వాసంతమందారమధుపాత్ర !

---





అమరావతీ ఉష్ణీష చిత్రములు

# ఆ వీ, యి వీ

శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి

[నన్నుఁగూర్చి పూర్వతర భారతిలో శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు నేదేదో పొగడ్త గావించిరి. వా రట్లు కావింతురని నే నెఱుఁగను. దానిఁ జూచి తలవంచుకొంటిని. వారు నాపై నవ్యాజవాత్సల్యముతో నట్లు వ్రాసిరి గాని నా కది సహింపరానిది. అటకు వాడుకభాషతప్ప గ్రాంథికభాష నాకు రాదు. ఇంగ్లీషు అసలే రాదు. చిరశ్రవణమున నేనో సంతకిఁ గొంతకొంచెముగా నర్థమునటగాని యందు నా కేమాత్రము నెఱుకలేదు. తెలుఁగులో నేనో కొంత కంటాలుపడితి నమట తథ్యము. ఆంధ్రవాఙ్మయ సౌధనిర్మాణకర్మకారులలో నేను నొకఁడ నగుదు ననుకొని కొన్నాళ్లు కూలిపని చేసి మట్టిముద్దలు మోసితిని. చేతులు కడిగికొనుదశలో నిప్పు డున్నాను. నా యాధ్యాత్మిక పరిశ్రమమునకు సంబంధించిన విషయము లితరులకుఁ దెలియవలసినవి గావు. శ్రీ సత్యనారాయణమూర్తిగా రట్టివిషయము లేవేవి కొన్ని యేదేని ననుమానించి గ్రహించినను వాని లోఁతుపాతులు సరిగాఁ దెలియక వ్రాయుట సరికాదు. నాకుఁ బూజ్యులు గురువర్యులు నగు శ్రీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగా రవి గూర్చి నాకర్హత వారు ప్రశంస నెఱపిరి. అది మఱీ నాకు దుఃఖకరము. తెలుఁగున నేను నేర్చిన నాలుగుముక్కలకు వారిగురుత్వానుగ్రహము ప్రధానకారణము. నేను వారిశిష్యకోటిలో నొకమూల నుండఁదగినవాఁడను. పత్రికాపాఠకలోకమునకు నాయెడ నయథార్థభావన కలుగకుండుటకై యిది వ్రాసినాఁడను. వాఙ్మయవిషయమున నాపైఁ గొన్ని యప్పు లున్నవి. అవి యెప్పుడో తీర్పవలసినవి. కాని పెక్కేండ్లనుండి యుపేక్షతో నే నుంటిని. ఈశ్వరానుగ్రహమున్న నందుఁ గొన్నింటినేని యికఁ దీర్చుకొనఁ గల్గుదు నేమో!]

౧

కడచిన భారతిలో తెలుఁగు సకలకథాసారసంగ్రహము అయ్యలురాజు రామభద్ర విరచితము "శ్రీకృష్ణదేవరాయప్రేరణమున తదంకితముగా రచితమయ్యె" అని వ్రాసితిని. అది కృష్ణరాయప్రేరణముననే రచింపఁబడెనుగాని శ్రీకృష్ణదేవరాయనికి గాక శ్రీకృష్ణదేవుని కంకితము సేయఁబడినది. అం దిట్లు గలదు:

"కనకవస్త్రంబుగల మృదుతనువువాఁడు
ధర్మనూపురయుత పదాబ్జములవాఁడు
మించి వేదాంతముల సంచరించువాఁడు
ప్రాభి శ్రీ కృష్ణుఁ డను పేరఁ బరగువాఁడు."

"వ. మదీయభాగ్యవశంబున స్వప్నకాలంబునఁ బ్రసన్నుండై పరమమంత్రోపదేశపూర్వకంబుగా సకలకథాసారసంగ్రహంబు నకుఁ గృతినాయకునిఁ దన్నుఁ గావింపు మని హితోపదేశంబు చేసి యంతర్హితుం" డయ్యె.

స్వప్నవృత్తాంతమును గవి కృష్ణరాయల కెఱిఁగించెను. ఆరాజముఖ్యుం డి ట్లనియె.

నీవును బాలకృష్ణపద
నీరజభక్తుఁడ వార్యచిత్తమా
దావహసద్గుణుండవు ర
మాధిపునిం గలలోనఁ గాంచి య
ద్దేవుహితోపదేశమునఁ
దేజము నొందినవాఁడ విన్నిటన్
గావున నీ ప్రబంధము ప్ర
కాశముగా హరి కిమ్ము వాపునన్.

ఇందు పురాణాదులనుండి పుణ్యకథలను రామభద్రకవియే సేకరించిన ట్లున్నది. రాయలవారి సంస్కృతగ్రంథానుస్మరణము లేదు. ఉపలభ్యమానమగు గ్రంథము తుది పద్య మిది:—

కడు వచియింపరాని ఘన
కష్టము లెల్లను గృష్ణపక్కృపన్
గడచితి మింకనీఁదను ఘ
నస్ఫుటరాజ్యరమాభివృద్ధి చా
ప్పుడు నని మీరు గోరుటలు
బాపురె వ్యర్థములాయె నింక నే
నుడువఁగ నేల మృత్యు జడ
నూల్కొని కావఁగవచ్చు కోటులన్.

ఈతుదిపద్యము కృతికర్తదో కాదేని, కృతిపేరకునిదో యవసానమును దెలుపుచున్న ట్లున్నది.

శ్రీకృష్ణదేవరాయలవారి కడపటికాలపు కడగండ్లకే యీపద్యము కడుంగడు సరిపడునదిగా నున్నది. ఏకపుత్త్రుఁడు చనిపోవుట, తిమ్మరుసుకన్నులు తీయించుట, తత్పుత్త్రుని తిరుగఁబాటు, తగవులు .. ఈ సంక్షోభములో రాయల మరణము — ఇన్నింటి నీపద్యము ధ్వనించుచున్నది.

శ్రీకృష్ణరాయఁడు రామభద్రకవిని 'నీవును బాలకృష్ణపదనీరజభక్తుఁడవు' అన్నాఁడట. ఇక్కడ విశేష మేమనఁగా నుదయగిరిని జయించినప్పు డక్కడనుండి మిక్కిలి చక్కని బాలకృష్ణవిగ్రహమును శ్రీకృష్ణదేవరాయలు విద్యానగరమునకుఁ గొనివచ్చి దేవళము కట్టించి యందుఁ బ్రతిష్ఠించి పూజించుచుండువాఁడట.

ఆయన బంగరునాణెములందుఁగూడ నా బాలకృష్ణుని విగ్రహము ముద్రితమయి యున్నది. కృష్ణరాయలతోపాటు, రామభద్రకవియు నా బాలకృష్ణమూర్తిని గొల్చుచుండువాఁడు గాఁబోలును! దివ్యసుందరవిగ్రహమగు నా బాలకృష్ణమూర్తి యిప్పుడు మద్రాసు మ్యూజియములో పూజా పురస్కారములు లేకున్నను దర్శనీయమై యున్నది.

దొరకినవఱకు శ్రీ కృష్ణరాయకృతమగు సకలకథాసంగ్రహ శ్లోకము లివి:—

శ్రీరంభోధితపఃఫలేన మహతా
నీరాజితోరస్స్థల
స్తారాధీశదినాధినాథనయనో
ధారాధరశ్యామలః
యో వేదాంతగిరా మలక్ష్యమహిమా
దేవేశముఖ్యైస్స్తుతః
సోఽయం తిష్ఠతు మామకీనహృదయే
శ్రీవేంకటాద్రీశ్వరః.

సాంద్రానందఘనస్సమగ్రకరుణా
సంపూర్ణనేత్రాంచలః
మందాకిన్యధివాసమంజుళజటా
జూటో . . .
కళ్యాణాచలకార్ముకః కలయతాం
కళ్యాణమవ్యాహతం
చంద్రాలంకృతమౌళి రద్రితనయా
శృంగారితాంగశ్శివః.

శ్రీమా నభూత్తుర్వసువంశమౌళి
శ్రీతిమ్మభూపో జగదేకవీరః,
స దేవకీనామ్ని కళత్రరత్నే
ప్రాసూత ధీరం సుత మీశ్వరాఖ్యమ్.

స బుక్కమాంబాం పరిణీయ తస్యా
మౌదార్య గాంభీర్య వివేక శౌర్యైః,
దాక్షిణ్యకారుణ్యనయైశ్చ యుక్తం
లేభే తనూజం నరసక్షితీశమ్.

స బాల్య ఏ వావని మర్ణవాంతా
మత్యర్థ (?) శౌర్యేణ నిరంకుశేన,
మాంధాతృముఖ్యాన్ మహితాన్
మహీపాన్
యశోవిశేషై రఖిలా నజైషీత్.

బాహోర్వ్బలే నార్జితవిత్తజాతైః
కృతార్థయి త్వాఖిల వర్థి సార్థమ్,
కాశీ ప్రయాగాది మహార్హ తీర్థే
మహాంతి దానాని ముహు శ్చకార.

కులేన శీలేన గుణేన భక్త్యా
ప్రేమ్ణానుకూల్యేన చ సంయుతాయామ్;
నాగాంబికాయాం నరసక్షితీశః
ప్రాసూత మాం న్యక్కృతవైరివర్గః.

సోఽహం సుశంశ్లాఘ్యగుణాన్వితాయాం
తిమ్మాంబికాయా మిహ తిమ్మభూపమ్,
ఉత్పాద్యనా మాస్య సహార్థజాతై
స్సమార్పయత్ వేంకటశైలభర్త్రే.

ఏవం చ చేత స్యనవాప్య తృప్తిః
వాచాపి పూజాం కలయే కథం వా,
శ్రీ వేంకటాధీశితు రిత్యుదారం
చిత్తే విచారం కలయ న్నవాత్సమ్.

ఉత్సాహం మమ వీక్ష్య మద్గురు రథ
శ్రీవ్యాసతీర్థో మునిః
పర్యాలోచ్య పురాణశాస్త్రవివిధా
మ్నా యేతిహాసాదికాన్,
లబ్ధ్వా స్తత్ర కథా హరేః పశుపతే
స్సామ్యం నిరా స్య(రస్యా?)ధికం
విష్ణుం కీర్తయ సర్వథే త్యుపదిశన్
మహ్యం ముదా దత్తవాన్.

౨

ఈశ్వరసంవత్సర మార్గశిరమాస భారతిలో సూర్యరాయాంధ్రనిఘంటు కార్యస్థాన పండితులు శ్రీపిసుపాటి విశ్వేశ్వరశాస్త్రి గారు 'కొన్ని విశేషములు' అను పేరఁ బ్రకటించిన యాక్షేపవ్యాసమునకు సమాధాన మీక్రిందిది. తొలుత వారియాక్షేపములఁ జూపి నాసమాధాన మటుపైఁ జెప్పెదను.

## 'కొత్తడి'

శ్రీ శాస్త్రిగారి యాక్షేపము :

"అతని పరమసాధ్వి యతివ మాదాంబ
సతతశివాచారసంపన్న ధన్య
క్రొత్తడినెల్లను గొండొక్క పెద్ద
యుత్తమురాలు సద్ధర్మ పేతగాత్రి—
(బసవ. ౧-౧౩ పా.)

ఇట శ్రీ శాస్త్రిగారు "క్రొత్తడి = స్త్రీసమూహము" అని (పీఠిక ౧౧౮ పా.) యర్థము వ్రాసిరి. దానిని బలపఱుచుటకై "అది . పుణ్యచరిత్ర కులాగ్రగణ్య క్రొత్తడి సకలంబు... భార. ఉద్యో. ౩—౧౪" ప్రయోగము చూపినారు. కాని క్రొత్తడి శబ్దమునకు "౧-పతివ్రత, ౨-ముగవాలు, సభర్తృక" అను నర్థములు తప్ప స్త్రీసమూహమనునర్థముగాని, దానికిఁ దగిన ప్రబల ప్రమాణములుగాని కాన్పింపవు. మఱియు పై బసవపురాణములో "క్రొత్తడులం దెల్ల" అని సవరించి "క్రొత్తడులు = ముగవాండ్రు, సభర్తృకలు" అని యర్థము చెప్పిన సమంజసముగా నుండును. ఇట్టి సవరణల నెన్నింటినో శ్రీ శాస్త్రిగారు గ్రంథముసఁ జేసియేయున్నారు. మఱియు నిటఁగూడ మఱికొన్ని పాఠాంతరము లున్నట్లు శ్రీ శాస్త్రిగారే (ఫుట్ నోట్సులో) చూపియున్నారు. "క్రొత్తడులు" అనుబహువచనరూపమున క్రింది ప్రయోగము గలదు:

"అత్తలకు మ్రొక్కి తక్కటి
క్రొత్తడు లందఱకుఁ బ్రియము గొనలు నిగుడఁగా
న త్తఱిఁ దిలకించె వరవ
ధూత్తమయై సత్యభామ యుజ్జ్వలగరిమన్."
(హరి. ఉ. భా. ౮—౨౨౦)

ఇఁక నీయర్థమును బలపఱచుటకై యిచ్చిన భారతప్రయోగములో "క్రొత్తడిసకలంబు = స్త్రీసమూహ మంతయును" అని శ్రీ శాస్త్రిగా రర్థము చేసినట్లు వా రిచ్చిన యుదాహరణ భాగమునుబట్టి స్పష్టమగుచున్నది. కాని యీపద్యము నంతయును దిలకించినచో నీయర్థము యుక్తముగాఁ దోఁపదు. చూడుఁడు: —

కొడుకులకంటె నయ్యనఘుఁ
గోడలి కెక్కుడు గూర్తుఁ గోడలం
గొడుకులు నేయుభక్తి కటఁ
గోటిమడుంగులు భక్తి నాతఁడె
వ్వఁడుఁ దగఁ జేయుచుండు నది
పుణ్యచరిత్ర కులాగ్రగణ్య క్రొ
త్తడి సకలంబుఁ జూడ సభ
దైన్యముఁ బొందుట నూది వాక్కుటిన్.

—భార. ఉద్యో. ౩-౧౮౭.

ఇత్యాది.

నా సమాధానము:

పైయాక్షేపగ్రంథమున నేను "క్రొత్తడి" యని పదమును గ్రహించినట్లు కలదు. బసవపురాణమూలముద్రణమునఁగాని, పీఠికలోఁగాని నేను 'కొత్తడి' యనియే గ్రహించితిని గాని 'క్రొత్తడి' యని కాదు. తొలియక్షరమునకుఁ గ్రాముడి నేఁ జేర్పలేదు. బసవపురాణము చూడఁదగును.

కొత్తడిశబ్దమునకు 'పతివ్రత, మగనాలు, సభర్తృక' అని యర్థము—చెప్పుటకుఁ దగ్గ ప్రయోగములు నే నెఱిఁగినంతలో నా కెక్కడను గానరాలేదు.

శబ్దరత్నాకరకారులు "క్రొత్తడి" యని శబ్దరూపము గ్రహించుట, దానికి మగనాలు ...అర్థములు వ్రాయుట - రెండును సరిగా లేవని గుర్తించియే నే నీపద పదార్థములను బసవపురాణపీఠికలో చేర్చితిని. ఆపీఠికలోని పదములఁ గూర్చి నేను వ్రాసినది యిట్లు:

"శబ్దరత్నాకరమున కందని శబ్దములు, అంకినను దప్పురూపముతో నున్నశబ్దములు, తప్పుటీకతో నున్నశబ్దములు, సందిగ్ధరూప సందిగ్ధార్థములతో నున్నశబ్దములు నిందు గలవు." శ. ర. కారులు గ్రహించిన శబ్దరూపమును, అర్థమును సరియైనవి కావని నా యెఱుక.

బసవపురాణవ్రాఁతప్రతు లన్నింట 'కొత్తడి' యని యుండఁగా దిద్దరాదుగదా! ఇక్కడ పాఠాంతరము లున్నను నవి 'కొత్తడిలోపల', 'కొత్తడిలో నెల్ల' అని కలవు కాని 'కొత్తడి'కి పాఠాంతరము లేదు.

'కొత్తడులు' అని బహువచనరూపము భాషలో నా కెక్కడను గానరాలేదు. 'కొత్తడి' (స్త్రీ) సమూహార్థక మయినపుడు దానికి బహువచనరూప ముండనక్కఱలేదు.

'క్రొత్తడులు' అని రూపము కలదని శ్రీవిశ్వేశ్వరశాస్త్రిగారు చూపిన హరివంశ పద్యపాఠము సరియైనది గాదు. అది హరివంశపుఁ బూర్వముద్రణమునఁ గల తప్పు పాఠము. ఇటీవల వావిళ్లవారు ప్రకటించిన హరివంశములో

"అత్తలకు మ్రొక్కి తక్కిన
కొత్తడి యంతటికిఁ బ్రియము........"

అని పాఠము కలదు. ఇది శ్రీ గిడుగు రామమూర్తి పంతులుగారు వ్రాఁతతాటియాకుల ప్రతులఁ బరిశీలించియుద్ధరించిన పాఠము. ముద్రాపకులు దీనియోగ్యత గుర్తించి ఫుట్ నోటులో చేర్చి పూర్వముద్రణపాఠమును వ్రాఁతప్రతులలో లేనిదానిని ప్రధానపాఠముగా ముద్రించిరి. 'కొత్తడి యంతటి'కి

అన్న పాఠమే ఓరియంటల్ లైబ్రరిలోని హరివంశపు వ్రాఁతప్రతులన్నింటను ఉన్నది. మఱియు తంజాపూరి లైబ్రరి హరివంశపు వ్రాఁతప్రతులలోను ఇదే పాఠ మున్నది. 'కొత్తడి యంతటికి' అన్నదే సరియయిన పాఠము. ఒకప్రతిలో 'కొత్తడి యందటికి' అని కలదు.

క్రొత్తడు లందఱకు అన్న పాఠము హరివంశపు వ్రాఁతప్రతులం దెందుఁగాని కానరాదు.

మఱియు, తిక్కనభారతప్రయోగము గూడ ప్రాచ్యలిఖితపుస్తకశాలలో నేఁ జూచిన ప్రతు లన్నింటను (పదింటికిఁ బైగాఁ జూచితిని.) 'కొత్తడి' అనియే కలదు గాని 'క్రొత్తడి' యని (తొలియుత్తరము క్రాముడితో) కానరాలేదు.

శబ్దరూపము 'కొత్తడి' యగుట 'క్రొత్తడి' 'క్రొత్తడులు' పాఠములు నిర్మూలము లగుట నిరూపిత మయినది.

ఇఁక అర్థవిచారము :

బసవపురాణప్రయోగమునకు-'కొత్తడినెల్లను గొండొక్క పెద్ద-' అనుచోట - 'స్త్రీసమాజమందెల్లఁ గొంతపెద్దఱికము గాంచినది' అన్నయర్థము సుసంగతము. ఇక్కడ 'కొత్తడి = సుమంగలి' అర్థము పొసఁగదు.

హరివంశమున "అత్తలకు మ్రొక్కి" యన్నపద్యమునఁగూడ నేఁ జెప్పినయర్థమే పొసఁగును. సత్యభామ అత్తలకు నమస్కరించినది. తక్కిన అక్కడనున్న స్త్రీసమూహమున కంతకును ప్రియము కొనసాగునట్లు తిలకించినది - అని యర్థము.

తిక్కనభారతమున-"అది పుణ్యచరిత్ర కులాగ్రగణ్య, కొత్తడి సకలంబుఁ జూడ నథ..." ఇక్కడకూడ 'నాఁడుగుం పెల్లఁ జూచుచుండఁగా' నని యర్థము చెప్పఁదగును.

(౧) 'కొత్తడినెల్లను గొండొక పెద్ద యుత్తమురాలు', (౨) 'అత్తలకు మ్రొక్కి తక్కిన కొత్తడి యంతటికిఁ', (౩) 'అది పుణ్యచరిత్ర కులాగ్రగణ్య కొత్తడి సకలంబుఁ జూడ' — అను మూఁడుప్రయోగములును స్త్రీసమూహ మని యర్థము చెప్పవలసినవే యగుటను బర్యాలోచించి స్త్రీసమూహ మని యర్థము చెప్పితిని. కాని మఱియుఁ బరిశీలింపఁగా ఇట యుటీవల మఱికొంత విశేషము గానవచ్చినది.

కన్నడమున నీపదము గలదు. క్రీ. శ. ౧౨ నాఁటివాఁడు శబ్దమణిదర్పణకారుఁ డీపదమునకు 'కాకులగుంపు' అని, సేవకుల (బెస్త పల్లెవారి) గుంపు అని, అర్థము చెప్పినాఁడు. శబ్దమణిదర్పణమున 'సహజాలిలం గళ్' అనుప్రకరణమున 'కొత్తళి= కాగెయ మొత్తం, బెసదవర నెరవి'— అని కలదు. మఱియునందే, 'ప్రయోగసారప్రకరణము'న 'కొత్తళి = కాగెగళ మొత్తం' అని కలదు. శబ్దమణిదర్పణకారుని నమ్మి, శబ్దసార, కర్ణాటకసంజీవన, కర్ణాటకనిఘంటు, శబ్దమంజరులు, (అవి ప్రాచీనకర్ణాటనిఘంటువులు పద్యగ్రంథములు) కొత్తళి శబ్దమునకు, కాకులమొత్తము, బెస్తవారి మొత్తము అని అర్థము వ్రాసిరి.[1] తదనుసారిగా కిట్టెల్ నిఘం

1. ఈ పద్యనిఘంట్వర్థములను నేఁ గోరఁగా విశ్వవిద్యాలయ కర్ణాటపండితులు శ్రీమాన్ శేషయ్యంగారు నా కుద్ధరించి యిచ్చిరి.

టువుస కొత్తళి పదమున కీ క్రిందివిధమున నర్థ మున్నది.

"కొత్తళె = కొత్తణి. (1) A flock, as of crows (కాగెయ మొత్తం శబ్దమణిదర్పణ-; కాగెయనెరవి - కబ్బిగర కేపిడి-౧౨, తోటద అర్యని శబ్దమంజరి-30.) (2) A multitude or assemblege, as of fishermen, etc. (బెస దవర నెరవి - శబ్దమణిదర్పణ-౧) చూ. గిరిజా కల్యాణ ౬,౫౬౭కు తర్వాత. పి. 3, ౫౫కు తరువాత. కొత్తు౨= A bunch, A cluster..."

గిరిజాకళ్యాణమున ౬ అశ్వాసము ౫౫ వచనము- "సిడిల గణదంతె, (పిడుగుల గణమువలె) కాక్కిర్చిన గూళెయదంతె (కార్చిచ్చు మొత్తము వలె) వడబానలన పడెయంతె కాలాగ్నియ మాలెయంతె, మారియ మారియంతె మృత్యువిన కొత్తళి యంతె (మృత్యువు మూఁకవలె) అంతకన సంతతియంతె భైరవన బళగదంతె (భైరవుని బలఁగము వలె), ముంతిర్ద రక్కసవడె యనడువెనిందిర్ద ...".—

అని కలదు. ఇది రాక్షస సైన్యవర్ణన ఘట్టమున నున్నది. ఇందు, కొత్తళి = గుంపు అన్న యర్థముననే కలదు. కొత్తళ, కొత్తళి, కొత్తడి, మూఁడును ఒక్క పదపు రూప భేదములే —

తెలుఁగున నిప్పటికి దొరకిన మూఁడు ప్రయోగములును స్త్రీ ప్రసక్తము లగుటచే నేను స్త్రీసమూహ మని యర్థము చెప్పితిని. కాని పై కర్ణాటప్రయోగములఁ బరిశీలింపఁగా నాపదమునకు మొత్తము, గుంపు, మూఁక అన్నయర్థమే చెప్పఁదగినట్లు తేలు చున్నది. ౧౨-వ శతాబ్దివాఁడే యయినను శబ్దమణిదర్పణకారుఁడు చెప్పిన యర్థములు సరియయినవి కావు. కొత్తళిపదము కొత్తు, గుత్తి అను తెలుఁగుపదములకుఁ జేరికగల పదముగా గుర్తింప నగుచున్నది— తొత్తు, తొత్తడి, ఎత్తు, ఎత్తడి, ఇట్టిపదములు. ఆంధ్ర కవులు ముగ్గురును 'కొత్తడి'పదమును స్త్రీల సమూహమును గూర్చియే ప్రయోగించుట వింత.

ఏదయిన విడ్డూరము జరగునపుడు గుంపు మూఁగును. అట్లు మూఁగిన మూఁకకు తొలుత నీ 'కొత్తడి' ప్రయోగ మున్నట్లున్నది. కర్ణాటక ప్రయోగములు 'కాకుల' గుంపు —. బెస్తల గుంపు అందుకు సాధకములుగా నున్నవి. తెలుఁగునఁగూడ భారత ప్రయోగమున కౌరవసభలో ద్రౌపదీవస్త్రాపహారణము వేళ నావిడ్డూరమును జూచుటకు ప్రజ మూఁగినది. 'కొత్తడి సకలంబుఁ జూడ' ననఁగా- అట్లు మూఁగిన (యూఁడు)మూఁక యెల్లఁ జూడఁగా నని యర్థము సుసంగత మగుచు.

హరివంశ ప్రయోగము నిట్టిదే. సత్యభామకుఁ గల్గిన యభ్యుదయపు విడ్డూరము నపుడు మూఁగిన స్త్రీలగుంపది.

బసవపురాణ ప్రయోగము మాత్రము 'విడ్డూరము చూడవచ్చిన ప్రజ మూఁక' యన్న యర్థమునఁ గాక సరిగా 'స్త్రీ సమూహ' మన్న యర్థముననే యున్నది. అర్థచర్చ నిఁక విడిచెదను.

ఇంక నిక్కడ నొక్క విశేష మున్నది. కన్నడమున శబ్దమణిదర్పణకారుఁడు కొత్తళి (ణి) పదమును 'ళి' కారాంతమునుగా గ్రహించెను. తెనుఁగు వ్రాఁతప్రతులలో

హరివంశమున 'ఱ' అక్షరము వ్రాఁత 'ట' అని గుర్తింపఁదగినట్లు కానవచ్చుచున్నది. అది 'ఱ' లిపికి వ్రాయసకాండ్ర పారంపర్యక్రమమున నేర్పడిన మార్పుతీరనఁదగినట్లున్నది. పూర్వము తెలుఁగున ఱ - డ- లిపులు తార్మా అగుచున్నకాలమున రచితములయిన గ్రంథములు భారతాదులు. ద్రవిడకర్ణాటములఁగల ఱ అక్షరము నన్నయాదుల తర్వాతఁ దెలుఁగున 'డ'గా మాఱినది. నేఁడు ఱ- ర- సాంకర్యమువోలె నాఁడు ఱ- డ- సాంకర్య ముండెఁబోలును. కొందఱు నేఁడును ర- ఱ- లకు భేదమును లిపిలోను యతిప్రాసములలోను జాగ్రత్తగాఁ బాటించుచున్నారు. కొంద ఱవ్యవస్థితముగాఁ బాటించుచున్నారు. కొందఱు పాటించుటే లేదు. నాఁడు నన్నయాదులు గూడ నిట్లే 'ఱ', 'డ' భేదవిషయమున వర్తిల్లినట్లున్నారు. ప్రసక్తమయిన యీ క్రిందిపద్యమున తిక్కన నాల్గు చరణములందును 'ఱ' ప్రాసమును బాటించినాఁడు.

కొఱుకుల కంటె నత్యున్నత
    గోడలి కెక్కుడు గూర్తుఁ, గోడలుం
గొఱుకులకంటె నెంతయును
    గోటిమడుంగులు భక్తి నాకు నె
ప్పఱుఁ దగఁ జేయుచుండు నది
    పుణ్యచరిత్ర కులాగ్రగణ్య, కొ
త్తఱి సకలంబుఁ జూడ నథ
    దైన్యముఁ బొందుటఁ జూచి పాక్కటిక.

ఈ నియమమును దిక్కన సర్వత్ర పాటింప లేదు. ఇట్లు 'కొత్తడి' శబ్దార్థము స్పష్టపడుటచే శ్రీ విశ్వేశ్వరశాస్త్రిగారీపద్యమునకుఁ జెప్పిన యర్థము కుడ్యములేని చిత్రమయినది.

## ఆహిపెట్టు

ఆక్షేపము

"ఆహిపెట్టిరి కొన్నిగడ్డాగ్రహార
వృత్తి యేనూఱురూకల[1] వృత్తమునకు—
క్రీడాభిరామము—పా, ౮౦.

ఇందు 'ఆహిపెట్టు=తాకట్టుపెట్టు' అని శ్రీ శాస్త్రిగారు (పీఠిక పా, ౧౨౩) అర్థము వ్రాసినారు. ౮౦ పాఠములో మూలమునఁగూడ నిట్లే యున్నది. కాని 'ఆహిపెట్టు' అనుపదమే యెక్కడను గాన్పింపదు. కావున నిట 'ఆధిపెట్టు' అని యుండవలయును. ఆధి శబ్దమునకుఁ దాకట్టు అనునర్థము గలదు.

ఈ క్రింది ప్రయోగములోఁగూడ 'ఆధిపెట్టు' పదము గలదు.

"గ్రహణసంక్రమణాదుల రాచనగరఁ
గానుకీసంబు వెడలమి గ్రాసమునకు
నాధిపెట్టిరి క్షేత్రంబులందుఁ గొన్ని
లెస్సయుండునె గృహకర్త లేనిబ్రదుకు.
(వసుచరిత్ర—౩—౩౮)"

దీనికి నేఁ జెప్పు సమాధాన మిది:

నిఘంటువులలో ఏకమాత్రప్రయోగముతో ఎన్నో పదములు పరిగృహీతములయినవి.

వ్రాఁతప్రతిలో నున్న "ఆహిపెట్టు" ప్రయోగము సరికాదన్న యపనమ్మకము నాకు లేదు. కాన దానిని నే దిద్దలేదు. 'ఆధి' పద మొకటి 'తాకట్టు' అర్థముగలది ఉన్నంతమాత్రాన 'ఆహి' ఉండ దన వచ్చునా?

1. 'రూకలవృత్తమునకు' — అని వ్రాఁతప్రతిలో నున్నది. అట్లే ముద్రించితిని. 'ఏనూఱురూకల విత్తమునకు' అని దిద్దిన సముచితముగా నుండు ననుకొందును —వే. ప్ర.

కావున హరిశ్చంద్రోపాఖ్యానమున ఎల్ల వ్రాఁతప్రతులలో ‘ఆహికంబులు వెట్టి’ అన్న ప్రయోగము గానవచ్చుచున్నది. ‘ఆహికంబులు వెట్టియుఁవి దక్కుమితులు సాహసంబునఁ బల్కి’ (చూ-ఉత్తరభాగము). బ్రౌనుదొరగారి పండితులు ఇందు ‘తాకట్టుపెట్టి’ అని యర్థము వ్రాసిరి. తేవప్పెరుమాళ్లయ్యగారు వ్రాఁత ప్రతులను బ్రౌనుదొరగారు వ్రాయించినటీకను బరిశీలించిన ‘ఆహికము’ తాకట్టు అనునర్థముతో ప్రకటించిరి (చూ.౧౫౩ పుట). పిదప, శ్రీవేంకటరాయశాస్త్రిలుగారు మరల నా గ్రంథమును బ్రకటించుటలో ఆహికము శబ్దరత్నాకరాది నిఘంటూద్ధృతము గాకుండుటచేఁ గాఁబోలును ‘ఆహితము’ అని దిద్దిరి (చూ.౧౫౧ పుట). తాకట్టు అనియే యర్థము వ్రాసిరి. ఆపాఠము వ్రాఁతప్రతులలో లేదు. తెలుఁగున ‘ఆయకము’ అనుపదము తాకట్టు అనునర్థమున వ్యవహారమునఁ గలదు. ఆయకమురూపాంతరము ‘అహాకము’ అని యుండునని కాఁబోలును బ్రౌను, సీతారామాచార్యులు తమ నిఘంటువులలో కావున ప్రయోగమును ‘అహాకము’ గా గ్రహించిరి. వ్రాఁతప్రతులలో లేని ‘అహాకము’ రూపము గ్రాహ్యము కాదు. కావున నవనాథచరిత్రమునఁగూడ ‘ఆహికము’—కలదు ‘ఆహికంబులు వెట్టి యప్పులువార, వృద్ధికోసంగుదు..’ (చూ.౧౫౩పుట). ఆహి, ఆహికము రూపభేదములు కాఁబోలును. ఆహిపదప్రయోగము ఇంత సాధకసామగ్రి కలది. శ్రీనాథ ప్రయుక్తమయిన యీ ‘ఆహి’ప్రయోగము విడనాడి యీయర్థమున శ్రీనాథరచనముల నారగించి జీర్ణించుకొని కవితాబలము గడించినవాఁడు పెద్దనామాత్యుఁడు “ఆధి వెట్టిరి” అని ప్రయోగించుట యేల యని పరిశీలింతును గదా!- మనుచరిత్రమునఁ గూడ ‘ఆహివెట్టిరి’ అనియే యుండుట కానవచ్చెను. ప్రాచ్యలిఖిత పుస్తకశాలలో మను చరిత్ర వ్రాఁతప్రతులు ౧౫ ఉన్నవి అందు ౧౧ ప్రతులలో ఆహివెట్టిరి ఉన్నది. తక్కినవి కొన్ని కాగితపుఁ బ్రతులు, ఇటీవలివి. అందు ‘ఆధివెట్టిరి’ ఉన్నది.

ప్రాకృతమున, గాథా కథా శబ్దములకు ‘గాహా’, ‘కహా’ రూపములు కలవు. ‘ఆధి’ శబ్దమునకు ‘ఆహి’ ప్రాకృత రూపము కాఁబోలును! థ, ధ లకు హకారాదేశము కొన్ని ప్రాకృతములందు గానఁగును

## లేఁడు

ఆక్షేపము.

“వీఁడిన తెల్లనాకులను
వేడెము సేయుచు వీథి వచ్చుచు
న్నాఁడు మడిచి తిండి తిని
నాఁడుసుమీ యిఁకమీఁద నీశకో
లేఁడఁగఁ బోయెడిన్ గరణ
దేశప్రజాణుఁడు గాఁగవో ప్రసి
ద్ధాఁడు పణోపహారపరి
పాటి రొయ్యింగఁగవచ్చు వీనిచేన్.”
—క్రీడా. ౫౩ పా.

ఇట “లేఁడు= వెదకు” అని (పీఠిక-౧౩౧ పా.) శ్రీశాస్త్రిగా రర్థము వ్రాసినారు. కాని లేఁడుధాతువున కీయర్థమును, తన్నిర్ణాయక ప్రయోగములును గాన్పింపవు. ఇదియేగాక యీ పద్యమునఁగూడ వీరు వ్రాసినయర్థ మేమాత్రమును సందర్భోచితముగా లేదు. శబ్దరత్నాకరములో నీపదమునకు ‘లెండు, శయనించు’ అనునర్థము వ్రాసి,

“అతివ పూర్ణేందుభీతిఁ దదశ్మశాలఁ
లేఁడి యతఁ డందు నినుమడి తీవ్ర దోఁప

యింటికి పై నుంట కాదని యింటికి పైకిఁ
దెచ్చుకొంటి పటించుఁ జెలి తీర్చువెసలు."
—ఆముక్త. ౫-౧౫౬.

ఉదాహరణముగా నీయఁబడినది. ఈయర్థమే క్రీడాభిరామప్రయోగమునఁగూడ నెంతేయు సమంజసముగా నున్నది. ఈ బ్రాహ్మణుఁడు పూటకూటింట భుజించి తాంబూలము వేసికొనుచు నెక్కడనో శయనింపఁబోవుచున్నాఁడని యిట భావము. మఱియు,

అనలునిఁ గాఁడుచుం జముని
  నాడుచు రాక్షసుఁ జూడుచుం గప
ర్దిశోపలు మాఁడుచుం దనుజ
  ద్వేషులు దోడుచు గాడ్పుకడ్పులోఁ
గునకులు గోడుచున్ వరుణు
  గుండియఁ దేఁడుచు వాహనేంద్రు నం
దిని జన వేఁడుచున్ నృపతి
  తేర్పులు దీడుచు వెండి వాఁడిగన్.
కళత్థ.—౫-౧౨౩.

"గుండియఁ దేఁడుచున్ = గుండియయందు శయనించుచు" ఇతరులను వెదరించునప్పుడు 'నీగుండెలలో నిద్రపోవుదును' అనుట వ్యవహారమునఁ గలదు. దానినే యీ కవి యిట గ్రహించినాఁడు. మఱియు, 'తేఁడు' ధాతువు సమానార్థకమగు 'తెండు' ధాతువునకుఁ గూడ 'శయనించు' అనునర్థమే సుప్రమాణముగాఁ గాన్పించుచున్నది. పైవిషయములన్నియుఁ బరిశీలించి చూడఁగాఁ గ్రీడాభిరామప్రయోగములో శ్రీశాస్త్రిగారు వ్రాసిన యర్థము సమంజసముగా లేదని తోఁచక పోదు."

ఇందుకు నా సమాధానము:

ఇందు 'తేఁడు' 'శయనించు' అను నర్థము గల దనుటకు శ్రీ శాస్త్రులుగారు ప్రయోగములఁ జూపిరి. 'తేఁడు' కు 'వెదకు' అనునర్థము కూడఁ గల దనుటయే నాయాశయము గాని 'శయనించు' అను నర్థము లేదనుట గాదు. 'వెదకు' అర్థమున 'తేండుదల్, తేడుదల్, తేడి తేడి' ఇత్యాదులు తమిళమున సర్వసామాన్యముగా వాడుకలో నుండును. 'తెండు తేఁడులు' రూపాంతరము లగుట శ్రీ శాస్త్రులుగారు నంగీకరించిన విషయమే కదా. తెలుఁగునఁ గూడ "వాఁడు తెండుకు తెండుకు అవస్థ పడుచున్నాఁడు నే నన్నమాటకు" ఇత్యాది వ్యవహారము నా జన్మదేశమగు కృష్ణామండలమున నున్నది. 'తెండు'కు "తిరుగఁ దోడు, కలఁబెట్టు, పెనఁగులాడు, వెదకు, తదేక విచారముతో నుండు" ఇత్యాది విధముల నర్థము సంగత మయియున్నది.

ఆముక్తమాల్యదా కకుత్స్థవిజయ ప్రయోగములు నేఁ జెప్పిన యర్థమునకుఁ గూడఁ బొసఁగునవియే— "చంద్రకాంత శిలాశాలలోఁ దాపముగొల్పని పట్టు వెదకి"- అనియు, "వరుణుని గుండెల వెదకుచుఁ (గలఁబెట్టుచు) —" అనియు మీఁదిపద్యములలో నేఁ జెప్పినయర్థము సరిపోవుచు నే యున్నది. మఱియు నాముక్తమాల్యదాపద్యమున ప్రాచీనప్రతులలోఁ గొన్నింట,—

అతివ పూర్ణేందుభీతిఁ దదశ్మశాలఁ ద్రేణి
యతిఁ డంచు నినుమకి తీంద్రఁ దోఁప—

అని కలదు.— ఓరియంటల్ లైబ్రరి చూ ౧౨-౨-౧ వ్రాఁతప్రతి. దీనికి శ్రీనివాసీయవ్యాఖ్యలో "యువతి పూర్ణచంద్రుని మీఁద భయపడి చంద్రకాంతశాలలో ప్రవేశించి, ఆచంద్రకాంతశాలయందు చంద్రుడు మిక్కిలి వేంద్రముగా కానవచ్చేటప్పటికి" అని కలదు. సి. బ్రౌనుదొరగారుకూడఁ దమ నిఘంటువున నీపట్టున ప్రయోగమును 'త్రేణి' యనియే గ్రహించిరి. బ. సీతా

రామాచార్యులవా రేలాగో, బ్రౌనుదొర గారి పాఠమును గ్రహించినవారు గారు. మఱియు, బ్రౌనుదొరగారు 'త్రేణి'కి ఆముక్తమాల్యదనుండియే ప్రయోగాంతరమును గూడఁ జూపిరి- అది యిది.

క. హద్దుకొని యొక్క కొండలు
వత్తెరువుంగట్టఁ బరిధి యంపఱ్రికుఁ దాఁ
దిత్తి యొకటి గాని త్రేణి మ
ఱుత్తర ముత్తరమటంచు నొకప్రొద్దుకడన్.

శ్రీ వేంకటరాయశాస్త్రిలవారీపాఠమునే గ్రహించిరి. మఱియు వ్యాఖ్యలో నిట్లు వ్రాసిరి.

'తేండి' దొరికిన వ్రాఁతప్రతు లన్నింటను 'త్రేణి' అని యున్నది. 'త్రేణి' అని తెండి (= శయనించి) అనుటకు ఈ వ్రాఁత పుస్తకములలో తఱచుగఁ గలదు. 'తేఁడు' ధాతువు 'తెండు' ధాతువునకు రూపాంతరముగా శ. ర. లో నున్నది. కొన్ని దేశ్యశబ్దములందు తొలి యక్కరమునందలి రేఫవడులు అంతరించుట ప్రసిద్ధమే. డకారముతావున ణకారము నిలుచుటయు సిద్ధమే. ఉ: అణఁగు అడఁగు, పోణిమి పోఁడిమి ఇత్యాదులు. కావున నిట కవిప్రయోగించినపదము 'త్రేణి' అని యుండునని యూహింపబడినది. ఆ వ్రాఁతపుస్తకములలో టీకయుం గలదు. అందు 'త్రేణిమఱి' 'నిద్రమేల్కాంచి' అని యర్థమును వ్రాయఁబడినది."

'తేఁడు'కు వెదకు అర్థమును నిరాక్షేపముగా నిరూపించు ప్రయోగ మిది యొకటి గలదు.

క. జూదంబుఁ బన్నిదంబును
వాదునుఁ బతితోడఁ దేఁడ వలవదు కడుఁ జో
రా దయ్యెనేని భృత్యులు
క్షేమము గాకుండు గెలుపు పెనుపఁగవలయున్.

—భోజరాజీయము.

ఆముక్త మాల్యదపీఠిక ౫౧-వ పుటలో శ్రీ వేదము వేంకటరాయ శాస్త్రిలవారీ ప్రయోగమునుగూడఁ జూపి యిట్లు వ్రాసిరి. "తేఁడు అనఁగా వెదకుట అని యర్థము నఁ బ్రసిద్ధము. ఆయర్థమున శ. ర. లేదు."

తేఁడుకు 'వెదకు' అర్థము స్పష్టమగుచుండఁగాఁ, దదనుసారిగా క్రీడాభిరామ పద్యమునకు నేఁ జెప్పిన యర్థము "ఏమాత్రము సందర్భోచితముగా లేదు", "సమంజసముగా లేదు"- అట! ఏలో?

ఆ బ్రాహ్మణుఁ డొరుఁగంటికి వేడుకల మీఁద వేడుకలు దిలకించుటకు, విహరించుటకు వచ్చినాఁడు గాని యారగించి నిద్రించుటకుఁగాదు. దిట్టముగా తిండి దిని తాంబూల చర్వణము సేయుచు వేడుకపట్టులు వెదకఁ బోవుచున్నాఁ డను నర్థ మేల సమంజసము గాదు?

## నారికేళ బకజాతీయములు

కేయూరబాహుచరిత్రమున నారికేళ బక మనుకొక్కెర, అది కొబ్బరిచెట్టుపై వసించునదే యగుట కలదు గాన, దానిఁబట్టి నారికేళబకజాతీయములు అన్న పదమునకు నారికేళముపై వసించు బకముల తెఱఁగలవి అన్న యర్థమును 'కాఁబోలును' అని సందేహముతోనే నేను వెల్లడించితిని. శ్రీ శాస్త్రిలుగారు కోళ్లు నారికేళజాతివి, బకజాతివి కలవనుట కాధారముగా వెల్లడించిన దశకుమారచరిత్రపద్యముల నేనప్పుడు చూడలేదు - వాని వెల్లడించినందుకు శ్రీ శాస్త్రిలవారియెడఁ గృతజ్ఞుఁడను.

## పదరు

ఈపదమునకు (దబ్బనము?) అని సందేహామే తెల్పితిని - ముల్లు పుచ్చి కొట్టడఁచు సామెత నాకుఁ గ్రొత్తది కాదు. శ్రీశాస్త్రిలుగారును దదర్థనిర్ణయమునకుఁ బ్రయోగాంతరముఁ జూపలేదు. బసవపురాణపీఠిక వ్రాయునాఁడు - నాకు 'కదురు బద(దు?)రు' అని యెక్కడో చదివినట్లు, అక్కడ దబ్బనము, పెద్దసూది అర్థము పొసఁగినట్లు స్మరణ ముండెను. ఎంతో వెదకితిని దొరకలేదు - ఎన్నటికే నెవ్వరేని కనిపట్టఁగల్గుదు రన్నయాసతో నిరూపింపఁగుదురని నా స్మరణమును సందేహచిహ్నముతో వెల్లడించితిని.

## నంజు

అంజు - పదము నే నెఱుఁగనిది గాదు- అంజెవపుగాక ననుఁ జెంతం జేరఁగనీక - అన్న పద్యము నానాలుకమీఁదనే యున్నది. నంజు - కూడఁ దదర్థము గలదనుటకే దానిఁ దెలిపితిని. - వాఁడు నంజి నంజి మాటాడుచున్నాఁడు - ఇత్యాదివ్యవహార ముండుటను బట్టియు, నంజుదురే శరణాగతవజ్ర - చరణమున, దీన హల్యతి (నకారయతి) పొసఁగుటనుబట్టియు, నట్లు వ్రాసితిని.

## బెడంగు

బసవపురాణమున—

కోర బెడంగనో కుంచెడు శేవో,
అరగింపఁగఁ బెట్ట నేరకుంటినో—

అని గొడగూచికథలో ద్విపద గలదు. ఇందు 'బెడంగనో'కు అర్థము కుదురక తంటాలుపడితిని. శ. ర. బెడఁగు = అందగించు, ఇత్యాద్యర్థములు పొసఁగవు. వెడఁగు=వికారము అర్థముగల దగుటచే, పాలగిన్నె పాలు త్రాగుట కనువుగా లేక మూతి వెడల్పై వికారముగా నున్నదని త్రాగవైతివా? అని యర్థము కుదురుట గుర్తించి, 'అని+ఓ, (అనియో) ఉండక, 'అనో' ఉండుట అతృప్తి గొల్పఁగా- సందేహచిహ్నముతో నాయర్థము, పీఠికలోఁ దెల్పితిని. ఈనడుమ శ్రీరాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారొకనాఁడు సంభాషణలో భీమకవికన్నడగ్రంథమున, 'గిన్నె తోమనైతినా' అని పరివర్తన ముండుటను దెలిపిరి; తెలుఁగున, బెడఁగు = శుభ్రపఱుచు అనుటకు ప్రయోగాంతరము లున్నఁ గదా యాయర్థము చెప్పఁగుదురుట అనిరి. శబ్దరూపనిష్పత్తిరీతిని పూర్వ పూర్వము గుర్తించిన, వెలుఁగు, బెడఁగు — పదము లొక్కదానినుండి యేర్పడినవే యగు ననుకొంటిమి. కాని భాషలో ప్రయోగము లుండవలదా? కొన్నాళ్లకు భారతిలో ప్రకటితమయిన త్రాళ్లప్రొద్దుటూరి శాసనమున * —"తెలుపెక్కఁ గఱవోవ బెళగిన పునుక మించిన వెండికోరగాఁ జేతఁ బట్టి" అని ప్రయోగము గానవచ్చినది. ఇందు 'బెళగిన' అనువో ళ — గల నడుమ సున్న లేదు. బెళగు, బెడగు రూపభేదములే. సోమనాథుఁడీధాతువును సానుస్వారముగాఁ బ్రయోగించెను. శాసనము ననుసరించి, 'కోరను బెడ

* ఈశ్వర మాఘ భారతిలో, శ్రీ నేలటూరు వెంకటరమణయ్య, నుట్లూరు వెంకటరామయ్యగారలు ప్రకటించిరి.

గనో' అని సోమనాథుని పాఠము సంస్కరించుటా? అర్థము కుదిరినది గాని అది సానుస్వారపదమా నిరనుస్వారపదమా? సందేహామే.

## దోహరి

క్రీడాభిరామమున "...దాత్యూహవ్యూహంబులుం గలిగిన మోహరివాడయుండు..." —"కాలుదును జేనవెట్టి" ఇత్యాదిపద్యము కుట్రపువానివర్ణనముతో నున్నది. దానిఁ బ్రకటించునాఁడు మోహరివాడ యనఁగా నా కర్థము తెలియదయ్యెను. "యుద్ధభటులుండు వాడ యనుకొందును-" అని టీకలో వ్రాసితిని. మోహరము = యుద్ధవ్యూహము అర్థముండుటనుబట్టి య ట్లను మానించితిని. - ఇటీవలఁ దెలియవచ్చిన క్రొత్త యర్థము:

కాశీఖండము సప్తమాశ్వామున,

సీ. ప్రార్థింప నున్నాఁడు పాదాగ్రముల వ్రాలి
వెలివాడవాఁడు తద్విప్రకులుని-

ఇత్యాదిపద్యమున,

దీవింప నున్నాఁడు తెలిసి దోహరిబంటుఁ
జెవి వక్షమాలికఁ జెరిచి ద్విజుఁడు

అన్నచోట 'దోహరిబంటు' ఉన్నాఁడు. ఈతఁ డిక్కడ మఱియు చండాలుఁడు- మాల- వెలివాడవాఁడు - అనియుఁ జెప్పఁబడినాఁడు.

మఱియు నాముక్తమాల్యదలో, "అనినఁ గహకహ నవ్వి యద్దోహరికి సుర ద్రోహి యిట్లనియె - (౬, ఆశ్వా. ౩౧ వచనము -) అని కలదు. ఇక్కడ 'దోహరి' యనఁగా మాల(దాసరి), చండాలుఁడు- వెలివాడవాఁడే. అచ్చుపుస్తకములలో "అద్దాసరికి సురద్రోహి యిట్లనియె" నని కలదు- కాని, ఓరియంటల్ లైబ్రరిలోని వ్రాఁతప్రతులలో ఒక్కదానఁ దక్కఁ దక్కిన యన్నింటను 'దోహరి' అనియే కలదు. బ్రౌనుదొరగారును, సీతారామాచార్యుల వారును 'దాహరి' యని గ్రహించి నేఁ జూపిన యాముక్తమాల్యదాప్రయోగము నే యుదాహరించిరి. 'దాహరి- దాసరి' రూపభేదము లని వారితలఁపు- కాని యాపదము 'దోహరి' యే. ఆముక్తమున - 'దోహరికి- సుర - ద్రోహి' యని 'దో - ద్రో' యతి సంగతి యుండుట, వ్రాఁతప్రతు లన్నింట దోహరి యనియే కానవచ్చుట, కాశీఖండమునను 'దోహరి బంటు' ఉండుట — అది 'దోహరి' యే యనుటకు సాధకములు. మఱియు, బసవపురాణమునను, పండితారాధ్యచరితమునను 'దోహరి కక్కయ్య' యనుశివభక్తుని చరిత్ర మున్నది.

శివభక్తులయిన మాలలతో ద్విజులు సరిగా రని చెప్పుకథాసందర్భములలో,

"మక్కంటిగణము దాఁ గక్కయ్య నాఁగ -
నీద్విజులకు వైరి...

(విష్ణుమాహాత్మ్యము వర్ణించుపురాణభట్టును ముక్కలుగా నఱికి చంపెను.)—

దోహరి కక్కయ్య మాహాత్మ్య మెఱిఁగి -
యూహింప భక్తుల నొం డనఁదగునె —"

బసవపురా. ౭. ఆశ్వా.

అని కలదు. —

పండితారాధ్యచరితమున,

కలసె నంత్యజుఁ డనఁగా నెట్లు వచ్చు -
నిక్క మట్లునుగాక కక్కయ్యగణము,

(బసవపురాణకథయే) -

> అటు గాన దోహరు లన నెటు వచ్చు,
> పటుతరంబగు భక్తిపరుల పెంకియును -
>
> (ప్రథమప్రకరణము)

అని కలదు. ఇన్నింటినిబట్టి 'దోహరి' మాల యని తెలియఁగనగును.

మఱి యీయన్నింటికంటె వ్యక్తమగు నట్లు ఓరియంటల్ లైబ్రరి ౧౪-౪-౩౮ నెంబరు పుస్తకమున,

"కళ్యాణమందు దోహర కక్కయ్య అనేభక్తుడు తోళ్లతిత్తులు కూర్చేవాడు, దోహరులకులమందు జనియించి తనపూర్వాశ్రమం ఖండించి వీరశైవదీక్ష..." ఇత్యాదిగాఁ గలదు.

దీనిఁబట్టి దోహరి పదము, 'గోడారి'కి పర్యాయపదమని స్పష్టపడినది. గోడారులు తోళ్లతో చెప్పులు, తిత్తులు కుట్టుచుందురు. వారు మాలవారిలో నొకతెగవారు. 'మాలకు మాంసంబు మఱి గోడారికిని, దోలును నన్నట్టు..—బసవపురాణము. ఈద్విపద ౪-౪-లో భాగవతమున నున్నట్లున్నది సరిగాదు. క్రీడాభిరామమునఁ గూడ 'మోహరివాడ'ను 'దోహరివాడఁ' జేయవలెనేమో! 'దోహరులు' చెప్పులు మొదలగు తోళ్లకుట్రమే కాక వెలివాడవారికి 'రవికలు' మొదలగు బట్టల కుట్రముకూడఁ జేయువారు గాఁబోలును! ఇట్టియాచారము తెలుఁగునాఁటఁ గొన్నియేండ్ల క్రిందటిదాఁక సాగుచున్నట్లు వినికి.

---

# వలసరాజ్యములు : క్వినైన్

---

ఉష్ణము అత్యధికముగానుండు ప్రాంతములకు వలసపోవలదిన యూరోపియనులు తాము వెళ్లే ప్రాంతము చాల సారవంతమైనదనియు, పంటలు విస్తారముగా పండుననియు, వాతావరణపరిస్థితుల నుండి రక్షణ చేయఁగొనగల్గిన సుఖముగా జీవితయాత్ర సాగింప వచ్చుననియు తలంచుచుందురు. అక్కడికి వెళ్లినతర్వాత తాము అనుకొన్నదంతా యథార్థముకాదని తెలుసుకొందురు. విశ్రవిరామము లేకుండా పనిచేయవలసివచ్చును. భూమి నీటిమయమై యుండును. ఎరువువేసి భూమిని సారవంతముగా చేయవలసియుండును. కొన్ని ప్రాంతములందు కర్షకులు అసలే ఉండవు. కీటికలవుచే పంటలు పండవు.

అందుచే ఇకను వెళ్లేవారు వెనుకముందు ఆలోచించి వెళ్లవలెను. పెట్టుబడిద్రవ్యము తగినంత యున్నవారు ఇండ్లలో చల్లదనమునకు విద్యుచ్ఛక్తిని ఉపయోగింపవచ్చును. విద్యుచ్ఛక్తి సహాయమున రాత్రిళ్లు వ్యవసాయపుపనులను చేయవచ్చును. శీతోష్ణమును ఒకేమాదిరిగా ఇంటిలోపల ఉంచే ఏర్పాటుగూడ ప్రస్తుత మున్నది.

విద్యుచ్ఛక్తి, వైర్ కండిషనింగు పరికరము లున్నను వలసపోదలచినవారి జీవితము సుఖప్రదము కానేరదు. వీరి ఆరోగ్యమునకు హాని కలిగించు పురుగులు అత్యధికముగా గలవు. నానాజాతిసమితి మలేరియా కమీషన్ వారి శిఫార్సును అనుసరింపకున్నచో ప్రాణాపాయముగూడ తటస్థింపవచ్చును. మలేరియా చెలరేగిన దినములలో వ్యాధి రాకుండుటకు గాను దినమునకు 6 గ్రెయినులవంతున క్వినైన్ సేవింపవలెను. రోగి మొదటి 5-7 దినములు 15-20 గ్రెయినులవంతున సేవింపవలెను. మలేరియా వ్యాధి రాకుండా వాడు మందు లన్నిటికంటె క్వినైన్ ఎక్కువగా వాడుకలో నున్నదనియు, ఇది నిరపాయకరమైనదనియు దీనిని వాడేవిధానము అందరికి బాగుగా తెలియుననియు మలేరియా కమీషన్ వారి 1938 సం॥ నివేదికలోని 125 పుటలో గలదు.

M. Eng. No. 199.

# నైరాశ్యము

శ్రీ ఆదిభట్ల రామమూర్తి

౧

ఓ ప్రభూ! తావకీన హాసప్రభూత
రాగరసవాహినుల దోఁగు ప్రణయ మధుమ
రందబిందువు నొకటి నా డెందమునను
దాచుకొంటిని, ఇన్నాళ్లదాఁక : కాని
గాఢనైరాశ్య భయదగ్నికణము హృదయ
రంగమున రాజుకొనుట ఎఱుంగనైతి!!...

౨

ఫుల్లకుసుమిత యామినీ పూర్ణయగుచు
ప్రకృతిరమ నవ్యనాట్యవైభవము చూప,
కరిగి, హృద్వీణ నిక్వణక్వాణగతుల
లలితగానామృతలహరిఁ జిలుకకుండె;
భావతంత్రులు తెగి, పాడువడియెనేమొ?

౩

పదనుచెడంద చెందొవఁ గ్రొ
 హామృతవృష్టినిఁ జిందుసుస్మితాం
బుదము నిదాఘశూన్యమయి
 పోయిన, రాగరసార్ద్రి నవ్య భా
వదళము లన్నియు స్నవసి,
 వాడి, కృశించె! ప్రసూనపేశలాం
గదసదృశమ్ము హృత్కమల
 నాళము చిల్లులు వోయెనా? ప్రభూ!

౪

కోయిలసానిగీతముల
 కున్ మధుమాస రసస్రవంతికిన్
హాయిని గూర్చు ఈ ప్రకృతి
 హాసము తీయని పంచటామనిన్
నా యెదఁ జీల్చి, చిర్నగవు
 నన్నులివెచ్చని వాడి ప్రేమ ఆ
ప్యాయముతోడఁ జిల్క హృద
 యమ్ము చిగిర్చి రసోల్బణాంకుర
శ్రీయుత భావసూనముల
 చేఁ బరిఫుల్లము నొంద దేటికో?

౫

తళతళలాడు వెన్నెలల
 దారము నేసిన హృత్పుటంబునన్
వలపులు మూటఁగట్టి మురి
 పమ్ములఁ గుల్కితి నింతలో నిరా
శల పెనుగాలివాన నలు
 చాయల రేఁగి, తుపానులై, కలం
తల కలగుండువెట్టె మసృ
 ణాంకిత భావహృదంబరమ్మునన్.

౬

ప్రణయరస మరుణ పల్లవరాగ పూచు
అణువుఅణువున దోబూచులాడుచుండె
నేమొ? లేకున్న ప్రేమరసైక పూర్ణ
హృదయభాండమ్ము శూన్యమై యదరుటేల?

౭

హృదయము దహించుచున్న యీ యుదయ రాగ
మునఁ బ్రణయమధురస మొల్కి పోయెనేమొ?
సత్ప్రభూ! లేనిచో ఈ విషాదభరిత
కుటిలనైరాశ్యజనిత సంక్షోభమేల?

# టార్చిలైటు

'కరుణకుమార'

రెడ్డిపాలెం అని ఓ చిన్న పల్లెటూరు. ఈ గ్రామంలో బోర్డు ఎలిమెంటరీస్కూలు పెట్టి ఓసంవత్సరంకూడా కాలేదు. అంతకుపూర్వం ఓ వైదికాయన వీధిబడి పెట్టుకొని పదిమంది పిల్లకాయలకి చదువు చెప్పుకుంటూ ఉండేవాడు. నిరుడుసంవత్సరం జిల్లాబోర్డు ఎన్నికలలో గరటయ్య అని ఆ పక్కవూరు రైతు ఒకాయన గెలిచి, ప్రెసిడెంటు అయ్యాడు. ఆయనగారికి రెడ్డిపాలెం అంటే ఎంతో మోజు. ఆ రెడ్డిపాలెంలో పదియిళ్లవాళ్లు కాపులు బలవంతు లున్నారు. తెల్లవారి లేస్తే వాళ్లదగ్గర ఇంత తెచ్చుకోవడం, ఇవ్వడం, వాళ్లకీ వాళ్లకీ తోంభయి లావాదేవీలు. అందువల్ల తన ప్రెసిడెంటుగిరీలో ఆ గ్రామానికి కొన్ని శాశ్వతమయిన ఉపకారాలు చేయాలని, మీటింగులో బోర్డు స్కూలు మంజూరు చేయించి, పదిహేను వందల రూపాయలతో బిల్డింగు కట్టించి, వీధిబడిలో చదువుకొనే పిల్లకాయల నందరినీ బోర్డుస్కూలులో చేర్పించాడు ప్రెసిడెంటు.

ఇద్దరు టీచర్లకు చాలినంతమంది పిల్లలు లేనందువల్ల పెంటలమీద తిరిగే చాకలి, మంగలి, కుమ్మరి, వొడ్డె, సాలె, గొల్ల, యానాదివగైరా ప్రతి పిల్లకాయనీ తీసుకువచ్చి ఓ అరవయిమందిని పోగుచేసి ఆ స్కూలులో చేర్పించాడు ఆ ప్రెసిడెంటు.

ఈ సంవత్సరమే కొత్తగా పెట్టిన స్కూలయినందువల్ల ఈయేడు ఈస్కూలులో కూడా ఆరోగ్యవారం జరిపి, పిల్లకాయల చేత ఆటలాడించి, బహుమతు లివ్వవలసిందని ప్రెసిడెంటుగారి దగ్గరనుండి హెడ్మాస్టరుకు తాఖీదు వచ్చింది. అయితే, దీని కయ్యే ఖర్చులు జిల్లాబోర్డు భరించుకొనే స్థితిలో లేనందువల్ల గ్రామంలోని రైతులవల్లా, గ్రామస్థులవల్లా తలా కొంచెం చందాలువేయించి, ఆ పైకంతోనే ఆరోగ్యవారం జరపవలసిందని కూడా ఆ తాఖీదులోనే వ్రాశారు ప్రెసిడెంటుగారు.

ఆ హెడ్మాస్టరు క్రైస్తవుడు. పేరు జకరయ్య. పాపం బీదవాడూ, భయస్థుడూను. ప్రెసిడెంటుగారి ఉత్తరువు తీసుకొని వెళ్లి గ్రామంలో పదిమందిపెద్దలకూ చూపి, తలా కొంచెం చందావేసి సహాయం చేయవలసిందని కోరాడు జకరయ్య. ఈ ఆరోగ్యవారాలూ, వేడుకలూ, వీటి ఉపయోగాలూ వాళ్లకంతగా అర్థమైనా కాకపోయినా, ఏమో పిల్లకాయలచేత ఆటలాడించి బహుమతు లిస్తానని అంటున్నాడు అయ్యవారు, అని పదిమంది కాపులూ, బ్రాహ్మలూ, గ్రామాధికార్లూ కలిసి చందాలువేసి, ఓ యిరవై రూపాయలు జమచేసి, అతనిచేతిలో పెట్టారు.

స్కూళ్ల డిప్టీ ఇన్‌స్పెక్టరును పిలుచుకొనివచ్చి, ఆయనసమక్షంలోనే పిల్లకాయల చేత అరమైలు పరుగు, నూరుగజాల నడక, ఎక్కువమెత్తు ఎగరడం, ఎక్కువపొడుగు దూకడం, బల్లలకింద కాళ్లకు గోతాలు కట్టుకొని నడవడం, కిందచల్లిన పువ్వు లేరి కుప్పగా పెట్టడం- ఒకరకమేమిటి, పట్నవాసపుబడులలో ఆడించే ఆటలన్నీ పిల్లకాయల చేత ఆడించి, ఆటల్లో గెలుపొందిన పిల్లకాయలకు — ఒకరికి సూటుకేసూ, ఇంకొకరికి టార్చిలైటూ, మరొకరికి పెద్దసైజు జపాను అద్దం, ఇంకొకరికి ఫౌంటెన్ పేనా, వేరొకరికి సబ్బుపెట్టీ, ఇంకొకరికి గొడుగూ - ఇట్లాగే తలా ఒకవస్తువు బహుమతీలు యిచ్చాడు.

కాని ఆరాత్రికే గ్రామంలో అల్లకల్లోలం బయలుదేరింది.

ఆటల్లో గెలిచి బహుమతులు తీసుకొన్న పిల్లకాయ లందరూ — ఒకడు చాకలివాడు, ఇంకొకడు మంగలివాడు, మరొకడు వొడ్డెవాడు, యానాదివాడు, సాలెవాళ్ల పిల్ల, కుమ్మరివాళ్ల పిల్ల - ఈరకంగా అందరూ బీద వాళ్ల పిల్లకాయలే. గ్రామంలో డబ్బుగల వాళ్లూ, గొప్పవాళ్లూ, పలుకుబడిగలవాళ్లూ ఇచ్చిన డబ్బుతో వస్తువులు కొనడమూ, ఆ వస్తువులు చివరకు వాళ్ల చేతికింద పిల్లు తాగే నౌకర్లపిల్లకాయ లెత్తుకొనిపోవడమూ జరిగింది.

గ్రామస్థులు కుతకుత ఉడికిపోతున్నారు. తమ పిల్లకాయలకు వస్తాయనుకొన్న వస్తువు లన్నీ కూటికీ గుడ్డకూ మొగంవాచిన దరిద్రజీవుల సంతానం ఎత్తుకొనిపోయారు. అందులో తమ స్వగ్రామంలో, తమ కళ్ల ఎదుట తెల్లవారి లేస్తే తమ చెప్పు చేతల్లో ఉండి, తమకింద తాబేదారీ పనిచేసే నౌకర్ల బిడ్డలకు బహుమతులూ, తమ బిడ్డలకు వొట్టిచేతలూను. పెద్దరెడ్డిగారి అబ్బాయి ఒకటేగోల! కరణంగారి అబ్బాయి ఇంట్లోవాళ్లని నిలవనివ్వడం లేదు. సాలెవాళ్ల కిచ్చిన అద్దం తెచ్చి నా కిస్తావా చస్తావా అని కాశయ్యకూతురు ఒకటే ఏడుపు! ఇంతెందుకు, చాకలివాళ్లూ, మంగలివాళ్లూ, కుమ్మరివాళ్లూ అందరూ సంతోషంతో పొంగిపోతూ పండగ చేసుకొంటూ ఉంటే పెద్ద గ్రామస్థుల ఇళ్లల్లో ఆరోజు రోజంతా ఎండగలూ, ఉపవాసాలూను.

హెడ్డుమాస్టరు జకరయ్య కావలె నని వాళ్లందరికీ ఈ అవమానం చేశాడని వాళ్ల నమ్మకం. ఊళ్లో పెద్దలనుకొనే పదిమందీ చేరి కూడబలుక్కొన్నారు. ఆ మర్నాడు ఉదయాన్నే మీటింగు పెట్టి జకరయ్యను పిలిపించి, "మాదగ్గిర డబ్బులు దండి, ఊళ్లో వాళ్లకి పంజారం చేస్తావా! ఇంత తల పొగరా నీకు! మాడబ్బుతో కొన్న వస్తువులు మళ్లీ వాపసు తీసుకొనివచ్చి, మా పిల్లకాయలకు పంచిపెడుతావా లేక నిన్ను పట్టుకొని మెత్తగా తన్నమంటావా?" అని పదిమందీ కస్తీ చేశారు.

జకరయ్య గడగడలాడిపోయాడు. ఒంటరిగాడు. గ్రామంలో పెద్దపులు లనుకొనే వాళ్లందరూ చేరి చేసిన పంచాయతీ. అదిగాక, పబ్లికు మీటింగులో డిప్టీ యిన్‌స్పెక్టరుగారి సమక్షంలో పంచిపెట్టిన బహుమతీ వస్తువులు— వాటిని మళ్లీ తాను పైరివేటుగా ఊడబెరుక్కోవచ్చునా? ఈ సంగతి జిల్లా

బోర్డు ప్రెసిడెంటుగారికి తెలిస్తే తన నౌకరీకి మోసం కదూ. మరి తీసుకురాకపోతే గ్రామస్థులు బ్రతకనిస్తారా ?—

గండకత్తెర చుట్టుకొన్నట్టున్నది అతగాడికి.

జకరయ్య అట్టే ఆలోచించి, "స్వామీ! మీకు దణ్ణం పెట్టుతా. ఈ బహుమతులిచ్చిన వస్తువులు వాపసు తీసుకొనివచ్చే పని నా నెత్తిన పెట్టకండి. మీ రందరూ చేరి నామీద నేరం పెట్టారు కాబట్టి, నాస్వంత డబ్బుతో ఆ వస్తువులు మళ్లా కొత్తవి కొని మీకు ఇచ్చుకొంటాను. అంతమాత్రం దయ పెట్టండి" అని వాళ్ల కాళ్లు పట్టుకొన్నాడు.

కాని, వా రంతా పెద్దమనుష్యులు - ఒప్పుకొంటారా వారు ? జకరయ్య ఎంత చెప్పినా, ఎన్నివిధాల ప్రార్థించినా, 'ఆవస్తువులు ఆ పిల్లకాయలదగ్గర ఉండడానికి మాత్రం వీలు లేదు. పోయి నీవు వాపసు తీసుకొని వస్తావా రావా ?' అని వాళ్లు నిక్కచ్చి చేశారు.

జకరయ్యకు దిక్కుతోచక, ఆవెళ్లడం వెళ్లడం ఏకాయెకీని జిల్లాబోర్డు ప్రెసిడెంటు దగ్గరికి వెళ్లి, జరిగిన విషయమంతా ఆయనతో మనవి చేసుకొని, రక్షించండని ఆయన కాళ్లమీద పడ్డాడు.

ఆ ప్రెసిడెంటు అసాధ్యుడు; రాజకీయవేత్త; దూరాలోచనపరుడు. ముందుసంవత్సరం రాబోయే ఎన్నికల్లో శాసనసభకి కూడా నిలబడాలని చూస్తున్నాడు. జకరయ్య చెప్పుకొన్న దంతా విని "నేను రేపు మీగ్రామానికి వచ్చి, గ్రామస్థులతో స్వయంగా మాట్లాడి, వ్యవహారం పరిష్కారం చేస్తా. నీ కేం భయం లేదు, పో"మ్మన్నాడు.

జకరయ్య ప్రెసిడెంటుదగ్గరకు పోయిన సంగతి గ్రామస్థులకు తెలిసి, వాళ్లు వెంటనే బహుమతులు తీసుకొన్న పిల్లకాయల తల్లిదండ్రులను రచ్చకు పిలిపించి, బెదరించి, వాళ్లదగ్గరి వస్తువులన్నీ వాపసు తీసుకుని, పెద్దరెడ్డి స్వాధీనంలో పెట్టుకొన్నారు.

భయపడి వస్తువులు అందరూ వాపసు యిచ్చారు కాని, టార్చిలైటు తీసుకొన్న చాకలివాళ్ల పిల్లవాడు మాత్రం వాపసు ఇవ్వలేదు. వాడితండ్రి రంగం, మోల్మేను వగైరాపట్నాలు తిరిగి వచ్చినవాడు; మనిషి — ఎర్రగా నేత్రాలూ వాడూ ఆజానుబాహువు - ఏడడుగులు ఎత్తుంటాడు. చేతులకు మురుగులు, దండకడియం, 'అయిదు వేళ్లకీ ఉంగరాలు, మొలకు బిళ్లల మొలతాడు, చెవులకు తమ్మెట్లు — చూడ్డానికే మహాజబర్దస్తీగా ఉంటాడు. గ్రామస్థు లెంత బెదిరించినా వాడు టార్చిలైటు వాపసు ఇవ్వకుండా మొండికొడ్డుకొని కూర్చున్నాడు. పైగా, ఇచ్చినవాళ్లనికూడా చీవాట్లు పెట్టి పురెక్కించాడు.

మరునాడు ఉదయం జిల్లాబోర్డు ప్రెసిడెంటుగారు గ్రామానికి వచ్చేవరకు వస్తువులు చేజారి వాపసు యిచ్చినవాళ్లూ, వాళ్ల బంధువులూ, చాకలివాళ్లూ మొదలయిన అలగాజనం అందరూ ఓ యేభయిమంది తోడయి, పెద్దరెడ్డి యింటిమీద పడి, 'చాకలివాడు వస్తువు ఇవ్వనిదీ మేము మాత్రం వాపసు ఇస్తామా, మావస్తువులు

మా కిచ్చివేయవలసిం' దని కర్రలూ కత్తులూ పట్టుకు తయారయారు.

ఇంతలో జిల్లా బోర్డు ప్రెసిడెంటుగారు రాగానే వారిని పెద్దరెడ్డియింటికి పిలుచుకొనిపోయి బస చేయించారు.

పదిగంటలదాకా ఎవరెవరు ఏమేమి మాటాడుకొన్నారో అంతా గోప్యంగా జరిగిపోయింది. పదకొండుగంటలకు కారెక్కి హెడ్ క్వార్టర్సుకు చక్కా వెళ్లిపోయాడు ప్రెసిడెంటు.

రంగం చాకలివాడి హుషారీ చూచుకొని అలగాజన మంతా ఏకమై నడుములు బిగిస్తున్నారు. పెద్దరెడ్డి వీథిలోకి రావడం మానేసి రహస్యంగా మాలవాళ్లకు చెప్పి పంపి, కల్లు పోయిస్తాననీ, డబ్బు లిస్తాననీ బేరాలు చేస్తున్నాడు.

వ్యవహారం ముదిరి కొట్టుకోవడం దాకా వచ్చేవరకు, మునసబు కరణాలు చల్లగా తప్పుకొని, గ్రామపరిస్థితులు పోలీసు వారికీ, మేజస్ట్రేటుకీ రిపోర్టు పంపించారు.

గ్రామంలో అయితే జకరయ్య ప్రస్తావన మళ్లా ఏమీ లేదుకాని, గ్రామస్థులతో మాట్లాడి ప్రెసిడెంటుగారు వెళ్లిపోయిన తరువాత ఒకనాటి ఉదయం జకరయ్యకు పోస్టులో ఓకవరు వచ్చింది. అది చింపి చూస్తే ఇట్లా ఉంది:

జిల్లాబోర్డు ఆఫీసు,
తే. ౧౭-౧౧-౩౮.

ఉత్తర్వు

ఇటీవల మీ గ్రామంలో జరిగిన ఆరోగ్య శిశువార వేడుకల సందర్భంలో మీరు అజాగ్రత్తగా ప్రవర్తించి, గ్రామంలో అనవసరమైన కలతలూ, పార్టీలూ పెంచి, పాఠశాల పురోభివృద్ధికే కాక, గ్రామ పురోభివృద్ధికికూడా భంగకరంగా నడచుకొన్నందువల్ల మీరు స్కూలు టీచరుగా ఉండడానికి అనర్హు లని తీర్మానించి, మీ సంజాయిషీతో నిమిత్తం లేకుండానే మిమ్మల్ని ఈతేదీ లగాయతు నౌకరీనుండి మర్తరఫు చేయడమైనది.

(సం) గరటయ్య,
ప్రెసిడెంటు.



# శ్రీరామకృష్ణపరమహంస*

శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి

ప్రపంచ మంతయు నిపుడు సంగ్రామానలముచే దగ్ధమగుచున్నది. పాశ్చాత్యనాగరికత రక్తపిపాసువైన రక్కసివలె చెలరేగుచున్నది. ఈ నాగరకతకు అంజలి ఘటించినవారు నేడింకను తేటగీతికల నాలపించుచునే యున్నారు; ఆటవెలదులై నృత్యము చేయుచునే యున్నారు. ఇకనైన దీని నిజస్వరూప మెఱిగి, ఇది విషాక్తమైనదని స్మరించి, ప్రపంచపునరుద్ధరణమునకై వీరు నడుము గట్టెదరుగాక.

ప్రపంచమున పాపము విజృంభించినపుడు భారతమాత రక్షణహస్తమును చాపినది. భారతమహత్త్వమును ప్రపంచమున ప్రకటించి, భారతమహర్షులు మన వ్యక్తిత్వమందలి దేవత్వమును ప్రదర్శింపగలిగిరి. ఆధునికయుగములో నట్టిమునిముఖ్యులలో తలమానికమై యుండినవాడు శ్రీరామకృష్ణపరమహంస. ఇట్లని రోమెయిన్ రోలండు మున్నగు ప్రతీచీప్రజ్ఞావంతులే స్మరించిరి. పరమహంస అడుగుదమ్ములు సేవించి, పరమహంసకథామృతమును మనసార గ్రోలి, తన బోధనాపరంపరమూలమున నా సుధను వసుమతీహృదయమున వెల్లారించి వెలసిన మహాత్ముడు వివేకానందస్వామి. ఈ గురుశిష్యుల ఉదాత్తాశయములచే సందీపితములైన మహాసంస్థయందు మీరు విద్య నభ్యసించుచున్నారు. ఈ గురుశిష్యులయావాసముల చెంగట వసించి, వారి యాదర్శములను హృదయంగమము గావించుకొనజాలు భాగ్యము నా కలవడెను. కలకత్తాలో విద్యార్థినై యున్నపుడు నిత్యము బేలూర్ దక్షిణేశ్వరములు నాకు యాత్రాస్థలములై యుండెడివి. కావున మీవలె నాకును శైశవమునుండియు రామకృష్ణసంస్థలతో సన్నిహిత సంబంధము కలిగినది. చెన్నపురిలో నీ సంస్థయందు తఱచుగా మిమ్ము గలసికొను భాగ్యము నా కొనగూర్చుచున్నందులకు మీకు హృదయపూర్వకమైన నమస్సులను సమర్పించుచున్నాను. ఈ భాగ్యము కతన పూర్వోక్తమైన సంబంధము ఘనతర మగుచున్నది.

రామకృష్ణ వివేకానందాదుల కథనములను వంగభాషనుండి ఆంధ్రీకరించు భాగ్యము నా కలవడినది. ఆ మహాత్ముల—యుదాత్తాశయములకు మననము గావించుకొనుట మన ప్రస్తుత కర్తవ్యము—ప్రస్తుత ప్రపంచ కర్తవ్య మనియు గంటమెత్తి వచింతును. కావున పరమహంస జీవిత మహత్త్వమును, ప్రబోధ తత్త్వమును, సంక్షేపముగ నిపుడు తెలుపగడంగితిని.

వంగదేశమున హుగ్లీజిల్లాలో జాహనాబాద్ (దాని ప్రస్తుతనామము ఆరాంబాగ్)నకు పడమర నాలుగు క్రోసుల దూరమందును, బరద్వానునకు దక్షిణ దిశయందు రమారమి పదమూడు క్రోసుల దూరమందును గల 'కామార్ పుష్కరిణి' అను గ్రామమున వంగశకము ౧౨౪౧-వ సంవత్సరమున ఫాల్గున శుక్ల విదియ బుధవారము, (క్రీస్తుశకము ౧౮౩౬ ఫిబ్రవరి ౧౮) వేకువజామున నాలుగుగంటలకు శ్రీరామకృష్ణుడు జన్మించెను. జననీజనకుల అవ్యాజానురాగముకతన నతడు దినదినాభివృద్ధి గాంచదొడగెను. బాలకునకు నెనిమిదవ మాసము రాగానే తలిదండ్రు లాతని కన్నప్రాశనము జరిపిరి. కొడుకునకు గదాధరు డని పేరుపెట్టిరి. కాని యీ పేరు కుటుంబమందు పలువురకు నచ్చనందున దానికి బదులుగ వారు బాలునకు రామకృష్ణుడని పేరుపెట్టిరి. బాలునకైదేండ్లు రాగానే తలిదండ్రు లాతని గ్రామపాఠశాలయందు ప్రవేశపెట్టిరి. చదువునందు రామకృష్ణునకు

* రామకృష్ణహోము తెలుగు సంఘము పక్షమున నిచ్చిన ఉపన్యాసము.

మక్కువ లేకుండెను. అతడు ఆటపాటలందే కాలము గడపివేయువాడు. సంగీతమునందతనికి మక్కువ ఎక్కువ. ఊరిలో నెచటనైన హరికథగాని, పాటకచ్చేరిగాని, భజనగాని జరుగు తఱి రామకృష్ణుడు తప్పక పోయి అందు ప్రాలుమందువాడు. ఒకనాడాతని బాల్యమిత్రులలో నొకడు "సోదరా! నీకంఠము మిగుల మధురమైనది. ఏదైన పాట పాడుము. విందును" అని అతనితో పలికెను. నాటినుండి రామకృష్ణుడు సంగీతము నభ్యసింపసాగెను. ఎవరిసాహాయ్యము నెఱుంగక అచిరములో సంగీతమునందాతడు కొంతప్రజ్ఞ సంపాదింపగలిగెను.

రామకృష్ణుని తండ్రి పేరు క్షుదిరాం చట్టోపాధ్యాయుడు. అతడు భక్తుడు. బద్ధదీక్షితుడైన ఉపాసకుడు. దశకర్మల నిర్వహించుటయందు ఆతి తేలివాడు. దేరే యనునా రీతని పూర్వవాసస్థలము; కామరపుకూరికి మూడుమైళ్ల దూరమున నున్నది. ఆయూరి జమీందారు నతనిపై కొండొకకేసులో కూడి సాక్ష్యమిచ్చుట కంగీకరింపక కామరపుకూరికి వచ్చి అందు వాస మేర్పఱచుకొనినాడు. వైదికవృత్తి నెఱపుచు, అతి కష్టముతో సంసారయాత్ర గడపుచుండువాడు. అతని భార్య చంద్రమణి శాంతమతి. వీరికి ముగ్గురు కొడుకులును, ఒకకూతురును జనించిరి. పెద్దవాడు రామకుమారుడు, రెండవవాడు రామేశ్వరుడు, మూడవవాడు రామకృష్ణుడు. కుటుంబయాత్ర గడపుటయందు జనకునకు రామకుమారుడు సాయపడుచుండువాడు. స్వగ్రామము వీడి కలకత్తానగరమునకు జని ఝామాపుకూరిణి యను ప్రదేశమున మకాము ఏర్పఱచుకొని శాస్త్రశిక్షణ మొనరించుటకై పాఠశాల యొకటి నిలిపెను.

గ్రామవిద్యాలయమం దున్నపుడు రామకృష్ణుని చదువు చేయుటయం దంతలేదు. కావున తమ్మునకు శాస్త్రబోధ సలుపదలచి రామకుమారుడు వానిని తనయొద్దకు కొనిపోయెను. రామకృష్ణు డపుడు పదునాలుగేండ్ల వయసువాడు. కలకత్తా వచ్చినపిదపకూడ చదువునందతడు శ్రద్ధ చూపలేదు. అన్నగారిభయమువలన కొంత మిడిమిడిజ్ఞానమును సంపాదించినాడు. కాని రామకృష్ణుని మేధాశక్తి గొప్పది. పౌరాణికులు రామాయణము, మహాభారతము, భాగవతము మొదలగు గ్రంథములు చదువుచుండగా విని నిముసములో వానియందలి ముఖ్యాంశములను మనసున బట్టించుకొనుచుండెడివాడు.

రామకృష్ణుడు పదునెనిమిదేండ్లవయసువాడైనపుడు అతనిజ్యేష్ఠసోదరుడు కలకత్తా కుత్తరమున రమారమి ఆఱుమైళ్లదూరమందున్న దక్షిణేశ్వరాలయమున అర్చకుడుగా నియోగింపబడెను. రాసమణియను ఒకమార్వాడీరాణి వంగ శకము ౧౭౭౭ సంవత్సరమున (క్రీ. శ ౧౮౫౫ మే. ౩౧) దక్షిణేశ్వరమున భాగీరథీ తీరమున మనోహరమగు నొక యుద్యానవనమున విశేషధనము వెచ్చించి, చక్కనిగుడి కట్టించి, అందు మహాశక్తి ప్రతిమను ప్రతిష్ఠింపజేసెను *.

ఈ విగ్రహారాధనమున నియోగింపబడిన పిదప రామకుమారుడు ఝామాపుకూరిణియందుగల తనచిన్న పాఠశాలను ఎత్తిపెట్టి, తమ్మునితోగూడి దక్షిణేశ్వరమున మకాము ఏర్పఱచుకొనెను. రామకృష్ణుని చిన్నయన్న రామేశ్వరుడు అపుడపుడు దక్షిణేశ్వరమునకు వచ్చి, పూజ సలుపుచుండువాడు. దక్షిణేశ్వరమందే రామకృష్ణునకు క్రీ.శ. ౧౮౫౯ లో పరిణయమాయెను. హుగ్లీ జిల్లాయందలి జయరామవాటియందు నివసించు రామచంద్రముఖోపాధ్యాయు డాతనిమామగారు. వాని జ్యేష్ఠదుహిత శారదాసుందరి రామకృష్ణుని యర్ధాంగి. పెండ్లినాటికి రామకృష్ణునకు ఇరువదిమూడేండ్లవయసుండెను. శారదామణివయసపు డైదేండ్లు మాత్రమే! రామకుమారుడు దక్షిణేశ్వరాలయమున రెండుమూడేండ్లు అర్చకత్వము నిర్వహించి కాలధర్మము నొందెను. రాసమణిరాజ్ఞి రామకుమారుని కొడుకువలె ప్రేమించుచుండెడిది. ఆమె మేనయల్లుడు మథురబాబు రాణి యొక్క రాజకార్యములయందు పాల్గొనుచుండువాడు.

---

* ఆలయస్థలము ౧౮౪౭ సెప్టెంబరు ౬-వ తేదీని కొనబడినది. ౧౮౬౧ ఆగస్టు ౨౭-వ తేదీని రిజిష్టరు చేయబడినది. ఆలయమునకు ఆదాయమిచ్చు డినాజ్‌పూరుజమీందారీ వెల రు ౨,౨౬,౦౦౦.

అతనికికూడ రామకుమారునిమీద దయ మెండు. రామకుమారు డకాలమరణమునకు గురియగుటచే వాని కుటుంబమునకు దుస్థితి సంభవించెను. కుటుంబభరణ కర్తవ్యమును రాసమణిరాజ్ఞి తనపై వేసికొని, రామకుమారుని పదవియందు రామకృష్ణుని నియోగించెను. రామకృష్ణు డంతకుమున్ను ఎన్నడును అర్చకత్వము చేసియెఱుంగడు. కాని అచిరములో నాతడు శాస్త్రానుసారముగా పూజ చేయగలిగినాడు. విశేషోత్సాహముతోడను, నిష్కళంక భక్తితోడను, అతడు దుర్గకు అర్చనము చేయుచుండువాడు.

అర్చకపదవి నందినదాది రామకృష్ణుడు సదా దేవినే ఆరాధించుచుండువాడు. కరాళవదనయైన జగదీశ్వరిసాహాయ్యమువలన నతడు అంతశ్శత్రువులను (కామ, క్రోధ, లోభ, మోహ, మద, మత్సరములు) జయింపగలిగినాడు రామప్రసాదకమలాకాంత మున్నగు భక్తులు రచించిన కాళీకీర్తనముల నాతడు సతతము పాడుచుండువాడు.

ఇట్లుండగా, రామకృష్ణునకు యోగాభ్యాసము చేయవలయు ననుబుద్ధి పుట్టెను. ప్రశాంతమగు ప్రదేశమునగాని యోగసాధనము సాధ్యము కాదని రామకృష్ణుడు ఉద్యానవనమున కుత్తరదిశ నొకచక్కని పర్ణశాలను నిర్మించుకొని, అందు వసింపసాగెను. కుటీరమునకు సమీపమందే పెద్ద మఱ్ఱిచెట్టొక్కటి కలదు. ఈచెట్టునీడయందే రామకృష్ణుడు యోగాభ్యాస మొనరించుచుండువాడు. తోతాపురియను విరాగి రామకృష్ణున కాచార్యు డాయెననియు, అతనికరుణాపెంపుననే రామకృష్ణుడు యోగాభ్యాసమును ప్రారంభించెననియు కొందఱు చెప్పెదరు.

ఐశ్వర్యమును, బంకమట్టిని అతడు సమముగ చూచుచుండువాడు. గంగాతీరమున గూర్చుని రామకృష్ణు డొకచేత పైకమును రెండవచేత మట్టిని యుంచికొని ఇట్లనుచుండువాడట! "ధనమా! నీకు తళుకుబెళుకులున్నవి. నీవు నిర్జీవపదార్థంబవు. నీవలన ఇండ్లును వాకిండ్లును, బిడ్డలును, మేడలును నిర్మాణమగును. కాని సచ్చిదానందములను నీ వీయజాలవు. మృత్తికా! నీవును జడపదార్థంబవే! నీవలన నెన్నెని సస్యములు ఉత్పన్నమగుచున్నవి. వానిని వినియోగింపగా, సకలసౌఖ్యములు చేకూరుచున్నవి. నీవును సచ్చిదానందముల నీయజాలవు. ద్రవ్యమా! నీకును, యీమట్టికినిగల వ్యత్యాస మేమి?" అనుచు రామకృష్ణుడు పైకమును నీట గిరవాటువేయువాడట.

కాంచనము నెట్లు వర్జించినాడో రామకృష్ణుడు కాంతనుకూడ నట్లే వర్జించినాడు. "అందకత్తెలను చూచి కొందఱు పురుషులు ఉన్మత్తప్రాయు లయ్యెద రేల? వారిశరీరము లెట్టివి? అవి యస్థిపంజరములు కావా? రక్తమాంసముల ప్రోవులు కావా? వీనిపై నల్లనిదో, పచ్చనిదో, తెల్లనిదో చర్మ ముండును. రక్తమాంసములు లేని మొండెమును చూచినపు డెవ్వరేని మోహపరవశు లయ్యెదరా? ఈవాంఛ యంతయు రక్తమాంసముల మీదనే కదా వ్రాలుచున్నది! రక్తమాంసములప్రోవుపై చేయివేయుట కసహ్యించుకొను మానవుడు వీనినే స్త్రీశరీరమున గాంచి మక్కువపడుచున్నాడు. ఆ ప్రోవు నాతడు లక్ష్యము చేయరాదు" అని రామకృష్ణుడు పలుకుచుండువాడు.

రాసమణిరాణి మేనల్లుడు మధురబాబు రామకృష్ణుని పలుమాఱు పరీక్ష చేసినాడు. ఉద్యానమందలి రంగగృహమునకు అతడు సొగసుకత్తెలైన వారవనితలను రావించి రామకృష్ణునికూడ నచ్చోటికి పిలిపించి వానిమనసు త్రిప్పుడని వెలవెలందులను ప్రోత్సహించువాడు. కాని పణ్యాంగనల విలాసములును, వలపులును రామకృష్ణుని మనసున నాటుకొను వాడిబాణములు కాజాలకపోయెను. అవి రామకృష్ణునిపట్ల వ్యర్థములే యయ్యెను. మధురబాబు పిమ్మట రామకృష్ణుని ఉత్తరహిందూస్థానమున కొన్నితావులందు త్రిప్పి, అతనిమానసము మాఱునేమోయని ప్రయత్నించినాడు. కాని వానియత్నము లన్నియు వితథములైనవి.

రామకృష్ణునిచరిత్ర మెంత యుదాత్తమైనదో లోకులకు తెలియవచ్చెను. క్రమక్రమముగ శిష్యు లాతని జేరవచ్చిరి. రామకృష్ణుడు చదువుకొనినవాడు కాడు. శాస్త్రముల నాతడు పరిశోధింపలేదు. ఆతనికి భాషాజ్ఞాన మంతగా లేదు. కాని ఆతనియుపదేశములు ఉపమాలంకారములతో గూడి, గంభీర - భావవిలసితములై యుండెడివి. ఆతని పలుకులు విని, ఎందఱెందఱో ఆశ్చర్యాన్వితు లగు చుండువారు. క్రమక్రమముగ రామకృష్ణుని శిష్యసంఖ్య అధికమైనది. బ్రహ్మసమాజమతప్రచారమున విశేషప్రశస్తి నందిన కేశవచంద్రసేన్ పరమహంసదేవుని చరణోపాంతమున గూర్చుని ఎంతేని జ్ఞానామృతమును గ్రోలినాడు. నాట్య

కళయందు విశేషకీర్తినందిన గిరీశచంద్రఘోషు పరమహంస ప్రబోధములకు వీను లొగ్గి విశేషాభ్యుదయము నందినాడు. కావున నీతని రూపకములం దాధ్యాత్మిక సంపద యుండుట గాంతుము. నాస్తికులును, పాపులును ఎందఱెందఱో పరమహంసకతన బాగుపడిరి.

శైశవమునుండియు రామకృష్ణుని భక్తిగుణ మిక్కిలి గాఢముగ నుండెను. పల్లెబడియందు ప్రవేశ పెట్టబడినప్పుడు బడి కేగక అనవరతము రఘువీరుని పాదముల నాతడు సేవించుచుండువాడు. తనంతట దాను పూలు కోసి, పూజచేయుచుండువాడు. ఆతని యింటి సమీపమున ధర్మశాల యొకటి యుండెను. యోగులును, విద్వాంసులును అచట చేరుచుచు వారి పాలి కరిగి వారు పురాణ కాలక్షేపము చేయుచుండగా వీను లొగ్గి సత్కథామృతమును గ్రోలుచుండువాడు. రామకృష్ణుని తరువాతి జీవితమందలి మహత్త్వ మాతని శైశవ దశయందలి చిహ్నములనుండియే పెరిగి పెంపొందినది.

బాలుడై యున్నప్పుడు రామకృష్ణు డొకప్పుడు పరిసరగ్రామమునకు ఒక పొలమునుండా నడచి పోవుచుండెనట! ఆతనివయ స్సపుడు పదునొకండేండ్లు మాత్రమే! అట్లు నడచుచు పోవుచుండగా నొకనాడు ఆకస్మికముగ అతడొక యద్భుత జ్యోతిని తిలకించి, తన్మయుడైనాడట. కనులు మూసి నేలపై నాతడు పడియుండుట చూచి చుట్టుచేరిన ప్రజలు ఆతడు మూర్ఛిల్లినాడని తలచిరట. మూర్ఛకాక అది భావసమాధి యని పనపడి గుర్తించిరట. అద్భుతమైన అదృశ్యమును గుఱించిన ఉదంతమును పరమహంసయే తరువాత తన శిష్యులకు తెలిపెను. ఆధ్యాత్మిక జీవితములం దిట్టి వింతలు పొడసూపినట్లు మహాపురుషుల జీవితములు తెలుపుచున్నవి. మహాభక్తులేకాక మహాకవులును ఇట్టిదృశ్యముల నుపలక్షించినారు. రాముని సందర్శనమును పొంది తాను భాగవతమును రచించినట్లు పోతన చెప్పుకొనినాడు. తన సౌధాగ్రమున నొక మనోహర సాయంసమయమున నిలిచినపుడు ఒక యద్భుతదృశ్యమును గాంచి కైతను చెప్పగడంగితినని రవీంద్రుడు చెప్పుకొనినాడు. ఇట్టిదృశ్యములును, ఇట్టి యనుభవములును మనుష్యజీవితమును సౌందర్యప్రదీప్త మొనరించును.

పూజ చేయుకొలది రామకృష్ణుని మానసము అద్భుతమగు స్థితికి వచ్చుచుండెడిది. ఏకాగ్రచిత్తుడై యాతడు ప్రతిమ కెదురుగా నిలువంబడియుండువాడు. పరిణయమువలన నాతనిమనసు మాఱునని ఆతని యాప్తులు తలచిరిగాని వారియూహ నిష్ఫలమాయెను. దక్షిణేశ్వరమున నన్నతడే ఆధ్యాత్మికానుభవమున నాతడాఱితేఱినాడు. పూజచేయుచు ఆతడు దుర్గను విలోకింపజాలువాడు. హారతి గావింప మొదలిడువాడు; కాని అది యెంతసేపటికిని ముగియునది కాదు. పూజ చేయుచునేయుండువాడు; అది ఎప్పటికిని తెమలకుండునది. భగవతిని మానసమం దిడికొని, ఆతడేపని చేయుటకు పూనుకొనినను అందే తన్మయుడై యుండువాడు. పూజ చేసి చేసి తుద కాతడున్మత్తుని వలె గంతులువైచువాడు.

రామకృష్ణుని మహత్త్వమును గుర్తించిన మథురబాబు పూజారికీతనమునుండి ఆతని దొలగించి, ఆతని మేనల్లుడు హృదయముఖోపాధ్యాయునిపై ఆభారము నుంచెను.

రామకృష్ణుని తదనంతరజీవిత మెట్టిదో జగతి బాగుగ నెఱుగును. ఆతని ప్రధానశిష్యుడు నరేంద్రనాథదత్త. ఒక్కొక్క వేళయందు, ఒక్కొకతావలమున నీత డొక్కొక నామధేయమున పరగుచుండువాడని ఇటీవల దివంగతుడైన అభేదానందస్వామి తెలుపుచుండుటచే నెఱుంగుదుము. వివేకానందస్వామి యను అభిధేయమే స్థిరమై సర్వవసుంధరయందు ప్రతిష్ఠించినది. దక్షిణేశ్వరమున కర్ణగోచరమైన ప్రబోధములు వివేకానందుని ప్రచారముకతన ప్రపంచ ప్రసిద్ధములైనవి.

మీ సంస్థనబోలు మహాసంస్థలు బహుళముగ ప్రపంచమున నెలకొనినవాడు వసుమతీవాసులు స్థిరమై, మహత్తరమైన మతవిద్య నందగలరు. నేటి ప్రపంచ విశ్వవిద్యాలయములందు మతవిద్యకును, ఆత్మవిద్యకును స్థానము లేకపోవుటచే, అందుండి స్వార్థపరులైన మహామేధావులు వెడలుచున్నారు. కేవలము భౌతికజ్ఞానము నలవఱచుకొనిన ఈ మేధావులవలన ప్రపంచము పునరుద్ధరణమును గాంచగల దనుట కల్ల. భూతదయ, అహింస, సేవ, సహనము, శాంతము, త్యాగము మున్నగు సుగుణములు క్రమశిక్షవలనగాని యలవడవు. విషయగ్రహణ మొనరించిన మహార్థమందే విషయాభ్యాసము ప్రాచీన ప్రాచీనుల విద్యా ప్రణాళికయందలి ముఖ్యాంగమై యుండెడిది. ఈ ప్రణాళికను మేలుబంతి గావించుకొనిన సంస్థలు పరమహంసపేరిట నింకను నెలకొనవలెను.

# అఖిలభారత కళావిజ్ఞానపరిషత్తూ-దాని ఆవశ్యకతా

శ్రీ దేవగుప్తాపు విశ్వేశ్వరరావు

[ఇదివరలో హిందూదేశమునకంతకు అఖిలభారతకళా, విజ్ఞానపరిషత్తు ఒకటి ఉండవలెనని ఇంగ్లీషుపత్రికలలోను, దేశభాషాపత్రికలలోను కొంత చర్చ నడిచినది. ఉపయోగకరములైన అన్ని ప్రారంభములవలెనే ఈ ఉద్యమముకూడా ఒక్కమారు పొంగి చల్లారిపోయినది. ఇట్టి పరిషత్తు ఆవశ్యకతను శంకించేవారు కాని, కాదనేవారు కాని ఉంటారనుకోము; కాని ఏవిధంగా అది రూపొందవలెననేదే సమస్య. వ్యాపకర్తగా రీ విషయం పునః చర్చకు తెచ్చుట యుక్తంగా ఉన్నది. సాహితీపరులూ, విజ్ఞానపరులూ ఈ విషయమై చక్కగా ఆలోచించి, తమ యభిప్రాయములను వెల్లడిపరుపగోరెదము. —భా. సం.]

భారతదేశంలో నేడు అన్ని ప్రాంతీయ భాషలలోనూ ఒక నూతనసంచలనమూ, చైతన్యమూ కానవస్తోంది. ప్రతిరాష్ట్రి భాషలోనూ నూతనరచయితలు సారస్వతకళాసేవను — కథా, కావ్యం, వ్యాసం, నాటకం, నవలా- అన్నివిధాలలోనూ, చిత్రరచనాది లలితకళల మూలంగానూ వాఙ్మయ కళారాధనను చేస్తూన్నారు. ధనలోపమూ, వారి రచనాప్రాశస్త్యానికి ప్రోత్సాహలోపమూ, ఈ రచయితలకు అఖిలభారత ప్రఖ్యాతి కాదుగదా, ఆయా రాష్ట్రములలోనయినా బహుళంగా వ్యాప్తికాక నిరుత్సాహులయి ఉన్నారు. రచయితలకు ఆర్థిక బలమూ, కీర్తిప్రఖ్యాతులూ చేకూర్చాలంటేనూ, ప్రాంతీయసారస్వతాలలో ఉన్న మేలురచనలని ఆయా సోదరరాష్ట్రీయుల దృష్టికి తెచ్చి వారిమెప్పు సంపాదించే ప్రయత్నం చేయాలన్నానూ, ఒక అఖిలభారత వ్యాప్తిగల విజ్ఞానకళాపరిషత్తు స్థాపింపబడవలెనని ఆలోచనాపరులు కొంతకాలము నుంచి గంభీరంగా ఆలోచిస్తున్నారు. ఇట్టి పరిషత్తు, భారతీయసారస్వతప్రతిష్ఠకు చిహ్నంగా ఉండడానికీ, వివిధ రాష్ట్రీయ నవరచయితలకు సర్వవిధములయిన పుష్టిని కలుగజేయడానికీ ఎంతయినా అవసరం. ఈమేరకు, ఎట్టి ప్రయత్నమైనా నేటి మన పత్రికా సంపాదకులు, రచయితలు, కళాపిపాసులు, సాహితీపరులు, శాస్త్రకారులు, పరిశోధకులు (Research workers), దేశీయప్రముఖులు చేయవలసి ఉంటుంది. అట్టి ప్రయత్నాలన్నిటికీ ఫలితంగా ఉండదగినది ఒక భారతీయకళావిజ్ఞాన పరిషత్తు. ఈసందర్భంలో ఈమధ్యను బ్రిటీషు ఎకాడమీ సభ్యత్వాన్ని పొందుతూ విశ్వవిఖ్యాత శ్రీ రాధా

కృష్ణ పండితు లన్న వాక్యాలు గమనార్హాలు [1].

ఈవిషయంగూర్చి నేను మొట్టమొదట చదివినది శ్రీ. డా. పి. గుహ ఠాకుర్తాగారి [2] "Why not an Indian Academy" అనేవ్యాసం. అందులో ఆయన ప్రపంచ సారస్వతంలో భారతసాహిత్యం గౌరవమైన స్థానం ఆక్రమించుకోవాలంటే ఒక భారత విజ్ఞాన కళాపరిషత్తు - భారతీయ విజ్ఞాన చిహ్నంగా స్థాపింపబడాలని కోరారు. ఆపరిషత్తు విజ్ఞానాసక్తమైన భారతజాతికి ప్రతినిధి సంస్థగా ఉండి ప్రపంచసాహిత్యపరుల సంబంధము ఉంచుకోవాలని ఆయన ఉద్దేశము. పిమ్మట ఆయనవిజ్ఞాపన 'ఢిల్లీ'లోని హిందూస్థాన్ టైమ్స్పత్రికలో పునః ప్రచురణమైనది. శ్రీ ఐ. ఎ. చాప్మన్ దొరగారు, ఏదో భారత సంస్థానమునుంచి వ్రాస్తూ - ఆపత్రికలో పరిషద్విషయమై చర్చించారు. పిమ్మట, శ్రీ యస్. పి శర్మగారు, మదరాసు, త్రివేణి [3] పత్రికలో ఈవిషయమై చర్చించారు. తరువాత శ్రీ అవనీనాథ్ రాయ్‌గారు (మీరట్ కాంట్' గర్ల దుర్గా బారీలేన్) త్రివేణీసంపాదకునికి [4] వ్రాసిన లేఖలో ఈవిషయంగూర్చి ఉత్సాహంగా చర్చించి ఇంకా ఈవిషయమైన చర్చను ఆహ్వానించారు [5]. ఆతరువాత 'త్రివేణి' పత్రికలో ఈవిషయమైన చర్చ ఆగిపోయింది.

ఈ పరిషద్విషయంగూర్చి ప్రస్తావించినది "World P E N. Congress" కు భారత శాఖగా పనిచేస్తూన్న "The Indian P. E. N. Centre" ఒకటి. ౧౯౩౮ మార్చి పత్రికలో "The Indian P. E. N." శ్రీ. డా. పి. గుహ ఠాకుర్తాగారి త్రివేణీ వ్యాసానికి, ఉటంకిస్తూ ఒక చిన్న వ్యాఖ్య ప్రచురించింది; తాముకూడా ఈసువర్ణ స్వప్నాన్నే కంటున్నా మనే అభిప్రాయాన్ని వెలిబుచ్చింది.

భారత దేశంలోని ఈ P. E. N శాఖ, దేశీయవిజ్ఞాన సమ్మేళనానికి (National Cultural Unity) ప్రయత్నమే తమప్రధానాశయం అని ప్రకటిస్తోంది. అందు కనుగుణంగా,

---

1. Interviewed by the Associated Press at Calcutta our esteemed Vice-President of P. E. N. India Centre, made some pertinent remarks (on the establishment in India) to include "the out-standing representatives in the spheres of language and literature, history and law, politics and economics, philosophy and antiquities."—Extract from The Indian P. E. N., August, 1939, Vide page 117.

2. 'Triveni' July-August 1933 సంచికలో ప్రచురితమైనది.

3. November-December issue, 1933.

4. July-August issue, 1934.

5. ఈ పరిషద్విషయచర్చకు ఆతిథ్య మిచ్చిన త్రివేణీసంపాదకులు శ్రీ కోలవెన్ను రామకోటీశ్వరరావుగారి ఆదరణ స్తవనీయం. వీ రింకా ఈవిషయంగూర్చి 'త్రివేణి' లో కృషిచేస్తారని ఈవ్యాసకర్త విశ్వాసం.

[ఇట్టి పరిషద్విషయములో కీ. శే. కొంపెల్ల జనార్దనరావుగారుకూడా తమ 'ఉదయిని' పత్రికలో రెండు మూడు సంచికలలో విపులంగా చర్చించినారు. ఈవిషయం శ్రీ దేవరస్వామి విశ్వేశ్వరరావుగారు గమనించినట్లు కనిపించదు. —భా. సం.]

(Literary Awards for India) అనే సంపాదకీయం ౧౯౩౭ మార్చి పత్రికలో ప్రచురణమయినది. ఇప్పటిదాకా ఈవిషయమైన ఏచర్యకైనా ప్రోత్సాహ మీయడానికే ఈ సంఘం కంకణం కట్టుకున్నది. అఖిలభారత ప్రాచ్యమహాసభ (The All India Oriental Conference) వారుకూడా ౧౯౩౮ డిసెంబరులో జరిగిన తొమ్మిదో సమావేశంలో అఖిలభారతపరిషత్ స్థాపనకై తోడిసంస్థల అభిప్రాయాలను సేకరించ సమకట్టి, ఒకప్రణాళికను సిద్ధపరచాలని తీర్మానించినారని లోగడ చూశాను. కాని చెప్పవలసిన ఫలిత మేదీ కలిగినట్లు తెలియదు.

భారతకళా విజ్ఞానపరిషత్తును స్థాపించవలసిన అవసరంగూర్చి తిరిగీ చర్చించడం చర్విత చర్వణమని నాతలపు. భారతదేశంలోని వివిధ ప్రముఖ మాతృభాషా సారస్వతాలలో ఇంత చలనమూ, కావ్యరచనమూ కానవస్తూన్న ఈనాడు, వాటి ఔన్నత్యాన్ని గుర్తించి, ప్రోత్సహించే సంస్థ ఏదైనా ఒకటి లేకపోవటం తీరనిలోపం కాదా? మన ఆంధ్రదేశంలో ఇప్పుడు శ్రీ విశ్వనాథ సత్యనారాయణ, చింతా దీక్షితులు, దేవులపల్లి కృష్ణశాస్త్రి, అడవి బాపిరాజు, శ్రీ శివశంకరశాస్త్రి, గుడిపాటి వెంకటచలం, శ్రీ శ్రీనివాసరావు, కొడవటిగంటి కుటుంబరావు మొదలైన ఉత్తమసాహితీపరుల రచనలు ఆంధ్రులు తప్ప తదితరులు ఎవరూ చదవలేదంటే అతిశయోక్తి కాదు. వారికి ఆంధ్రదేశం దాటితే ప్రఖ్యాతి లేదు. ఎందుచేత?[6] ఒక్కొక్క మాతృభాషలోని ఉత్తమరచనలను అనువాదంచేసి ప్రచురించే సంస్థ భారతదేశంలో లేకకదా! ఈవిషయమై ఏదైనా నిశ్చితప్రయత్నం అవసరం. ఈ ప్రయత్నం ఒక్క భాషారచనలకే కాకుండా చిత్రరచనలకు కూడా అనువర్తిస్తుంది. ఎందరు ఆంధ్రచిత్రకారులు తమ చిత్రాలకు చెల్లుబడీ, తమ కళా నైపుణ్యానికి మెప్పూ లేకుండా, నిరుత్సాహులయి ఉన్నవారిని ఎరుగము?[7] ఇట్టి విషయా లన్నింటినీ గుర్తించితే సాహితీపరులకూ, చిత్రకారులకూ ప్రోత్సాహమిచ్చే సంస్థఅవసరము కనపడును. పైగా, మన ఇరుగు పొరుగు మాతృభాషలలో ఎట్టి కవులూ, కళాకారులూ, కావ్యచిత్రరచనలూ కావిస్తున్నారో విజ్ఞానతృష్ణగల మనకు తెలియదు. అఖిలభారత సాహితీ ప్రోద్బలానికి, అంతర్రాష్ట్రీసహకార, పరస్పర సమ్మేళనము మరిన్ని అవశ్యమైన ధర్మం.

---

6. లేదు. 'త్రివేణి' పత్రిక ఇంగ్లీషునను, 'హంస' పత్రిక హిందీలోకి కొన్నికొన్ని రాష్ట్రీయభాషలలోని రచనల అనువాదాలను ప్రచురిస్తున్నది. కాని ఈపాటిప్రయత్నము ఏం చాలును?

ఒకమాట, ఈవిషయంలో Pioneers గా పనిచేసిన 'హంస' పూర్వసంపాదకులు కే. శే. ప్రేమచంద్ జీ, మాన్యశ్రీ మున్షీ గార్లు స్తవనీయులు. 'త్రివేణి' పత్రికకూడా ఇందుగూర్చి చేసినసేవ మరవరానిది.

7. ఈసందర్భంలో, ఉత్తమ ప్రకృతిచిత్రకారుడు వి. వి. భాగీరథిగారిని పేర్కొనడం అనుచితం కాదనుకుంటాము. సరియైన ప్రోత్సాహమే గనక ఉంటే ఆయన ఈపాటికి అఖిలభారతప్రఖ్యాతి పొంది, జీవనసుగమ మార్గమే పట్టియుండును!

ఇన్నిటినీ ఆలోచించి[8], స్థాపించవలసిన భారతవిజ్ఞాన కళాపరిషత్తు యొక్క ఆశయములు, నిర్మాణ విధానమూ ఈ ప్రణాళిక ననుసరించి ఉన్నయెడల ఉత్తమంగా ఉండునని నా సూచన.—

ప్రతీరాష్ట్రములోనూ ఈపరిషత్ శాఖలు స్థాపింపబడి కేంద్రసభతో అనుసంధింపబడవలయును. ఈకేంద్రస్థానము ఢిల్లీ, బొంబాయి, కలకత్తాలలో ఎక్కడైనా వీలును బట్టి ఏర్పాటు చేయవచ్చును. ప్రతిరాష్ట్రమునను, ఆ సంవత్సరములో ప్రచురింపబడిన రచనలను సంగ్రహించి ఆ యా శాఖలు కేంద్రస్థానమునకు పంపవలయును. ఇందు ఉత్తమ సారస్వత చిత్రకళాది రచనములే ఉండవలెను. కేంద్రస్థానములోని పెద్దలు ఇట్లు చేరిన రచనలను విమర్శించి, బహుమతులను నిర్ణయించుచుండవలెను. బహుమతినిర్ణయసంఘమున నుండుసభ్యులు వ్యక్తిగతాలోచనకు దూరముగ నుండవలయును. ఒక్కరచనల విలువను బట్టియే అట్టి నిర్ణయములు జరుగవలెను.

బహుమతీ నిర్ణయమైన రచనలను అఖిల భారత భాషలలోనికి అనువదించే ఏర్పాటు వారే చేయవలయును. అట్లయినయెడల, ఉత్తమ రచయితలకు ప్రఖ్యాతీ, ఆర్థికసహాయముకూడ కలుగును. కవిత్వము, చిత్రకళ, శాస్త్రపరిశోధన, చరిత్ర పరిశోధన మొదలయిన వైజ్ఞానిక విషయాలన్నీకూడా ఈపరిషత్తు ఆలోచనలో ఉండవలయును.

ఈపరిషత్తు ఒక ద్వైమాసపత్రికను ప్రారంభించి నడుపవలయును. కేంద్రసభ మాత్రమే ఈ కార్యమును నిర్వహించవలయును. భారతదేశంలో అంతటికీ సామాన్యమైనభాషలో పత్రికాపరిషద్వ్యవహారము నిర్వర్తింపబడవలయును. ఈపత్రికలో వివిధ రాష్ట్రాలలోని ప్రముఖుల వ్యాసాలూ, చిత్రకారుల చిత్రాలూ, ఆయాప్రాంతాలలోని సారస్వతకళావ్యవహారాల నివేదికలూ ప్రచురింపబడవలెను. ఏడాదికొకసారి, యావద్భారత దేశంలో ప్రచురణమైన సమస్త గ్రంథాల యొక్క Bibliography ఒకటి ప్రకటించబడవలయును. ఇందుకు దేశంలోని వివిధసంస్థల వ్యక్తుల సహాయమును అర్థించవలయును. ప్రభుత్వముయొక్క ధన సహాయముకూడ కావలసినచో లభించవలయును. ఈ పరిషత్తు యొక్క సభ్యత్వము కేవలమూ రచయితల విలువనుబట్టియే ఉండవలయును; జాతి, రాష్ట్రవిభేదము లుండకూడదు. అప్పుడే పరిషత్తునిర్ణయాలకు దేశీయ విజ్ఞానుల గౌరవం ఏర్పడుతుంది.

పరిషన్నిర్వహణము ఎన్నుకొనబడిన అధ్యక్షుడు, ఉపాధ్యక్షుడు, ముగ్గురు కార్యదర్శులూ, కార్యసంఘమూ చేత కొనసాగింపబడవలెను. పత్రికకు సంపాదకవర్గము - వివిధ ప్రాంతీయ ప్రాతినిధ్యంతో - నిర్ణయింపబడవలెను. ప్రతిఏటా ఏదో ఒకముఖ్యమైనచోట మహాసభ జరుగవలయును. ప్రతినిధులు ఈసభకు అన్నిరాష్ట్రాలనుండీ రాగలరు.

8. ఈపరిషత్ నిర్మాణంగురించి నే నింకా కొందరు మిత్రులతో ఉత్తరప్రత్యుత్తరములు జరుపుచున్నాను. పరిషన్నిర్మాణము నిశ్చితమైన, నిర్మాణవిధానము, ఆశయములు, పద్ధతులు ఎట్టివయినా చింతలేదు. ఆ మేరకే, నేను సహృదయుల సూచనలను, చర్చలనూ ఆహ్వానిస్తున్నాను.

చర్చలు, తీర్మానాలు, జరిగి వాటిని అమలులోపెట్టు ప్రయత్నములు జరుగవలెను.

ధనికులైన కళాభిమానులూ, జమీందారులూ, ప్రభుత్వమూ ఈభారత విజ్ఞానకళాపరిషత్తును పోషించవలసి ఉంటుంది. ముఖ్యమైన ధనరూపకమైన బహుమతులకు ఎవరో దాతలు విరాళము లీయాలి. అంతవరకూ పరిషత్తు బహుమానప్రదానము గురించి అడుగువెయ్యలేదు. ఈవిధంగా, ఏర్పడిన భారత విజ్ఞాన కళాపరిషత్తు ప్రబుద్ధ భారతసీమ కంతటకూ ఏకైకప్రతినిధిగా ఉండి ప్రపంచవిజ్ఞానసభలలో పాల్గొని భారతనాగరికతా విజ్ఞానవైభవాన్ని ప్రపంచదృష్టిలో పునః ప్రతిష్ఠించగలదు.

విజ్ఞానవంతులూ, కళాపిపాసులూ, సాహితీపరులూ, ఉన్నతస్థానాలలో ఉన్న ప్రముఖులూ — భారత దేశం అంతటినుండీ — ఈపరిషన్నిర్మాణంలో శ్రద్ధ తీసుకోవాలని విన్నవిస్తున్నాను. దేశంలోని పత్రికాసంపాదకులూ, పత్రికారచయితలూ, విదేశాలలో భారతవిజ్ఞానదూతలుగా సేవచేసిన కళాద్రష్టలూ, రచయితలూ,— ఈ అందరి సహకారముతోనే ఇట్టి శాశ్వత సంస్థ యొక్క పునాదులు వేయబడగలవు. గాంధీ రవీంద్రుల ఆశీర్వాదంతో, సరోజినీ రాధాకృష్ణుల ప్రోత్సాహంతో, దేశంలోని అసంఖ్యాకులయిన సాహితీపరుల ప్రయత్నబలంతో, విజ్ఞానాభిమానులైన ధనికుల ఆర్థికబలంతో త్వరలోనే డా. పి. గుహఠాకుర్తాగారి సువర్ణస్వప్నం భౌతికరూపం కంటుందని నాఆశయం. విశ్వసాహితీపరులయిన భారతకుమారులు గర్వించే భారత ప్రాచీన విజ్ఞాన నాగరికతలు పునః ప్రతిష్ఠాచిహ్నమైన భారతవిజ్ఞానకళాపరిషత్తు నిర్మింపబడితేనేకాని, ప్రపంచంలో వెల్లడికావు. ప్రాచీనభారతసంస్కృతికి వారసుల మని గర్వంగా చాటే మనము, ప్రపంచవిద్యాధికుల ఎదుట సగౌరవంగా నిలువడానికి అవకాశం కలగాలంటే, మన కార్యకౌశల్యానికీ, మన విజ్ఞానావధికీ సాక్షీభూతమైన భారత జాతీయ కళావిజ్ఞాన పరిషత్తును నిర్మించడమే!

ఈవిషయంగురించి 'భారతి', 'భారతి' పఠించే విజ్ఞులూ, సహృదయులూ శ్రద్ధ తీసుకొని, నూతన చర్చలూ, సూచనలూ కావించి ఈ ఉద్యమాన్ని కొనసాగిస్తారనే విశ్వాసంతో ఈవ్యాసాన్ని ముగిస్తాను.[1]

"Literature and art are great pacific agencies; a fellow-artist cannot be an enemy and the appreciation, in common, of a work of art must evoke sympathy."

—A. N. Monkhouse.

---

1. రచన: 12, అక్టోబరు, 1939.

# పరివేదన

శ్రీ గుజ్జర్లపూడియ ఆంజనేయులు

ఆరలే దింక రక్తాంబుధారలతోడ వియ్యంబుగొన్న బెల్జియము నేల,
కదలినగుండె లింకను దేఱుకోలేదు వన్నెలొల్కు పరాసు కన్నియలకు,
బిగియింపలేదు విప్పినసంచు లింక బండారంబులోన లండనుపురాన,
మఱువలే దింకను మదరాసుపౌరులు తొలిజాము రేయి నిప్పులతుపాను,
విరియలే దింక దెసల మువ్వీసమైన
దుర్దమ శతఘ్ని కాగోళ ధూమశిఖలు
దాపురం బయ్యె నింతలో దాడి మరల
పంచజనజాతి సల్పిన పాపమేమొ!

అమృతంబు నిడు రసాయనకాండమునఁ బుట్టెఁ గోరచూపుల కాలకూటవిషము
చేదోడు వాదోడుగా దేశములఁ గాచు మించునఁ బ్రభవిల్లె మృత్యుదేవి
పచ్చనిపొలములోపలఁ గాపురము వెట్టె మచ్చమూపు తుపాకిమందుగనులు
ఇంపారుగండుకోయిల కంఠమున మ్రోగెఁ గర్కశామంగళకాకరవము
పోయెఁ దలక్రిందులై ధర్మపురుషురథము
కత్తివాదరపై నిల్చెఁ గమలజాత
నాలిపామయ్యె మెడనున్న పూలమాల
వేళయయ్యెను గాఁబోలు విలయమునకు.

అదలించి బెదరించి యందుబాటుగనున్న మంచిభూముల నాక్రమించినాఁడు
తనమాట కెదురాడఁ దలకొన్న తలలను బెనుగటారికి బలిపెట్టినాఁడు
దేవుని సిగఁదన్ను దేవుఁడై యుప్పొంగి సాటిలే రని బార సాచినాఁడు
తియనినునుబల్కు తేనియఁ గురిపించి గట్టిమన్నీల జోకొట్టినాఁడు
అతఁడు ప్రత్యక్షకల్పకాలాంతకుండు
చెక్కుచెదరని దిట్ట నాజీనియంత
కట్టుకొన్నాఁడు ముంజేతఁ గంకణంబు
జీవకోటుల నట్టిట్టు సేయ నిపుడు.

నెఱజాణ "ముసోలినీ రోమకస్వామి" యిష్టానుకూలోపదేష్ట కాఁగ,
సమయతంత్రజ్ఞుఁడు "స్టాలిను ఋషిరాజు" బహుదక్షిణార్థియౌ బ్రహ్మ కాఁగ,
మంత్రప్రయోగమర్మము లాచికొన్న "పాపెను పండితుండు" ఋత్విజుఁడు కాఁగ,
మానవాలంభ సంరంభియౌ "గోరింగు సోమయాజి" యుదగ్రహోత కాఁగ,

ఉర్వి నెల్లను డాకాల నొత్తఁగోరి
సరభసంబున "హిట్లరుశర్మ" సలుపు
మారణక్రతువునకు నిండారుహోమ
గుండ మైపోయె నయ్యొ! పోలెండు నేఁడు.

పోలుల పెన్నిధానమును బ్రుచ్చిలి, నెత్తురుకూటిపిండమున్
నాలవసారి పంచుకొనినారఁట "శర్మకులున్ ఋషీంద్రులున్";
కేలనె? దీనితోఁ, కదన దేవత రక్కసిపొట్ట నిండెనే?
నాలుక లాఁచుచున్న దిరునాల్గుముఖంబుల భీషణంబుగన్.

తరములనాటి వైరముల దాచి, బుజాలు బుజాలు రాచె సం
బర మెసలార జర్మను జపానులు రష్యనుమూఁకతోడ ని
బ్బరపుఁగసాయిజీవికకుఁ బాల్పడి; చేరువనున్న సీమ లే
యిరవును లేమి వాల్చె మెడ లీమిడిమేళపు గండకత్తెరన్.

అడుగంటిపోదె నామావశిష్టంబుగా ననదయై యబిసీనియామహత్త్వ,
అస్తమింపఁగలేదె ఆస్ట్రియాస్వాతంత్ర్యమహితవైభవసూర్యమండలంబు,
వంపలేదె నివాపవారిధారలు జకోస్లావియాదొర లాత్మసంపదలకు,
నలఁగిపోలేదె చీనాప్రపంచవిత్తి కాపాడుకొన్న బంగారుకోట,

విఱిగిపడలేదె పోలండు శిరసుమీఁద
మట్టమధ్యాహ్నకాంతులఁ బిట్టపిడుగు,
సందియము లేదు, పశుబలశక్తిశకము
పుడమి కెగఁదట్టె; నీతులు బూజువట్టె.

మలయు మహావిషానిలపు మంటల కాహుతి గాక, బిట్టుబాం
బుల జడివానలో నవసిపోవక నా యనువారు లేక వం
తలఁబడి, గండముల్ దినదినంబును దాఁటుచు నెంతకాల మీ
యిలపయి సాగు జీవనము? లింతకె ప్రాణము లేఁగెఁ దోఁకకున్.

హృత్తాపం బెడవాపి, భారతమహోర్వీనాయకస్నేహ సం
పత్తిం గైకొని; యాంగ్లనేత లిపు డాపత్తు న్నివారింప కు
వ్యక్తప్రక్రియనున్నఁ బూర్తియగు నీనాఁడే సమస్తప్రజా
సత్తాకోత్తరభాగధేయముల కాశ్వాసాంతగీతాశ్రుతుల్.

ప్రాకుచున్నది జీవలోకంబునం దెల్ల నన్యోన్యవిద్వేషహాలహాలము,
ఉడుకుచున్నది సంగరోగ్రనౌకాగ్నిచే నపరాంబురాశిగర్భాలయంబు,
ఆడుచున్నది నగ్నయై రాజవీథిలో సర్వదాహకమహాశాపిశాచి,
మూఁగుచున్నది నిత్యమును పెచ్చునెత్తుటఁ బూర్వపశ్చిమదిశాభూతలంబు,
మెఱయుచున్నది దుర్దినాంబరమునందు
కాలబేతాళదంష్ట్రికరాళరోచి,
జాగుసేయక రక్షింపు! జగము నిపుడు
శాంతి నెలకొల్పి; విశ్వరక్షక! ముకుంద!"

రాలే దింకను భూతపంచకము సర్వం బేకమైపోవు త
త్కాలం, బిమ్మెడఁ బాడి గాదు లయముం గల్పింప; మా విన్నపం
బాలింపన్ గరుణింప దక్షు లెవరయ్యా? నీవ కా దన్నవోఁ;
బాలన్ ముంతువో! నీట ముంచెదవో! నీభారంబు సర్వేశ్వరా !.



# అరుణాచలంనుంచి లేఖ

'శారిస్'

ఒక చిన్న కోనేటి గట్టున మెట్లమీద కూచుని నీకు యీఉత్తరం వ్రాస్తున్నాను. దీక్షితులుగారూ, నాన్నా స్నానంచేస్తున్నారు. ఎదురుగా అరుణాచలం కొండపైని శిఖరాన్ని మేఘాలు కనపడకుండా కమ్ముకున్నాయి. నావెనకాల చెట్లమీద కోతులు గోలచేస్తున్నాయి. ఇంకా సూర్యోదయం కాలేదు. ఇంత పెందరాళే ఎన్నడన్నా పక్కమీదనించి నేను లేవగా చూశావా? అసలు ఈ నిదపాన యీ కోనేటిగట్టున నువ్వు నన్ను చూడడమే తటస్థిస్తే గుర్తుపట్టక ఎవరో ఆశ్రమంపిల్ల అనుకొని నిర్లక్ష్యంగా వెళ్ళిపోతావు.

అసలు యీఉత్తరం వ్రాయడమే తటస్థించేది కాదు. ఓవిధంగా ఆలోచిస్తే. నే నేమైపోతానో అని నువ్వు ఆదుర్దాపడతావని

'ఉత్తరం వ్రాసే దెవరు?
చదివే దెవరు?'

అనే వేదాంతంతో భీష్మించుకున్న మనసుకి మనిద్దరిస్నేహమూ, అల్లరీ, నేను నీస్నేహంకోసం బాధపడిన రోజులూ, జ్ఞాపకంచేసి, బలవంతంమీద యీఉత్తరం వ్రాయిస్తున్నాను.

నువ్వుమాత్రం యీ ఉత్తరం చదివి "ఈఅరుణాచల మేమిటి? ఎట్లా అక్కడికి వెళ్ళింది? ఎందుకు వెళ్ళింది?" అని ఆశ్చర్యపడతావు, నిశ్చయం. ఇంతవరకు యీవూరు పేరు వినలేదుకదా నువ్వు! అవును, నేనూ వినలేదు. దీక్షితులుగారూ యింకా స్నేహితులూ శలవలు మాతో గడపడానికి వొస్తారనీ నువ్వూ వొస్తే మనందరం, క్రిష్ణకీ, కొండలమీదికీ షికార్లు వెళ్ళవొచ్చనీ మొన్న నేకదూ నీకు వ్రాసింది నేను?



శ్రీ రమణమహర్షి

కాని దీక్షితులుగారు వొచ్చి అంతా మార్చేశారు. ఇప్పుడు తలుచుకుంటే నా 'డెస్టినీ'నే మార్చారనిపిస్తోంది. ఆయన అరుణాచలం నాన్ననికూడా వీలైతే తీసికెడదామనే వుద్దేశ్యంతోనే వొచ్చారు యిక్కడికి. నువ్వు యింకా నాలుగు రోజులకిగాని రానని డిజప్పాయింటింగ్ వుత్తరం వ్రాయడమూ

దీక్షితులుగారు అరుణాచలాన్ని చేసిన వర్ణనలూ - వీటితో యీనాలుగురోజుల్లో యీ ట్రిప్ నాన్నావాళ్లతోటి వెడితేనే మనుకుని ప్రయాణ మైనాను.

కాని ఈ నాలుగురోజుల్లోనే, యేమేం జరిగాయో నే నెంత మారిపోయినానో వ్రాయాలంటే పెద్ద గ్రంథ మవుతుంది.

నామీద కోపమా నీకు బిలవెడ్ (Beloved), నీ సంగతే తలుచుకోలేదని, యీలేఖలో నెత్తలేదని? ఏం చెయ్యను? నామనస్సంతా పరాయత్తమయింది. ఇంక దేనికీ స్థలం లేదు.

మధ్యాహ్నం నాలుగు గంటలకి కాట్పాడిలో బస్సు యెక్కి- అరవవాళ్ల మధ్య యిరికి, బయలుదేరాం యిక్కడికి. చైత్రకాలపు సాయంత్రపు ఆకాశనీలంకింద కొండలు చూస్తే బస్సు పాడైపోయి అక్కడే ఆగకూడదా, పోనీ, బస్సులోనించి దూకి పాటివేపు పారిపోయి మాయం కాలేనా అనిపించింది,

“ఆకులో ఆకునై ...
ఇచటనే ఆగిపోనా...”

అట్లాగా. నిజంగా దూకుతానేమో అని నన్ను చూస్తే నాకే భయమేసింది. కాని ఎంత అసాధ్యం (Impracticable)!

ఇంత విశాలమూ, ప్రశాంతమూ, పరిశుభ్రమూ ఐన ప్రదేశాలు వుండగా, యెందుకూ ప్రజలు దుమ్ములో, గోలలో, మురుగులో నివసిస్తారో తెలుస్తుందా? ఇన్నాళ్లూ నేనూ అట్లాంటి బస్తీలలోనే వున్నాను కదా! బుద్ధీ, యోచనా వున్న మానిసినేనా అనుకున్నాను. ఇంక మళ్లీ వెళ్లి ఆమురుగుకాలవలమధ్య కాఫీహోటళ్ల వాసనల్లో, మోటారుకూతలమోతల కింద బతుకుతాను కదా అని దిగులేసింది.

రాత్రి ఎనిమిదిగంట లయింది అరుణాచలం చేరేప్పటికి. దూరంనించే గంభీరంగా నల్లగా ఆకాశాన్ని కప్పుతున్న ఆ పర్వతాన్ని బస్సులోనించి చూస్తో, చేరుకున్నాము. భోజనం చేసి నడక సాగించాము, ఆ కొత్త వీధుల్లోంచి, అరవ అరుపుల్లోంచి. ఊరు దాటాము, దీపాలు దూరమైనాయి. ఆశ్రమం రెండుమైళ్లదూర మనేటప్పటికి, రైల్లో, బస్సులో, కూచునికూచుని పట్టుకుపోయిన కాళ్లు కస్సెళ్లు కార్చాయి. గుండెల్లో రాయి పడ్డది. కళ్లు నిద్రవంక పెట్టి మారాం పట్టాయి; కాని sportive గా నడక సాగించాను. రమణాశ్రమం అనేబోర్డు చూసేవరకూ నేను నడుస్తున్నానో, యేం చేస్తున్నానో hypnotic spell లో వున్నానో తెలీదు.

ఆశ్రమం మాటుమణిగి వుంది. భగవాన్ నిద్రకి పడుకున్నారు; చూడ్డానికి వీల్లేదన్నారు. కాని దీక్షితులుగారి తియ్యపలుకులు మాకు ప్రవేశార్హతని కల్పించాయి. నిశ్శబ్దంగా వెళ్లి చూసి రమ్మన్నారు. హాలులోకి వెళ్లాం; dim గా ఎలెక్ట్రిక్ దీపం వెలుగుతోంది. ఒకమూల తెల్లని సోఫాలో పడుకున్నారు భగవాన్. ఒకరు పక్కన కూచుని ఆయింట్మెంటు రాస్తున్నారు ఆయన కాళ్లకి. నా హృదయం తెలీనికారణంవల్ల జాలితో దిగులుతో కుంగింది. నాన్నా దీక్షితులుగారూ సాష్టాంగనమస్కారం చేశారు. నేనూ నమస్కరించాను, యేం చేస్తున్నా

నో తెలీకుండానే. లేచానో లేదో, షాక్ (Shock) తలిగినట్టు వొళ్లంతా థ్రిల్ (thrill) ఐ వొణుకు వొచ్చింది. రక్తం తల్లో కెక్కింది. ఎన్నడూ అట్లాంటి అనుభవం అదివరకు కలగలేదు.

ఇదంతా నాపిచ్చి ఇమాజినేషన్ (imagination) అని నవ్వుతావు నువ్వు. నేనూ వొప్పుకోకపోను. కాని మన జీవితమూ, మనం seriousగా వాస్తవ మని అనుకునే యీవిచారమూ, సంతోషమూ, ప్రేమా, క్రోధమూ, అన్నీ మనం ఇమాజిన్ (imagine) చేసుకుంటున్నవే అంటారు భగవాన్. అసలు యీ దేహమనే ధ్యాసే మనం కల్పించుకున్నా మంటారు ఆయన. ఏ మంటావు? నీ కిదంతా వింతగా వుందికదూ, డియర్? మొన్నటివరకూ నీమోస్తరుగా ఆలోచిస్తో, నీ అభిప్రాయాలతో ఒకటైన నేను, ఇట్లా మారిపోవడం, చాలా ఆశ్చర్యంగా వుందా? నాకూ ఆశ్చర్యమే! రాత్రంతా ఆ అనుభవసంగతే ఆలోచిస్తున్నాను.

మర్నాడు పొద్దున్నే టి. బి. నించి ఆశ్రమందగ్గిరికి వెళ్లి, పాలితీర్థంలో స్నానం చేసి, హాల్లోకి వెళ్లాం ముగ్గురమూ. అప్పటికే చాలామంది కూచుని వున్నారు. మళ్లీ నమస్కారం చేసి మేమూ కూచున్నాము. భగవాన్ సోఫామీద కూచుని విసురుకుంటున్నారు. భగవాన్‌ని మామూలు మనిషిలాగ వర్ణిస్తే నువ్వు నవ్వుతావు. "అంతదూరం ఇందుకా వెళ్లింది? బావుంది!" అని హేళన చేస్తావు. కాని ఆయన నా మనస్సులో ఎట్లా అద్దుకున్నారో (impress అయినారో) వ్రాయాలంటే, నాకు తెలిసిన మూడు భాషల్లో మాటలూ కూడా చాలవు.

మొదట్లో నిన్ను ఎందుకు ప్రేమిస్తున్నానో నాన్నకి explain చెయ్యడానికి నా చాతనయింది. కాని భగవాన్‌ని ఎట్లా ప్రేమిస్తున్నానో, ప్రేమ ఎంతో ఎక్కువగా తెలిసిన నీ హృదయానికైనా తెలిసేట్టు చెప్పడం అసాధ్య మనుకుంటాను; ఎందుకంటే ఆయనమీది ప్రేమమోస్తరుది మన అనుభవంలో లేదు. ఆయనకి - భక్తులమీదనూ, అందరిమీదనూ, ప్రతిజీవిమీదనూ, నాకు తెలీదు- అట్లాంటి ప్రేమే వుండగావును! అదే నాలోంచి అద్భుతమైన ప్రేమను ప్రేరేపించి తీసుకుంది.

ఆయన్ని చూడగానే ఆ ఉదయాన నా మనసులో ఎట్లాంటి ఇంప్రెషన్ కలిగిందంటే, మనం పార్కు - fairలో మైనం బొమ్మలు ( wax figures ) చూడలేదూ — గాంధీ రాట్నం వడకడం, న్యూస్‌పేపర్ చదవడమూ, సరిగా అట్లాంటి wax figure లాగు కనపడ్డారు. ఆయన మనిషి. అని నమ్మలేకపోయినాయి నాకళ్లు - ఆయననోట్లోంచి మాట రాగానే ( సాధారణంగా మాట్లాడనే మాట్లాడరు) జీవంలేని విగ్రహంలోంచి మాట వొస్తే ఎంత ఆశ్చర్యపోతాం, అట్లా వుంది. అన్నిటికన్నా తళతళలాడే ఆయన కళ్లు— చీకట్లో కూడా ఆ మెరుపు కనపడుతూనే వుంటుంది. మన వేపు చూశారంటేనా, బాణంలాగ దూసుకుపోతుంది ఆయన దృష్టి హృదయకుహరాల్లోకి.

వొచ్చినరాత్రి నాహృదయానికి తన eternal electricityకి ఒక wire connect చేశారు (తీగని కలిపారు) ఆయన. హాల్లో వున్నంతసేపూ magnet (సూదంటురాయి) లాగ ఆ కరెంటు (current) ఆయనవేపే

లాగింది. ఆఖరికి ఎక్కడ వున్నా, ఏం చేస్తున్నా నాహృదయం ఆయనవేపే తిరిగింది. బహుశా హృదయానికి తగిలించింది elastic wire ఏమో (సాగగల తీగేమో). డార్లింగ్ (darling) ఎంత ఆనందంగా వుందంటావు నాకు!

నా మనసులోంచి అన్ని యోచనలూ పోయినాయి. నిన్ను గురించి ఒక్కసారిగ తలుచుకోవాలనికూడా అనుకున్నాను. నా జీవితంలో ముఖ్యమైన సంగతి స్నేహమే నని, హృదయానికి నీ ప్రాముఖ్యం (importance) ఎంత చూపినా, లాభం లేకపోయింది. అంతా చిన్నతనపు ఆట అని ఒక్కనవ్వు నవ్వి, నీ తలపుని దులిపేసింది నామనసు. ఇంక తక్కిన విషయాల సంగతి ఆలోచించుకో.

సాయంత్రమయింది. భగవాన్ కొండ మీదకి వెళ్లిపోయారు. గేటుదగ్గిరికి వెళ్లి నుంచున్నాను, ఆయన్ని తీసుకున్న అరుణాచలం కొండవేపు చూస్తో. లేత నీలం ఆకాశంలో ఎర్రగా పిరమిడ్ (pyramid) లాగ నుంచుని వుంది. (Heart immersed in Peace) అనుకున్నాను.

భగవాన్ వొచ్చారు. హాల్లో ప్రజలు కిక్కిరిసిపోయినారు. నాన్నా నేనూ బైట భగవాన్ కిటికీకి యెదురుగా, దడిమీద అల్లుకున్న పువ్వులతీగను ఆనుకుని కూచున్నాము. బాదంచెట్టుదగ్గిర ఇద్దరు గుజరాతీ యువకులు, చిన్నపిల్లలతో ఆనందంగా ఆడుకుంటున్నారు. "నాకేం తోచటం లేదు. ఎందుకు వొచ్చానో!" అంటున్నాడు నాన్న. అవును నాకూ వొంటరిగా కొత్తగా వుంది. కాని వొంటరితనంలో కొత్త యేముంది? అసలు జీవితమే వొంటరితన మైనప్పుడు, అనిపించింది నాకు.

ఎందరు వున్నా-నిజంగా తలుచుకుంటే, వొక్కదాన్ని వొంటరివాన్ని. లోకమే కొత్త నాకు. లోకానికి నేను కొత్త. మనుషులందరూ ఎంత తెలిసినాసరే, (Strangers) కొత్తవారే. ఎంత గాఢంగా ప్రేమించినా నువ్వూ కొత్తే. నీరూపం నీపనులు తప్ప నువ్వెవరో నాకేం తెలుసు? చిన్నప్పటినించీ ఎరిగిన నాన్నకూడా కొత్తవాడే నాకు; కాని అరుణాచలం ఎంతమాధుర్యాన్నిస్తోందో, జీవితంకూడా అంత మధురంగా వుంది. పాత ఎవరికి కావాలి? ఆ ఆనందాన్ని భరించలేక పోయింది నా అర్భకశరీరం. ఒక్కసారి అంత ఆనందాన్నీ, కొత్తనీ, తేజస్సునీ భరించలేక కొత్తవధువవలె కుంగిపోయింది హృదయం.

హాలులో ఆశ్రమవటువుల వేదపఠనానికి తాళంవేస్తోంది నాశ్వాస. కళ్లు కిందికి వాలాయి. లోపలికి, హృదయంలోపలికి, తదేకదృష్టితో చూస్తున్నాయి జేన్నో! దేహమంతా కరిగిపోయింది.

సూర్యాస్తమయ మయింది. నాన్నా నేనూ హాలులోపలికి వెళ్లాము. అందరి నడుమనా యిరికాము. మనుషుల వీపుల్లోంచి ఆవిర్లు బైలుదేరుతున్నాయి. ముందర భరించలేక పోయినాను. కాని తరవాత ఆసంగతి మరిచిపోయాను. నాకళ్లు బిత్తరపోయి తెరిబార చూస్తున్నాయి. తటాలున అలలాగ ఒకపెద్ద ఎమోషన్ (Emotion) హృదయానికి కొట్టుకుంది. కళ్లు మూసుకున్నాను. గొప్ప ట్రాన్సు (Trance) లో పడిపోయినాను. వొళ్లంతా స్తంభించిపోయింది. హృదయంలో థ్రిల్సు (Thrills) pass అవు

తున్నాయి. మెల్లిగా కళ్లు తెరిచి భగవాన్‌ని చూశాను. ఏమీ ఎరగనట్టు చుట్టూ మూగిన యీమనుషులతో తన కేమీ సంబంధం లేనట్టు తల అటువేపు తిప్పి ఎక్కడో చూస్తున్నారు, బుద్ధవిగ్రహంలాగు, ఆనటన సూత్రధారి.

బీరువాని అనుకుని కూచున్న యూరపియన్‌మీద పడ్డది మెల్లిగా నాదృష్టి. అతను కళ్లు తెరిచి నింతగా భగవాన్ వంక చూస్తున్నాడు. నా కెందుకో అతని మీద ఒకటే జాలి. పాల్ బ్రంటన్ (Paul Brunton) పుస్తకం చదివి, అరుణాచలానికి వొచ్చేశాడట ౧౬ ఏండ్లనించి. వొచ్చి యిక్కడే వుండిపోయినాడు. ఎక్కువసేపు నేలమీద చతికిలపడడం అలవాటు లేకగాపును, ఒకపెద్ద కాన్వాస్ బెల్టు (Canvass belt) తగిలించుకుంటాడు కాళ్ల చుట్టూ. ఎవరితోనూ మాట్లాడడు. కళ్లు మూసుకుని కూచుంటాడు చీకటిమూల. అతనికి ఆశ్రమంలోనే ఒకబంగాళా వుంది. హాల్లో హాజరుకావడమే అతనికి రోజూ పని. అతన్ని చూసి (envy) యీర్ష్యపడతాను. నన్ను పెంచుకుని తనకుటీరంలో చోటియ్యకూడదూ? కాని మళ్లీ దిగులు అతన్ని చూస్తే; ఆబెల్టుని చూసి నవ్వు. నేలమీద కూచోడానికి పడే అవస్థని చూసి జాలి! ఏం ఖర్మం పట్టిందని యీబాధ! నాకే యింత కొత్తగా వొంటరిగా వుంటే, పాపం చొక్కాలన్నా లేని యీ కొత్తమనుషులూ, పిలకల బోడిగుళ్లూ, కొత్తదేశమూ, ఆచారాలూ, భాషా - అతని కెట్లా వుందో!

గంట విని అంతా భోజనాలకి లేచారు. మధురమైన ఆనందంతో మత్తెక్కినహృదయం సాంబారుభోజనాన్ని దేహం నిరాకరించేటట్టు చేసింది. ఒక్కొక్క యూరపియనే చెప్పులు చప్పుడు చేసుకుంటూ చీకట్లో మాయమవుతున్నారు. ఒక్కత్తెనే బాదంచెట్టుకింద కూచున్నాను చీకట్లో. అటు తిరిగే మనుషులు తెల్లగా దెయ్యాలలాగు pass అవుతున్నారు నాకళ్ల ముందు. భగవాన్ కిటికీవేపు తిరిగాను. ఒకటే బాధ కలిగింది. గేటుదగ్గిరికి వెళ్లి మామిడిచెట్టుకింద కూచుని కొండవేపు చూస్తున్నాను. 'అరుణాచలరమణ' అని సాయంత్రం ఆశ్రమవాసులు పాడిన పాట చెవుల్లో ఆడుతూంది. కళ్లంబడి నీళ్లు తిరిగాయి. అరుణాచలరమణని ఆ 'హాలు'లో బంధించేశారు యీమనుషులు. కాని కొండవొదల లేదు తన పదహారేళ్ల ప్రియుణ్ణి. ఎవరికీ కనపడకండా దాచుకుంది—నాకు తెలుసు.

చీకట్లో రాయిమీద ఎవరో నుంచున్నారు, నాఅంత disconsolate గానూ. కళ్లు నీళ్లతో నిండాయి. ఎవరు? ఎవరైతే నేం? మాయిద్దరికీ భగవాన్‌మీద ఉన్న ప్రేమవల్ల పరిచయమయింది. ఆ ప్రేమలో మాభేదాలు, ఆ రూపాలు, గుణాలు అన్నీ ఏకమైపోయినాయి. ఇద్దరమూ భగవాన్‌మీద ప్రేమతో బాధపడుతున్నామని తెలుసు. అంతకన్న ఏ బాంధవ్యం కావాలి! భోజనాల హాల్లోంచి సందడి నిద్రలోంచిలాగు వినపడుతోంది. మేమిద్దరం ఆ చీకట్లో ఒకళ్లహృదయాలు ఒకరికి విప్పి చెప్పుకున్నాము. అంతకన్న అత నెవరో నాకు తెలీదు. ఆచీకట్లో అతని ముఖంకూడా చూడలేదు నేను.

ఆశ్రమంవాళ్లు నాకు తాగడానికి మజ్జిగ తెచ్చి యిచ్చారు. మళ్లీ హాల్లోకి వెళ్లి భగ

వాన్కి నమస్కారం చేశాం. ఏమీ ఎరగనట్టు అమాయకంగా నావంక చూశారు - అంత అల్లరీ చేసి. బాలకృష్ణుడి లీలలకి ఇదే అర్థంగావును ! నావెర్రితనాన్ని చూసి నవ్వుకుంటున్నారా ? కాని ఆయన నవ్వుతారా? ఆయనే వ్రాయలేదా —

"Mock me not, your refugee
Grant me your gracious smile"

అనలేదా అరుణాచలస్వామిని.

అార పుత్తరం వ్రాసింది నాకు. "రమణ మహర్షి దగ్గిరికి ఎందుకు వెళ్లావు ? నీకలనెప్పు కుదురుతుందనా? లేకపోతే యేమన్నా బోధిస్తారనా ? ఆయనతో డిస్కస్ (discuss) చెయ్యడానికా ? ఆయన మరి సాధారణంగా ఎవరితోనూ మాట్లాడరుకదా?" అని.

ఏం వ్రాయను జవాబు? తిరిగి వొచ్చాక, ఎవరన్నా "వెళ్లి ఏం తెచ్చుకున్నావు?" అని అడిగితే, ఏం సమాధానం చెప్పనా అని యోచిస్తే "Happiness, Happiness" అని వొస్తోంది జవాబు. భగవాన్ అనుగ్రహంతో ఆయనమీద మెడ తెగని ప్రేమతో మత్తెక్కిపోయింది ఆత్మ. అంతకన్న యేం చెప్పాలో తెలీదు. కాని చెపితే ఎవరికి అర్థమవుతుంది. నాహృదయసమీపవర్తివి నీకన్నా అర్థమవుతుందా? గీతాంజలిలో ఒకామెకి ప్రియుడు కత్తిని కానుకగా యిచ్చి వెడతాడు, జీవితంలోని బంధనాలు నరికేందుకు. ఏ మిచ్చాడని అడిగితే ఆకత్తిని ఏం చేసుకోనని, ఎట్లా చూపనని సిగ్గుపడుతుంది. అట్లా వుంది నా సంగతి.

ఇక్కడ వున్నంతసేపూ, యీప్రదేశం తప్ప, ప్రపంచమంతా లేదనిపిస్తుంది. నాకు ఇక్కడే వుండిపోవాలని వుంది. భగవాన్‌ని విడిచి వెళ్లాలని లేదు. నిజాన్ని విడిచి ఆ మాయలోకి ఎట్లా వెళ్లను? కాని ఇక్కడ వొంటరిగా ఎట్లా వుండగలను? ఈసమస్య పాపం, నాన్నముందు పెడితే "భగవాన్‌ని అడుగు" అన్నాడు. భగవాన్‌నా? విగ్రహంతో ఒకideaతో ఎట్లా మాట్లాడడం? ఆయనముందు మాట్లాడగలనా నేను ?

భయానాం భయం,
భీషణం భీషణానాం !

ఎప్పటికీ అక్కడ వుండిపోవడానికి వీలు కనపడటంలేదే అనేదిగులుతోనే గడిపాను మూడురోజులూ. నే నిక్కడ వుండిపోవాలనే వుద్దేశ్యమే భగవాన్‌కి వుంటే, ఆయనే అన్నియేర్పాట్లూ చేస్తాడులే అనేవిశ్వాసంతో మనసుని ఓదార్చాను.

బిలవెడ్ (Beloved), నేను ఇంక నీకు కనపడకుండా ఇక్కడ వుండిపోతానేమోనని భయపడవొద్దు. ఎట్లానో, భగవాన్ నన్ను నీదగ్గిరికే పంపించేస్తారు. ఎంత వైరాగ్యంతో, ఆనందంతో నింపినా, పదహారేళ్లనించి నా మిత్రులైన భోగాలూ, నాజూకులూ, భయాలూ పిరికితనాలూ యీమనసుని ఒకపట్టాన వొదలిపోతాయా ?

కాని ఇంతటితో భగవాన్ నన్ను వొదలివేస్తారని ఆశమాత్రం పడకు. ఆయనే అన్నారు ఒకసారి, తను పట్టినవాళ్లు పులి నోట్లో మాంసంకండ లవుతారని. నేను పిల్లి నోట్లో ఎలుకని అంటాను. వొదిలారని అనుకుని పారిగత్తిపోతే, అంతకన్న గట్టిగా మళ్లీ పడతారు, ఎక్కడికి పోతావని. ఇట్లా చలగాట లాడినట్టే ఆటతో, ఎప్పుడో అమాంతం మింగేస్తారు. ఇప్పు డప్పుడే కాదులే. అంతవరకే నేను నీకు.

కాని నీమీది ప్రేమ నశించిందను కోకు; ఎట్లాగంటే రాత్రి దీపంవెలుగులో చూస్తాము అన్నీ. ఏది చూడాలన్నా ఆ దీపాన్ని వెంట తీసుకుపోతాము. కాని హృదయంలో జ్ఞానోదయమైతే యీలోకంలో సూర్యోదయమైనట్లు. ఇంక దీప మెందుకు? లోకంమీద అంతా వెలిగే సూర్యుడు మనం రాత్రి చూసిన వస్తువులమీదకూడా అంతకన్న ఎక్కువగా ప్రకాశించడంలేదూ? అట్లానే ప్రేమ విశాలమైనంత మాత్రాన, ఇదివరకటి మనుషులమీద ప్రేమ పోదు. ఇంకా యెక్కువవుతుంది. కాని ఇప్పుడు ఆ మనుషులే కాదు అందరిమీదా వెలుగుతుంది.

నేను వ్రాసే దంతా నీకు absurd గా కనపడుతోంది — ఒక్కసారి అకాత్తుగా యీ వేదాంతంలోకి దిగడం! కాని నేను వ్రాశేదే వాస్తవం (real) గాను, లోకమంతా మాయ (absurd) గానూ కనపడుతోంది నాకు. నాలుగురోజుల్లో ఇట్లా మారిపోయినాను.

నాన్నా వాళ్లూ స్నానంచేసి వచ్చారు. మేము కొండ ఎక్కబోతున్నాము. మళ్లీ మధ్యాహ్నం వ్రాస్తాను. బహుశా ఇవాళే ప్రయాణ మంటున్నారు.

* * * *

మధ్యాహ్నం రైల్లో వ్రాస్తున్నాను.

కొండ దిగి వస్తో "మళ్లీ వస్తాను భగవాన్! నిన్ను విడవడం నాచాత కాదు. బెంగపడకు. నేను కనపడనని దిగులు పడవొద్దు" అనుకుంటున్నాను. నాకు కాదు దిగులు, ఆయనకిట; చూడు నావెర్రి!

హాల్లోకి వెళ్లి నమస్కారం చేశాము భగవాన్ ముందు.

"వెళ్లి వస్తాము" అన్నాడు నాన్న. నేను మాట్లాడకుండా ఆయన్ని కళ్లల్లో కలిపేసుకుంటున్నాను. గొప్ప చిఱునవ్వుతో నావంక చూశా రాయన. నాహృదయమంతా గొప్ప వెలుగుతో శోభించింది.

నా స్ట్రగుల్ (struggle) తెలిసిందా ఆయనకి! "మళ్లీ రమ్మని దీవనా?" ఆ చిరునవ్వు, "ఇంక ఎక్కడికి వెళ్లావు లే" అని హేళనా? "ఎట్లానూ రక్షించుకుంటాను. దిగులుపడకు" అని లాలనా? "దూరమనేది వుందా ఆత్మలకి!" అనిబోధనా?

దేహాన్ని రైలుకిటికీకి ఆనించి చూస్తున్నాను, దూరమవుతున్న అరుణాచలాన్ని. నిన్నసాయింత్రం విన్న వేదపాఠం ధ్వనిస్తోంది రైలుచప్పుడుతోకూడి. హాల్లో వెలిగించిన అగరొత్తుల పరిమళం స్ఫురిస్తోంది రైలుధూపంలో. కాని ఏదో పోగొట్టుకున్నట్లు 'శూన్యం' తోస్తోంది కళ్ల ముందు. ఔను. 'నేను'- అశూన్యం 'నేను.' నేను,- అక్కడే వుండిపోయినాను. భగవాన్ నన్ను అక్కడే వుంచేసుకున్నాడు. నామనసు వెతుక్కుంటోంది నేను కనపడక! నా దేహమంతా వెతుకుతోంది నేను ఎక్కడ వున్నానని, యీశూన్య మేమిటని. నా దేహామే వెడుతోంది రైల్లో, నేను లేను. ఎంత దొంగ—భగవాన్!

Beware of it O! man! Such a transformer of life is this Arunachala Hill!

---

# రక్తతృష్ణ

'హి మా నీ'

శర్వరీసుప్తవీథి సంచలన మెందు
లేని యంగనిర్జీవనైస్స్వ్యహ్యాపథము:
కాని, నాయెద రేపును కాలకలుష
దుర్ధ గళితశైత్యమారుతపురుతులు.

తారకాతతి కూడ నిశఃపుగార్ద్రి
ధవళిమ మరుగుపడి విషాదమున చూచె,
రేయిరేయెల్ల నరకమ్ముగా ననహ్య
కుటిలరక్తస్పృగా భీతి గొలిపె నపుడు;
ఒకమిణుగు, రొక్కకదలిక, ఒకదివాంధ
కంఠరుతమేని తోడులేకా భయాంక
రాంధకారమ్ములోన, శూన్యమ్ములోన
బంధితుడనైతి భావసమాధి మధ్య.

ఇంతలో నెదో గళమొక టిటుల బలికె
"స్నేహశీలీ! మరణమన్న చింత లేదె?
వెర్రి తలపులతోడ నీ విపినవీథి
సంచరింతువేల భయలేశమ్ము లేక.

కలయుచిహ్నమ్ము లివి వీని దెలిసికొనుము,
ఇపుడు మా ప్రభు నరుదెంచు నిటకు విజయ
దర్పితానేక సైన్యసంతతులతోడ;
మీర లిటనుండరాదు పొండెటకునైన".

"మమ్ము, స్వేచ్ఛాప్రియాత్మ్మల మాతృభూమి
వీడి క్రౌర్యాన బొమ్మనుడువేల?" యనుచు
నే పలుకబోయి లేచితి; నిదురనుండి
బరువుగా లేచె కంటి రెప్పలును అపుడె.

---

# ఆంధ్ర తేజము

(రెడ్డిరాజులకాలమునాటి యాంధ్రదేశచరిత్రాత్మక నాటకము)

శ్రీ నండూరి బంగారయ్య

## నాలుగవ యంకము - మొదటి రంగము

[రంగము: ధరణికోటకు సమీపమునున్న విశాలమగు బయలు. యుద్ధభూమి.

ప్రవేశము: రెడ్డిపక్షమునకు జెందిన ఇరువురు కమ్మవీరులు.]

మొ. వీ — నిన్న చూచిన ద్వంద్వయుద్ధమునకు సరివచ్చు ద్వంద్వయుద్ధమును ఇదివరలో చూడలేదు. ఇక ముందు చూడబోము.

రెం. వీ — నీవు సూక్ష్మముగ గనిపెట్టుచుంటివిగదా! — ఇరువురిలో నెవ్వ రధికు డందువు?

మొ. వీ — చెప్పజాలము. ఇరువురకు నిరువురే - నిన్నటియుద్ధమును పురస్కరించుకొని చూడగ నామట్టునకు నాకు మాదానీనిదే పైచేయి యనిపించినది.

రెం. వీ — ఏమో. ఎన్ని చెప్పినను యువరా జెక్కడ? మాదానీ డెక్కడ?

మొ. వీ — యుద్ధకౌశల్యములో తారతమ్యమును నిరూపించునపుడు అభిమానమును పురస్కరించుకొని మాటాడరాదు —

రెం. వీ — అంగీకరించితిని. ఒక్కటి చెప్పుము. యువరాజు బాణము తీయుట - ఎక్కుపెట్టుట - గురిచూచుట - విడుచుట నీ కేదైన గనుపించినదా? అన్నియు రెప్పపాటులో జరిగిపోయెడివి - ఆహా ఏమి లాఘవము! ఏమి లక్ష్యశుద్ధి!

మొ. వీ — కార్ముకవిద్యయందు యువరాజే ఘనుడు. కాదనలేనుగాని ఖడ్గయుద్ధముమాట యేమి చెప్పితివి? మాదానీడు ఖడ్గము త్రిప్పుచుండగ నెక్కడనయినను మనిషి కనిపించినాడా? దానికి నీవు సమాధానము చెప్పుము.

రెం. వీ — ఖడ్గయుద్ధముకూడ నొక యుద్ధమేనా? కౌశలము చూడవలసివచ్చినపుడు కార్ముకమునందే చూడవలెను.

మొ. వీ — అదేమిమాట? దేనికనత దానిది. నిన్నటియుద్ధము చూచినవెనుక నదివరలో మాచానీనిషయినున్న యభిప్రాయము నాకుఁ గొంత మారినది సుమా!

రెం. వీ — మాచానీడు మాత్రము తక్కువవాడా? - అఖండ శివభక్తుడు. అనవరత కవితాప్రియుడు. సంతత దాననిరతుడు.

మొ. వీ — ఎన్నిగుణములున్నను అంగీకరింతువుగాని అతని యుద్ధకౌశలమునుమాత్ర మంగీకరింపవు కాబోలును.

రెం. వీ — అంగీకరింపనంటినా? ఎటు వచ్చినను ఇరువురను సరిపోల్చవలసివచ్చినపుడు మాత్రము —

మొ. వీ — సరేకాని - ఈరెడ్లకును వెలమలకును నింత తీవ్రమయిన కక్ష యెందులకో? ఇరువురును కవిపండితపోషకులే గదా? ఇరువురును శ్రీశైలసోపాననిర్మాతలే గదా? ఇరువురును అవక్రవిక్రమాదిత్యులే గదా?

రెం. వీ — సమాధానము నీ మొదటిప్రశ్నమునందే యున్నది. వీరు రెడ్లు - వారు వెలమలు నగుటయే ముఖ్యకారణము.

మొ. వీ — హరిహరీ! కులకక్షలే కారణ మందువా?

రెం. వీ — అధికారతృష్ణ అన్నిటికంటెను ముఖ్యకారణ మనుకొనుము - అదిగో. యువరాజును మంత్రిపుంగవుడును ఇటులే వచ్చుచున్నారు. మన మిక్కడ మసలినచో మర్యాద దక్కదు.

[ఒకవంకనుండి ఈ యిరువురును నిష్క్రమింపగ ఇంకొకవంకనుండి యోధవేషములతో అనపోతారెడ్డి రామాప్రెగ్గడయు బ్రవేశింతురు.]

అ. పో — ఓకులద్వేషరాక్షసీ! నీ వెన్నడు కూలిపోదువోకదా! నీవు జీవించియున్నంత దనుక నీదేశమున కభ్యుదయము రమ్మనిన నెక్కడినుండి వచ్చును?

రామా — కుమారా! (అర్ధోక్తిలో భటుడు ప్రవేశించును.)

భటుడు — దేవా! అంతయు మించిపోయినది. అంతయు మించిపోయినది.

రామా — ఏమిరా, ఏమి మించిపోయినది?

భటుడు — వెలమలధాటికి తాళలేక మనవారు వెనుదిరుగుచున్నారు.

అ. పో — పద. దానికి మందు నాదగ్గర నున్నది. మీరోగము గుదిర్చెదను.

రామా — కుమారా! ఏమి చేసెదవు?

అ. పో — వెనుదిరుగుచున్న మన యోధులను మన యోధుల చేతనే నరికించెదను. అప్పుడు అపజయము జయముగ మారును.

రామా — నీయుక్తికి మిగుల మెచ్చుకొంటిని. తత్క్షణమే యాపద్ధతి నవలంబింపుము. ఇటునుండి మాదానీడు వచ్చుచున్నాడు. నిన్నావంకకు బోనీయకుండ నాపుట కీతడు యత్నించును. నే నీతనికి సమాధానము చెప్పెదనులెమ్ము. నీ వటు బొమ్ము.

[ఒకవంకనుండి యశపాలాదులు నిష్క్రమింపగ, ఇంకొకవంకనుండి మాదానీడు ఖడ్గధారియై ప్రవేశించును.]

మాదా — (రామాప్రెగ్గడవంక జూచి యెకసక్కెముగ) ఓహోహో! అపరచాణక్యులు! నవీనయౌగంధరాయణులు! నమస్కారము. నమస్కారము —

రామా — దేశహితైకచింతాసిద్ధిరస్తు!

మాదా — ఇదివరకు లేని దిప్పుడు వచ్చునా? తమవంటి బ్రాహ్మణోత్తములు తపస్స్వాధ్యాయములు మాని రాజతంత్రనిర్వహణమునఁ బ్రవేశించినవెనుక దేశమునకు హితముగాక మ రే మున్నది? కొండవీటిసీమ కఖండవైభవము చేకూర్పనెంచిన మంత్రిమాణిక్యులు మీ రుండగ నాంధ్రదేశముగతి యడుగవలెనా?

రామా — రాయబందీవిమోచకులు! కాకతీయ సామ్రాజ్యస్థాపనాచార్యులు! స్వస్వరూపజ్ఞానము లేకుండ మాట్లాడుచున్నారు గాని —

మాదా — ఒకరిబిరుదముల నధిక్షేపింపనక్కరలేదు. మీ ప్రభువులుమాత్రము తక్కువవారా? సంగ్రామధనంజయులు! వీరనారాయణులు! సంగరపాలురు! ఎప్పుడయిన మీ ఎర్రాప్రెగ్గడగారు కంటబడినచో నడుగవలె ననుకొనుచున్నాను. పవిత్రమయిన హరివంశమును భట్రాజపొగడ్తలతో నింపి పాడుచేసినాడు.

రామా — ఇంతవరకు సాధించిన పాతిత్యము చాలదా? పూజ్యులయిన మహాకవులజోలికిఁ గూడఁ బోవలయునా?

మాదా — "మహాకవి మహాకవి" యని మనము డప్పువైచుకొని చాటినంతనే మహాకవి యగునా? తిక్కనసోమయాజి నరాంకితము చేయనొల్లని భారతమున కుత్తరభాగమగు హరివంశమును నరస్తుతులతో నింపిన పాపమునకు పరిహార మున్నదా?

రామా — ఆదికవియగు నన్నయమాత్రము భారతము నరాంకితము చేయలేదా? అంతమాత్రమున నన్నయకృతికి పవిత్రత తగ్గినదా?

మాదా — మీసమర్థనము చక్కగ నున్నది. ఆదినుండియు మీసీమను వసించిన మహాకవుల కిదే సంప్రదాయ మనుచున్నారా?

రామా — విద్వేషమును పురస్కరించుకొని వెలువడు విమర్శనమును పాటించువారెవ్వరు? వాదమునిమిత్తమైన మహాకవుల నధిక్షేపింపవలసిన భారము "వలదు వల" దనుచుండగ నెత్తిని బడుచున్నది. ఇక నావిషయమునుగూర్చి మాటాడరాదు.

మాదా — వలదు వల దనుచుండగ మీనెత్తిని బడినభార మిది యొక్కటియే కాదుగదా? యజ్ఞాదికర్మములను నిర్వహింపవలసిన విప్రోత్తములపయి రెడ్ల నాంధ్రసామ్రాజ్యము నేలింపవలసినభార మయాచితముగ బడినదా? లేదా? మంత్రోపదేశ మొనరింపవలసిన నాలుకకు కుయుక్తు లుపదేశింపవలసిన భార మయాచితముగ సిద్ధించినదా లేదా?

రామా — ప్రజారక్షకులుగ నుండవలసిన ప్రభువులు ప్రజాకంటకు లయినప్పుడు గత్యంతరము లేక యవలంబింపవలసివచ్చిన వృత్తికి మమ్ము దూషించుటలో నౌచిత్య మేమున్నది?

మాదా — దూషించుట లేదు. నియోగవృత్తి నవలంబించినందులకు నిజముగ మిమ్మభినందించుచున్నాను. నాలుకపై నమృతము! హృదయమున కాలకూటము! ప్రత్యక్షమున వినయము! పరోక్షమున దుర్నయము! ఏమి చక్కనివృత్తి?

రామా — ఏవృత్తియైన సహవాసదోషమున సిద్ధించినదే గాని అనాదినుండియు నున్నది కాదు గదా? అనిందలోనో- అభినందనములోనో- అంతయో ఇంతయో పాలుమాకు గురుతుల్యులయిన మీకుగూడ నున్నదే గదా! బాహుబలము ప్రకటింపవలసినచోట వృథాలాపములచే నేమి ప్రయోజనము?

మాదా — విప్రోత్తమా! సిగ్గు సిగ్గు. ఇదేమి యగ్రహారము లిచ్చుటా? యజ్ఞములు చేయించుటా? ఇంతకుపూర్వము నే నిక్కడి కడుగు పెట్టకపూర్వమే పలాయితుడయిపోయిన మీ యువరాజులుంగారితో నొకచేయి చూడవలె నని వచ్చితిని. అంతే కాని బ్రాహ్మణు లగు మీతో నాయుధవ్యాపారమునకు గడంగుదునా?

రామా — పలాయితు డయ్యెనని యపనిందలు వైచినంతమాత్రముననే పౌరుషము నిలువబడిన దనుకొనుచున్నారా? అదిగో! చూడుడు. మీ సేనలపై కాతడు ప్రళయరుద్రునివలె విజృంభించుచున్నాడు.

మాదా — ఎంతటి రుద్రుడైనను నాముందు క్షుద్రుడు గాక తప్పదు.

రామా — ఆ మాహాత్మ్యము మీలో నుండవలెను.

మాదా — ఎవరిలో నున్నదో ఇప్పుడే ప్రత్యక్ష మగునుగాదా?

(మాదానీడు నిష్క్రమించును.)

[ అంతట వెనుకటితెర ఎత్తగ సైనికులను హెచ్చరించుచు అనపోతారెడ్డి ప్రవేశించును. ]

అ. పో — ఓ ఆంధ్రయోధుడా !

గీ. పగిలిపోయిన దానిమ్మపండురీతి
హృదయ మొప్పగ నాంధ్రుని వదనసీమ
దృష్టి నిడి యేడ్చుచున్నది తెనుగుతల్లి ;
ఏల వెనుకంజవైతు వోయీ కుమార !

రామా — ( సవిరాపించి)

ఉ. తిన్నది రెడ్డిరాజకులదీపకు పన్నము ; కాలుబెట్టి నీ
వున్నది పుణ్యభూమిపయి ;—నూర్జితశౌర్యకలావిలాసినీ
సన్నుతపూర్వవైభవము జారగ నెవ్వడు గేల పెట్టెనో
యన్న ! జయేందిరారమణియాదల నిల్వము భూమిగంబవై.

అ. పో —

ఉ. చెంగరి—యోగమార్గమున జేరగరాని సువర్ణభూములన్
బొందని మాల్యపీతమున బుప్పముగా నిడి పూర్వయోధు ; లో
మందమతీ ! యధోగతికి మాటికి మూలెద నేల ? రక్తపుం
బిందువు లెల్ల చిందవలె వీరపథంబున నాంధ్రపుత్రకా !

(తెరపడును.)

## రెండవ రంగము

[రంగము : ధరణికోట ; కృష్ణానదీమధ్యమున నొకయేకాంతసైకతము. ప్రవేశము : ఒంటిగ యోధపురుష వేషముతో విజయాంబ.]

విజయా — నిరాశాదగ్ధమగుచున్న నాహృదయమునకు ఈకృష్ణానదీపవనములు నూతన చైతన్యమును ప్రసాదించుచున్నవిగదా ! ఇక్కడనుండి నగరలక్ష్మి యెంత కన్నులపండువుగ గనవచ్చుచున్నదో !

సీ. ఇచ్చోట నాంధ్రుని హృదయకేదారంబు ముక్కారుపంటల మురిసిపోయె ;
ఇచ్చోట నాంధ్రుని హృదయవేదిక నిల్పి ప్రాచీనశౌర్యంబు ప్రజ్వలించె ;
ఇచ్చోట నాంధ్రుని హృదయసౌధంబుపై శిల్పకళాలక్ష్మి చిందులాడె ;
ఇచ్చోట నాంధ్రుని హృదయవిహారంబు బౌద్ధయోగికి తపస్సిద్ధి గూర్చె ;
వీణియల మించి మేదినీరేణువులును
ఆంధ్రతేజోవిరాజితమైన గీతి
నాలపించుచు నిచ్చోట కాలగర్భ
కీలితములైన గాథల మేలుకొలుపు.

ఆదినము లిక మరల రావుకాబోలును.

ఉ. పోయెనె యాంధ్రదేశమున పూర్వమునన్ వెలుగొందు శిల్పవి
ద్యాయత బౌద్ధధామములు, ధర్మనిరూఢసభాంగణంబులున్,
న్యాయకళాప్రవీణవరశాతవహేంద్రుల త్యాగభోగల
క్ష్మీయుతవైభవంబులును జీర్ణములై యమరేశ్వరప్రభూ ?

తల్లీ కృష్ణవేణీ!

శా. ఏయేరాజ్యము లుల్లసిల్లినవొ నీయీ తీరదేశంబునం
దేయేవీరులు విక్రమక్రమముపై నీ యాంధ్రభూమీప్రజన్
శ్రేయస్ఫార విహారహారు లసదున్ సేవించి పూజించిరో
ఆయాగాథల నాలపింపగదవమ్మా ముక్తకంఠంబునన్.

(ప్రవేశము: తొందరతో పేదరాశి పెద్దమ్మ)

పే. పె — అమ్మా! నీ విక్కడ నున్నావా, నీకొరకు ఊరంతయు వెదుకుచుంటిని. ఇట్టి స్థితిలో నాదమరచి ని న్నొంటిగ విడిచిపెట్టిన నామందమతికి నన్ను నేను నిందించుకొనుచుంటిని. ఇంతలో నీసంకేతస్థలము జ్ఞప్తికి వచ్చినది. నీవు నిరపాయవై గనవచ్చినచో కాకితమ్మకు మేకపిల్లను బలి యిచ్చెదనని మ్రొక్కుకొంటిని.

విజయా — అవ్వా! అంత సులువుగ పోవుప్రాణమా యిది? పుట్టీపుట్టకుండగనే తల్లితండ్రులను బలిపుచ్చుకొన్నదిగదా! "పాపీ చిరాయు" వను నార్యోక్తి యొకటి మనకు బలవత్తరమైన యాలంబనముగ గనవచ్చుచున్నదిగదా!

పే. పె — అమ్మా! అటు లనకుము. నీవు పాదము పెట్టుటచే నీనేల పవిత్రమయినది. నీవు లేకున్నచో పగటిపూట చుక్కలు పొడవవా? అనపోతారెడ్డిని వివాహమాడి యాంధ్రసామ్రాజ్యమునకు లక్ష్మివై నీవు సింహాసనముపయి గూరుచుండగ కనులు చల్లగ చూచుభాగ్య మెన్నడో యనిమాత్ర మెదురుచూచుచున్నాను.

విజయా — అవ్వా! ఎంత వెర్రిదానవు! ఆతనిసన్నిధిని మరణింపగలిగినచో నాతనిని బరిణయమాడినంతటి ఫలము. అందులకుంగూడ నాయమాత్యశేఖరుడు నా కవకాశము దొరకనీయకుండనున్నాడే? కానిమ్ము. ఈయుద్ధ మేదో తేలిన వెనుక —

పే. పె — అబ్బబ్బ! అవాచ్యములను నోటికి రానీయవలదని యెంత బ్రతిమాలినను మానవుగదా! నిక్షేపములాగున పెండ్లిపీటలపై గూర్చుండవలసిన యీాడున —

విజయా — మొదటినుండియు నాచరిత్రమును దెలిసికొన్నచో నీ విట్లాసింపవు. ఎటు చూచినను విషాదాంతమగు సూచనలేగాని శుభాంతమగు సూచనలు నాజీవితనాటకమునకు లేవు.

పే. పె — ఇరువదియేండ్లు నిండ లేవు. నాకంటె నెక్కువ యనుభవ మున్నట్లు మాటాడు చున్నావు. ఇక నే నేమి చెప్పను? పుట్టగనే తల్లిదండ్రులను గోలుపోయినవా రెంత మంది లేరు? ఆయువులో, ఐశ్వర్యములో, చదువులో, సౌభాగ్యములో వారిలో పరిపూర్ణవైభవ మనుభవించినవా రెందరు లేరు?

విజయా — అది కాదవ్వా - నేల విడిచి సాము చేసెదనందు వేమి? నేను మాదాసీని కుమార్తె నని తెలసినవెనుక యువరాజు నన్ను క్రీగంటనైన జూచునందువా? ఈ నని మాట మెట్లున్నను ఈతనిని వేయికన్నులతోఁ గనిపెట్టుచున్న యమాత్యశేఖరుడు తన ప్రాణములనైనను విడుచును గాని మా దాంపత్యమున కనుమతించునా? ఆతని మాటకు వా రడుగుదాటరు గదా! ఎటువచ్చినను ఇన్నాళ్లీ మహాపురుషుని సాంగత్యము లభించుటే మనకు పూర్వజన్మ సుకృతఫలము. అంతతో మనము సంతోషింప వలెను. అనుభవము చాలని కవివలె ఈ సాంగత్యకావ్యమున కెట్లు స్వస్తి చెప్ప వలెనో తెలియక కళవళపడుచున్నాను.

పే. పె — (తనలో) లేనిపోని యఃపోహలు కల్పించుకొనుట కీమెను చెప్పి మరియొకరిని చెప్పవలెను. ఇక నీమెతో నెంత వాదించినను లాభము లేదు. ఇంకొక ప్రసంగము తేవలెను. (ప్రకాశముగ) అమ్మా! ఈ దినము నీ ప్రియుని పరాక్రమమును నీవు విన లేదు కాబోలును. ఆతడు ప్రచండభాస్కరుడయి విజృంభించినాడట!

విజయా — ప్రియుని పరాక్రమమునకు సంతసింపనా? తండ్రిపరాభవమునకు విచారింపనా? ఎవరు విజృంభించినను తుదకు జరుగుచున్న దాత్మహత్యయే గదా! ఆంధ్రు లొకరి నొకరు వధించుకొనుచున్నారా, అది విని నేను సంతోషింపనా? ఎటు వచ్చినను అనారోగ్యనెపమున నే నీ యన్యోన్యవధను కనులార చూడకుండ తప్పించుకొంటిని.

పే. పె — అడుగో, నీ ప్రియు డిక్కడికే వచ్చుచున్నాడు. నేను పోయెదను. యుద్ధ విశేషము లాతనినోటనే వినగలవు. (నిష్క్రమించును.)

విజయా — తల్లీ ధాన్యవాటికా?

శా. ఏకాగ్రంబుగ నాంధ్రవీరులు యశోహేమాద్రి నిర్మించుచో
నేకంటన్ ప్రమదాశ్రుపూర్ణ వసుమన్ వీక్షించి తా కంటనే
శోకంబున్ వెలిగ్రక్కు బాష్పములతో క్షోభించి యన్యోన్యహిం
సాకాలుష్య కళంకితం బయిన యీ సౌభాగ్యమున్. జూచెదే.

[యుద్ధవేషముతో విచారగ్రస్తుడై అనపోతారెడ్డి ప్రవేశించును.]

అ. పో — మిత్రమా! యాంధ్రున కిది కష్టకాలము. ఈదినమున నాకన్నులతో నేను పదివేలమంది యాంధ్రవీరులపాటు చూచివచ్చితిని — ఇప్పటికి మూడుసారులు తరిమి

కొట్టినను ఇసుళ్ళుపుట్టవలె నెక్కడినుండియో శత్రుపక్షమున సైనికులు వచ్చి పడుచునే యున్నారు. రావణునిశీర్షములవలె నరికిన తలలే మరల మొలచుచున్నవేమో తెలియదు.

విజయా — అయిన రేపుదయము మరల యుద్ధమున్నదనినమాట —

అ. పో — ఏమి యుద్ధమో నాకు తెలియకుండ నున్నది. ఈదినమున అపజయమును తప్పించుకొని యీవల బడునరికి తలప్రాణము తోకకు వచ్చినది! రెడ్డిరాజ్యభానుని కిది గ్రహణకాలము. నే నొక్కడనే చాలుదునని మహారాజుతో బీరములు పలికి వచ్చితిని. కాని నా కీపరవీరసేనాసముద్రము దుస్తరమగుచున్నది — ఆహా! మాదాసీడు విక్రమాదిత్యుడయి విజృంభించుచున్నాడు ఏమి చేయుటకును దోచకుండనున్నది —

విజయా — అతిమానుషపరాక్రములగు మీకును క్లిష్టపరిస్థితులు వచ్చినవే?

అ. పో — ఇంతవరకు పదిపర్యాయములైనను మే మొకరి నొకరు తలపడినాము. ఎప్పుడును అపజయ మనుమాట యెరుగను. ఆతడు నాతో యుద్ధము చేయుటకు జంకువాడు గాని నే నాతనితో యుద్ధముచేయుట కెన్నడును జంకి యెరుగను.

విజయా — ఈతడవకూడ మూడు దినములనుండి యాతనిని ముప్పతిప్పల బెట్టుచున్నారు గదా. —

అ. పో — ముప్పతిప్పల బెట్టుచున్నా మనుము; మాకు సంఖ్యాబలము చాలదు. పదివేల బలముతో నూకారెడ్డి కోరుకొండసీమకు బోయినాడు. ఇరువదివేలతో మల్లారెడ్డి మోటుపల్లి కేగినాడు. కొంతబలము అద్దంకిలో నుంచకతప్పదు గదా! అదిగాక పదేపదే యుద్ధములతో మావీరు లలసిపోయియున్నారు. ఇవన్నియు నీతో చెప్పుచున్నా నని తెలిసినచో నమాత్యశేఖరుడు నన్ను బ్రదుకనీయడు.

విజయా — నాథా......కాదు, కాదు. దండనాథాగ్రణీ! ఆపత్సమయమున మీ కుపకరింపని నా జన్మ మెందులకు— ఏమి చేయవచ్చునా యని యాలోచించుచున్నాను.

అ. పో — శరీరములో స్వాస్థ్యములేని నిన్ను సంక్షోభింపజేసి మరింత బాధించుచున్నాను. కానిమ్ము, నాతో చెలిమిచేయుటయే నీ వొనర్చిన మహాపరాధము., అందుల కీదండన మనుభవింపకతప్పదు.

విజయా — ఇట్టి ప్రశంసావాక్యములవలన ప్రయోజన మేమి? ఏదైన నుపాయ మాలోచింపవలెను. —

అ. పో — నా కేయుపాయమును పాలుపోకుండ నున్నది. కోరినను ఇప్పు డద్దంకినుండి సాయము రానేరదు. దైవికముగ నేదయిన తటస్థింపవలెనుగాని — నాపౌరుషమువలన ప్రయోజన మున్నట్లు తోచదు. నాబ్రదుకు "దినదినగండము వేయేండ్లాయు" వనిన

ట్లున్నది. ఏదో సాహసించి యొకవిపమునన్ని వేశమున జిక్కుకొనుట, తుదకు దైవ సాహాయ్యమున నావలబడుట — ఈలీలన నడచుచున్నది. —

విజయా — నేను రే పుదయమున నే యుద్ధమునకు వచ్చెదను.

అ. పో — అయ్యయ్యో! వలదు. వలదు. నీయారోగ్యము బొత్తుగ బాగులేదు. —

విజయా — మహాశయా! మరేమియు భయములేదు. రెడ్డిరాజ్యభాస్కరు డస్తమించినచో ఆర్యధర్మములు పూర్ణముగ నడుగంటిపోవును. పొంగి పొంగి వచ్చుచున్న విజాతీయ మహాసముద్రమున కీరాజ్యము చెలియలికట్టవలె నున్నది. దీనినైన సంరక్షించుకొన్న సరి, లేకున్నచో మనజన్మములు కాల్పనా? ఇది మీకార్యముగ మీ రెన్నడును భావింపవలదు. యావద్భారత దేశమునకును ప్రాణదాయకమయిన యుద్యమ మిది — ఇందులో నాహుతియగు భాగ్య మెంతవారికి పట్టను?

అ. పో — (తనలో) యుద్ధమునకు పోవుచున్నా ననినమాటయేగాని నాహృదయ మీతని కడనే నిల్చిపోవుచున్నది. ఈతడుకూడ యుద్ధమునకు వచ్చినచో ద్విగుణీతోత్సాహముతో విజృంభింపవచ్చును. (ప్రకా.) నీవుకూడ మాతల్లికడుపున నేల జన్మింపవైతివి?

విజయా — (తనలో) అట్లయినచో నాజన్మ మంతయు నిష్ఫలమే యగునుగదా (ప్రకాశముగ) నా......నాయకాగ్రణీ! ఆమాట లన్నియు తరువాత నాడుకొనవచ్చును. మీ రీ వేషమును విడిచి ఇంచుక విశ్రమింపుడు. పవలెల్లను శ్రమపడి బడలియున్నారు. కర్తవ్యమునుగూర్చి మీ రేమాత్రమును బెంగపెట్టుకొనవలదు.

అ. పో — నీవు చెప్పినట్లు నేను బడలియున్నాను. రవంత విశ్రాంతి గైకొందును. నీవు కూడ ఈరాత్రి మనస్సు నలజడిపెట్టుకొనక పూర్ణమైన విశ్రాంతి ననుభవింపుము. ఎంత నేపటికయిన నిన్ను వీడవలె నని యుండదు గాని ఇక నిక్కడ జాగుచేసినచో నమాత్యశేఖరునివలన మాట వచ్చును.

అనపో — }
విజయా — } (చేతులు జోడించుకొని)

ఉ. 'పాహి' యటన్న మా హృదయభావ నిరూపణ చేసి చేసి — వి
ద్రోహులు దేశమాతపయి దూసినకత్తులు మొక్కపోవ నే
సాహస మాచరించెదరో! సాయము గోరి వరంబు నిచ్చెడన్
'దేహి' యటంచు వేడితిమి దేవతలార! యనుగ్రహింపుడీ!

(తెర పడును.)

## మూడవ రంగము

[ రంగము : మాదాసీనిశిబిరము. ప్రవేశము : శయ్యపయి గూర్చుండి మాదాసీడు.]

మాదా — తల్లీ! విజయాంబ! ఆజన్మాంతము నే నిట్లాక్రోశించుచుండవలసిన దేనా? స్వప్నమందయిన నాకు నీ సందర్శనము లభింపదా ?

( ప్రవేశము: పురుషవేషముతో విజయాంబ )

మాదా — ఓయీ, ఎవరు నీవు? సెలవు లేనిదే లోనికి ప్రవేశించినావు?

విజయా — (కత్తిని దూయును.)

మాదా — ఆ- ఏమి నీకండకావరము? (అని మొలనున్న కత్తిని దూయును.)

విజయా — నాయనగారూ! ఆయాస మెందులకు? ఈకత్తిని మీచేతి కందిచ్చుటకే యొర నుండి తీసితిని. ఇదిగో! దీనితో నాశీర్షమును ఛేదింపుడు (అని కత్తి నందీయబోవును.)

మాదా — (తనచేతిలోనున్న కత్తిని జారవిడుచుచు) ఇది స్వప్నము కాదుగద? (అని కన్నులు తుడుచుకొని నిదానించి చూచి) హా కుమారీ! హా కుమారీ! నీవు మరణించితి వనుకొంటినే? నిజముగ బ్రదికియుంటివా?

విజయా — నిజమ నకు బ్రదికిలేను. తండ్రీ! సందేహింతు రేల? జీవచ్ఛవమునైన నాతలఁ ద్రుంచి నన్ను స్వర్గమునకు బంపరా?

మాదా — అమ్మా! అంతటి ఘోరకార్యము నాచేత గాదు. చేజేత పుత్రికావధము జేయు నంతటి నృశంసుడను గాను నేను.

విజయా — మాతృవధముందు పుత్రికావధ ఘోరకార్యమా?

మాదా — ఆఁ! వెలమవీరావతంసునిపయి మాతృవధ మోపుచున్నావా? చూడు, జాగ్రత్త!

విజయా — జాగ్రత్త యని బెదరించి మీరు నన్ను చేయగలిగిన దేమి? నాకంఠమును ద్రుంచెదరు. అంతేకదా? ఇదిగో! నాప్రాణములను దండగా గ్రుచ్చి పుష్పోపహారముగ మీపాదములసన్నిధిని సమర్పింపనుంటిని. నేను కోరుకొనుచున్నది, మీరు సంకల్పించినది ఒక్కటియేకాదా ?

మాదా — తల్లీ! మాదాసీడు స్త్రీవధను సంకల్పించునంతటి దుష్టచిత్తు డనుకొంటివా?

విజయా — స్త్రీవధమైనను మేలే! గోవధమైనను మేలే! బ్రాహ్మణవధమైనను మేలే! అనేకవేలగోవులకును స్త్రీలకును బ్రాహ్మణులకును మాతృస్వరూపిణియైన ఒకదేవతను ఇప్పుడు మీరు వధించుట కుద్యుక్తు లైనారు.

మాదా — అబ్బబ్బ! రోమరోమకూపమునను ఒక్కొక్క శూలముతో పొడిచినను నా కింత బాధ యుండదు. నీమాట లేమియు నా కర్థముగాకుండ నున్నవి.

విజయా — తండ్రీ! అదిగో! ఆంధ్రమాత! అదే ఆమెశీర్షముపయి నభయహస్త ముంచి యాశీర్వదించుచున్న శ్రీశైలమల్లికార్జునుడు. అడుగో ఆమె గుండెను జీల్చి వ్రక్కలు జేయుటకు ఖడ్గము నూరుచున్న మాదానీడు.

మాదా — ఆఁ! ఆఁ! ఎంత ఘోరముగ మాటాడుచున్నావు?

విజయా — నామాటలకంటె మీచేష్ట లెన్నియో వేలరెట్లు ఘోరతరముగ లేవా?

మాదా — ఇందు నాయొక్క నిమీదనే నేర మెట్లు మోపుటకు వీ లున్నదో తెలియకున్నది. ఇరుకక్షులవారును సిద్ధపడిననే గాని యుద్ధము సంభవింపదుగదా?

విజయా — తండ్రీ! ఇతరులజోలికిఁ బోక తమరాజ్యమును తాము గోబ్రాహ్మణహితముగఁ బాలించుకొనుచున్నవారు రెడ్లు.— వారిమీదికి కుడిచి కూర్చుండి యుద్ధమునకు వచ్చినవాడవు నీవు. ఎన్నివిధముల బతిమాలినను నీ వీ యుద్ధసంకల్పమునకు స్వస్తి చెప్పవైతివి. అందుచే నీ నిలయమున నిక వసింపరా దని ప్రచ్ఛన్నవేషమున దేశాంతరము చొచ్చితిని.

మాదా — తల్లీ! నీవు నాయింట నడుగుపెట్టుట జనకుని యింటిలో సీత పాదము పెట్టినట్లుగ భావించి యహోరాత్రము లానందించుచుండువాడను. నీవు నాయెడ నెట్టి యన్యాయ మొనర్చితిని? నీవు కనబడకపోయినతరువాత మెతుకు ముట్టినచో నొట్టు.—

విజయా — తండ్రీ! నీకు నాయెడ నిజమయిన యనురాగ మున్నదని నేను విశ్వసింపను. నిజమైన యనురాగమే యున్నచో ఏప్రయోజనమును సాధించుటకయి నేను నీయిల్లు విడిచిపెట్టియుందునో నీ వూహించియుందువు. ఇప్పటికయిన నీ దురుద్యమమును విరమించుకొనకపోవుట చూడగ —

మాదా — వెర్రిదానా! వెలమలకు ప్రాణములకంటెను పగ సాధించుట ప్రియతరము. అందుచేత నీవు కాదుగదా —

విజయా — అదిగో నాయనగారూ! అటు చూడుడు. కాలయవనికను చీల్పవలయును — ఖడ్గముతో గాదు — అంతర్నేత్రములతో — అదుగో! ప్రాచీనాంధ్రసామ్రాజ్యలక్ష్మి! అటు గంగాతీరము మొదలుకొని యిటు కాంచీపురమువరకును గల నరపాలు రామెకు వింజామరలు వేయుచున్నారు. అటు అజంటా మొదలుకొని ఇటు అమరావతివరకును గల శిల్పు లామెకు సింహాసనములు చెక్కుచున్నారు. అటు రోమకదేశము మొదలుకొని ఇటు చీనాదేశమువరకును గల వర్తకు లామెకు కానుకల బంపుచున్నారు. ఈనాటి బహునాయకత్వము ఈనాటి

మనస్పర్థలు – ఈనాటి స్వార్థపరత్వము – ఆనాడు విజృంభించి యుండినచో దేశ మంతటి యుచ్ఛదశ ననుభవింపగలదా ?

మాదా — దూరపుగొండలు నునుపు. ఆనాడుమాత్రము మంచితనము ముద్దగట్టిన దం డువా? రామరాజ్యము పెన్నంటియే రావణరాజ్య మున్నది. దేశమునందలి ప్రజ లం దరును పూర్ణముగ రాము లగుటకాని పూర్ణముగ రావణు లగుటకాని ఎన్నడును తట స్థింపదు.

విజయా — ఆమాత్రము స్వస్వరూపజ్ఞాన ముండిన చాలును.

మాదా — ఆఁ! ఆఁ! ఎంతపోటు పొడిచితివి?

విజయా — నాయనగారూ! క్షమింపుడు. మీరు చెప్పినట్లు అంతఃకలహము లేదో యొక రూపమున నెప్పుడును నున్నదే కాని వెనుకటిదినములకు ఈదినములకును ఒక్కయంశ మున భేద ముండితీరవలెను. దేశమున కాపద తటస్థించినపుడయిన ప్రజలు తమయంతః కలహములను మరచిపోయి ఏకముఖముగఁ బనిచేసియుందురు; లేకున్న నంతటి యఖండ వైభవ మాంధ్రదేశ మనుభవించియుండదు.

మాదా — ప్రస్తుతరాజకీయ పరిస్థితులను దెలిసికొనక నీవు మాటాడుచున్నప్పుడు నే నేమి చెప్పగలను?

విజయా — అయ్యయ్యో! నే నీనడుమ చేయుచున్నపని యేమనుకొంటిరి? దేశాటన మొనర్చి రాజకీయపరిస్థితులను చక్కగ గమనించితిని. ఆటలో నిమగ్నుడయి కూర్చుం డినవానికి తోచని ఎత్తులు ఈవలనుండి చూచుచున్నవానికి తోచును. అంతఃకలహ ముల కిది యెంతమాత్రమును తగిన సమయము కాదు. —

మాదా — మేము శస్త్రజీవులము — ఇది మాకు స్వధర్మము.

విజయా — స్వధర్మమున కెంతటి విపరీతార్థమును సెలవిచ్చుచున్నారు? మాతృదేవత మంగళసూత్రమును శస్త్రముతో ఛేదించుట స్వధర్మమా? పచ్చగ పెండ్లిపందిరివలె నున్న దేశమునకు నిప్పు పెట్టుట స్వధర్మమా? జాతి కంతకును కిరీటములవలెనున్న నాయకులను వధింపజూచుట స్వధర్మమా? ఏమి? మాటాడరేమి?

మాదా — కుమారీ! చిన్నతనమునుండియు నిన్నెరుగుదును. నీ వెన్నడును నాయెదుట నిట్టియావేశముతో మాటాడియెరుగవు. ఈదినమున నేదో యొక దేవత నిన్నావహించి యుండవలెను. నీకు నేను ప్రత్యుత్తర మీయఁజాలకపోవుచున్నాను. నన్నిప్పు డేమి చేయుమందువు?

విజయా — నాయనగారూ! భారతదేశభాగ్యమున కధినేతలగు త్రింశత్కోటి దేవతలును ఈముహూర్తమున మిమ్మభినందించి యాశీర్వదించుచున్నారు. — ఏనాడు జయచంద్ర

హతకుడు స్థానేశ్వరమున దేశద్రోహగీతము నాలపింప నారంభించినాడో, నాటినుండి నేటివరకు నాతని మానసికపుత్రు లని చెప్పఁదగిన తరువాతి దేశద్రోహులుకూడ నదే గీత మందుకొని రాగముకాని తాళముకాని మార్చకుండ నాలాపనము సాగించు చున్నారు - ఇప్పుడు రవంత విరామము సిద్ధించినట్లు గనవచ్చుచున్నది. —

మాదా — నీమాటలు వినినకొలది నాహృదయము కంపించుచున్నది.

విజయా — మీమనఃపరిణామము చూచినకొలది నాతనువు పులకరించుచున్నది. మొన్న మొన్ననేగదా రామదేవహతకుఁడు రెండవజయచంద్రుడయి యాంధ్రసామ్రాజ్యమును తనపాట్టను బెట్టుకొనినాడు ?

మాదా — తల్లీ ! నీవ్వనములో నేడు దేవతలు ప్రతిధ్వనించుచున్నారు. —

విజయా — తండ్రీ! మీహృదయమున నేడు భగవంతుడు ప్రత్యక్షమగుచున్నాడు. ఇప్పటికి మూడుశతాబ్దములకు పూర్వము ప్రారంభించిన భారతదేశపారతంత్ర్యనాటకమునకు నేటితో భరతవాక్యము చెప్పిన ట్లయినది. —

మాదా — ఎట్లు ?

విజయా — ఎప్పుడు నాప్రార్థనకు మీరు సుముఖులయి యుద్ధమునకు విముఖులయి స్వజన రక్తపాతమునకు స్వస్తి చెప్పబోవుచున్నారో అప్పుడే దేశాభ్యుదయ మారంభమయి నట్లు కాదా? ఇంతవరకు మన దేశీయులేగదా మన దేశమును గెల్చి పరరాజుల కర్పించి నది?

మాదా — తల్లీ! కొందరు వ్యాఖ్యాతలవలె నీవు నామాటలకు నే నుద్దేశింపని విశేషా ర్థమును గల్పించుకొంటివి. దేనిని సంకల్పించుటకుగాని నాకు స్వాతంత్ర్య మెక్కడిది? అన్నగారి యాజ్ఞ ననుసరింపవలసినవాడ నేకదా!

విజయా — తండ్రీ! అంతేనా? స్వయముగ ధర్మాధర్మనిర్ణయ మొనర్చుకొనుటకు తగిన వివేకము మీ కున్నను అనుసరించుటకు స్వాతంత్ర్యము లేదా ?

మాదా — ఇప్పుడు నీవు చెప్పనేచెప్పితివిగాదా ? ఎవరికి వారే నాయకు లగుటవలన దేశ మున కెంత యనర్థదాయకమో. చిరకాలముక్రితమే నాజీవితమును మాయన్నగారి పాద ముల కంకిత మొనర్చుకొంటిని.

విజయా — మీ సౌభ్రాత్రమునకు సంతసింపవలసినదే. కాని దానిని మీరు దేశసేవ కేల వినియోగింపరాదు? నిజపరిస్థితు లన్నియు తెలియబరచి యుక్తియుక్తముగ నిరూపించి నచో మీయన్నగారుకూడ మీయభిప్రాయముతో నేకీభవింపవచ్చునుగదా! ఆయన కేర నేల వ్రాయరాదు ?

రూదా — ఏమని వ్రాయను? నా కీయుద్ధభూమి చూడగనే ఒడలు కంప మెత్తుచున్న దని వ్రాయనా?

జయా — ఆహా! స్వజాత్యభిమానమున్న ఏ యాంధ్రునికైన నీ యుద్ధభూమి చూడగనే ఒడలు కంప మెత్తవలసిన దే.

రూదా — నీవు బౌద్ధధర్మమును పురస్కరించుకొని మాటాడుచున్నావు గాని —

జయా — ఆర్యధర్మము మాత్రము ధర్మక్షేత్రమున యుద్ధ మొనర్చినచో వీరస్వర్గము లభించునని చెప్పినది కాని —

రూదా — అమ్మాయీ! నీతోడ యుక్తికిఁ బ్రతియుక్తి చెప్పుట కష్టము —

జయా — ఏకష్టమును లేకుండ నుండు మార్గమును నే నిదివరకే మనవి చేసికొంటిని గాదా? ఇదిగో! చేతులు జోడించుచున్నాను. నాతోఁబాటు ఈ ముహూర్తమున శాతవాహనచక్రవర్తుల యాత్మలు - ఇక్ష్వాకు రాజపుంగవుల యాత్మలు - చాళుక్య చోళసార్వభౌముల యాత్మలు చేతులు జోడించుకొని " మే మల్లారుముద్దుగ లాలించి పెంచుకొనుచు వచ్చిన యాంధ్రలక్ష్మిని హత్య చేయకుము " అని ప్రార్థించుచున్నవి. —

రూదా — తల్లీ! ఈయుదయమున నే ముహూర్తమున నీ ముఖారవిందమును సందర్శించితినో ఆముహూర్తముననే నాచేతినుండి అప్రయత్నముగ ఖడ్గము జారిపోయినది.

జయా — జారిపోయిన ఖడ్గమును మరల తీయవలదు - తీసినచో నాశిరచ్ఛేదమునకే తీయవలెను. —

రూదా — అబ్బబ్బ! అమంగళము ప్రతిహత మగునుగాక! —

జయా — తండ్రీ! నాయొక్క వెతకపేరు చెప్పగనే ఇంత కంటగించుకొనుచుండిన మీరు ఈయుద్ధభూమిని హతులయిన వేనకువేల వీరులభార్యలను కుమార్తెలను, తల్లులను గూర్చి యాలోచించితిరా? వారుమాత్రము మీబిడ్డలు కారా?

రూదా — అబ్బబ్బ! నాహృదయము నెందులకు తునుక తునుకలుగ ఖండింతువు?

(ప్రవేశము ప్రతీహారి.)

తీహా — దేవా! ఆంధ్రతమామండలేశ్వరునియొద్దనుండి యాంతరంగిక లేఖ.

(అని యొకజాబును చేతి కిచ్చును.)

రూదా — (చదువుకొని తనలో) ఎంత ఘోరము! సుల్తాను మామీదికి దండయాత్రకు వచ్చుచున్నాడా? అన్నారెడ్డి చెప్పినంతయు జరిగినది. (ప్రకాశముగ) అమ్మా! నీ ప్రార్థనకు దేవతలు ప్రసన్నులైరి. ప్రస్తుతము యుద్ధ మాపవలసినదని యాజ్ఞ వచ్చినది.—

విజయా — నాయనగారూ! నా చనవు కొంతవర కయిన చెల్లించితిరి. అదియే పది వేలు. నమస్కారము — పోయివచ్చెదను.

మాదా — అమ్మా! ఎక్కడికి పోయెదవు? అసలు ని న్నింతదనుక నడుగమరచితిని. ప్రచ్ఛన్నవేషమున నున్న నీకు లోనికి ప్రవేశ మెట్లు దొరకినది?

విజయా — చిన్నతనమునుండియు మీయొద్దఁ బెరిగినదానను. ఆమాత్రము మీ సంకేతములనే సంపాదింపలేకపోదునా? నా నిమిత్తము ప్రతిహారిని బాధింతురేమో. —

మాదా — బాధింతునా పూజింతును గాని. — వచ్చినదానవు మరల నెక్కడికో పోయెద ననుచున్నా వేమి?

విజయా — ఇంతవరకు నా సంకల్పము పూర్ణముగ ఫలింపలేదుగదా?

మాదా — నీ సంకల్ప మేమని?

విజయా — ఎన్నటికయిన రెడ్లను మీరును ఒక్క కంచమున గుడిచి ఒక్క మంచమున నిద్రపోవగ చూడవలెనని. —

మాదా — అది యసంభవము! అసంభవము!

విజయా — అది యసంభవమైనచో నేను మీయింట మరల నడుగుపెట్టుట యంతకంటెను నసంభవము.

ఉ. మంగళతూర్యఘోషముల మంజులనిస్వన మొప్ప మాగధీ
యాంగన లాంధ్రవీరులకు హారతు లెత్తినవేళ నెంతగా
పొంగితివో! యశఃకలశి బోరగిలంబడ నిప్పు డెంతగా
క్రుంగెదవో! జగజ్జనని! ఘూర్ణిలకమ్మ, మహాంధ్రరాష్ట్రిరూ!

(నిష్క్రమించును.)

మాదా — హా! నాజీవితప్రభ నిష్క్రమించుచున్నది. పరిస్థితు లెంత విషమించినవి? నిలుచున్నపాటున రావలసినదని యన్నగారి యాజ్ఞయా? అరచేతిలోని విజయ మైంద్రజాలికుని మంత్రప్రభావముచే నెగిరిపోయినట్లుగ మాయమైనదా? పట్టుదల యొక్కటే పెనుభూతమువలె పీడించుకొని తినుచున్నదా? విజయాంబ కట్టకడపట చదివిన పద్యము మాత్రము నాచెవులలో గింగురుమని మారుమ్రోగుచున్నది. —

ఉ. మంగళతూర్యఘోషముల మంజుల నిస్వన మొప్ప మాగధీ
యాంగన లాంధ్రవీరులకు హారతు లెత్తినవేళ నెంతగా
పొంగితివో! యశఃకలశి బోరగిలంబడ నిప్పు డెంతగా
క్రుంగెదవో! జగజ్జనని! ఘూర్ణిలకమ్మ, మహాంధ్రరాష్ట్రిరూ!

(తెరపడును.)

---

# స్వేచ్ఛావిహంగము

శ్రీ జల్లూరి శ్రీనివాసరావు

ఏను స్వేచ్ఛావిహంగమ నే మహీరు
హాగ్రశాఖికావితతులం దధివసించి
కాలమును బుత్తునో, మదిఁ గలఁచినైచు
దారుణవిషాదబంధముల్ తలఁగ నేఁడు.

పవనతరంగముల్ సోలసి
పాదపశాఖల నల్ల నూఁప, వై
భవమునఁ దేలిపోదు దివిఁ
బ్రాఁకెడు డోలికయందుఁ దూఁగుచున్
ప్రవిమలరాగగీతికలు
పల్కుదు నొక్కొకవేళ లోచనో
త్సవకరమైన యీప్రకృతి
తన్వి విలాసము గాంచి నివ్వెఱన్.

ఫలముల్ మెక్కుదునో, వనాంతరసర
స్స్వాదూదకంబుల్ మనం
బలరన్ గ్రోలుదునో, లతాంతతతి పూ
యన్ సొంపు బెంపార ని
ర్మలకుంజాంతరవీథులన్ దిరుగుచున్
మధ్యాహ్నముల్ ద్రోతునో
కలిగెన్ స్వైరవిహారభాగ్య మిఁక ను
గ్రాంతర్వ్యథల్ వాయఁగన్.

ఏను స్వేచ్ఛాశకుంతమ నే మహీరు
హాగ్రశాఖికావితతులం దధివసించి
కాలమును బుత్తునో — ఒక్కకల్పమైన
ప్రకృతిమాధుర్యతృష్ణ దీర్చుకొనుదాఁక!

---



భార్హూత్ చిత్రము

[Photos by kind courtesy of Dr. T. R. Chintamani garu



అమరావతీ చిత్రము

# అమరావతీ కళావిశిష్టత

శ్రీ పుట్టపర్తి శ్రీనివాసాచార్యులు

అమరావతీకళాసౌష్ఠవమునుగూర్చియు, ఆంధ్రశాతవాహన వైభవౌన్నత్యములను గూర్చియు విననివారు కళావేత్తలకు ఆంధ్రులలో అరుదు. ఆంధ్రులలో మాత్రమే ఏల? "హిందూ దేశంలోని ఏ ప్రాంతంలో చెవియొగ్గి విన్నా సరే—మనము అమరావతీకళాప్రశంస వినకుండా ఉండము". హిందూ దేశమును వదలి పాశ్చాత్యదేశములకు బోయి చూచినను అచ్చటి కళాభిజ్ఞులు అమరావతీశిల్పసంపదను ప్రశంసించుచునేయుందురు. వస్తుప్రదర్శనాగారములలో శ్రేష్ఠతమమైన బ్రిటిష్ మ్యూజియమునందు ప్రాముఖ్యస్థానము నొసగినది అమరావతీశిల్పమునకే. హైందవకళను సాధారణముగ నిరసనభావముతో జూచు పాశ్చాత్య కళావిమర్శకులలోగూడ చాలమంది అమరావతీప్రస్తావము వచ్చినపుడుమాత్రము తమ పక్షపాతబుద్ధిని వదలి ఈ యుత్తమ కళను అభినందించక మానరు. వేయేల, హైందవశిల్పసామ్రాజ్యమున నేమి, నానాదేశశిల్పప్రపంచమున నేమి, అమరావతి కొక ప్రత్యేకస్థాన మేర్పడినది; ప్రత్యేకగౌరవ, ప్రతిష్ఠలు నెలకొనినవి.

అమరావతీశిల్పము నిజముగ నింత ప్రశంసనీయమైనదేనా? ఇతర ప్రాచీన హైందవశిల్పములందు గానరానివిశేషము లింకేమి గలవు? ఈ శిల్పప్రాధాన్యము కేవలము అమరావతీశిల్పుల స్వశక్తిప్రభావములనుండియే ఏర్పడినదా? లేక అమరావతికి పూర్వముగాని, ఆ కాలమునందే ఇతర ప్రదేశములందుగాని వెలసిన శిల్పపద్ధతులనే అమరావతీశిల్పులు గైకొని యందేవో కొన్ని చిన్నమార్పులు చేసి, మెరుగుపెట్టి స్వశక్తికౌశలము లెంతమాత్రమును లేకయే కళాభిజ్ఞులహృదయముల నాకర్షింపగల్గిరా? ఈవిషయములను జాగ్రత్తగా పరిశోధించిన గాని మనకు అమరావతీశిల్పమునందలి యాధిక్యము బోధపడదు.

కాని మునుముందు అమరావతీశిల్పము ఏకాలమునాటిదో ఏ యే ప్రదేశములందలి శిల్పమును "అమరావతీరీతి" శిల్ప మందురో తెలిసికొనవలెను. అమరావతీశిల్పమునందలి విశేషములు ఒక అమరావతీస్తూపమునందు మాత్రమే కాక జగ్గయ్యపేట, నాగార్జునునికొండ, అల్లూరు, గుమ్మడిదుర్రు, ఘంటశాల, గోలి మున్నగుప్రదేశములందున్న శిల్పము అన్నిటియందును కొంచెముగనో గొప్పగనో గాన్పించుచున్నవి. అట్లని యీ శిల్పము లన్నియు నొక్కటేతీరున నున్నవని యర్థము గాదు. శిల్పకళకూడ క్రమపరిణామ వికాసములకు లోనైనదే. ఈ వివిధస్థలములందలి శిల్పము లన్నియు ఒకేకాలమున నిర్మించియుండినగాని ఇవి యొక్కటేతీరున నుండజాలవు. అమరావతీశిల్పమునందే, మొట్టమొదటికాలపు శిల్పములకును తరు

వాతికాలపు శిల్పములకును (ఒకటే వ్యక్తిత్వము విశదముగ గాన్పించుచున్నను) కాలక్రమమున పరిణామవికాసములవలన నేర్పడినభేదము లెన్నియో కాన్పించుచున్నవి. అయినను ఈశిల్పము లన్నిటిని జాగ్రత్తగ పరీక్షించినయెడల ఇతర హైందవశిల్పము లందు కానరాని కొన్ని ప్రత్యేకలక్షణములు వీనియందు గాన్పించుచున్నవి; కాన ఇవి యొక ప్రత్యేకమయినతెగకు జేరినవని నిశ్చయించి పురాతత్వకోవిదులు వీనికి "అమరావతీరీతి" శిల్పము లని పేరుపెట్టిరి.

ఈశిల్పము క్రీస్తుపూర్వము రెండవశతాబ్దమునుండి క్రీస్తుశకము మూడవశతాబ్దాంతమువరకును, అనగా సుమారు అయిదునందల సంవత్సరములకాలము విలసిల్లినది. ఇందులో కడుపురాతనమైనది జగ్గయ్యపేటయందలి శిల్పము. ఇది క్రీస్తుపూర్వము రెండవశతాబ్దమునాటిది. అమరావతీశిల్పములో గూడ కొంత ఈకాలమునాటిదే యని కొందరి యభిప్రాయము. భార్హూత్ స్తూపమునందలి శాసన, చిత్రరీతికిని, అమరావతియందలి కొన్ని శిలాఫలకములపైనమాత్రము కానవగు శాసన, చిత్రరీతికిని గల విశేషసామ్యముపై నీయభిప్రాయ మాధారపడియున్నది. క్రీస్తుపూర్వము మొదటిశతాబ్దమునాటిశిల్పము అమరావతియం దెంతయో కలదు. ఇప్పటినుండి అమరావతీశిల్ప మంతకంతకు అధికముగ అభివృద్ధి గాంచుచువచ్చినది. కాన ఈరీతిశిల్పముయొక్క క్రమపరిణామవికాసములను పరిశోధింపవలె ననినయెడల ఒక్క అమరావతీశిల్పమును మాత్రమే పరీక్షించినను జాలును. నాగార్జునునికొండశిల్పములు ఈరీతి యుత్తరదశయందు నిర్మితములైనవి. ఇంకను కొంతకాలమునకు పిదప అల్లూరునందును, గుమ్మడిదుఱ్ఱునందును శిల్పము వికసించినది. గోలీశిల్పములు ఈరీతి యంత్యదశనాటివి.

అమరావతికిపూర్వము ఈ ప్రాంతము లందు ఎట్టిశిల్పకళ యుండెను? ఆశిల్పకళకును, అమరావతీశిల్పకళకును ఎట్టిసంబంధము గలదు? అనువిషయముల నిపుడు కొంత సంగ్రహముగ చర్చింతము.

భారతీయకళాచరిత్రము ఆదిమనివాసుల శిలాసంస్కృతిపరిశీలనముతో ప్రారంభమగును. ఈసంస్కృతికి సంబంధించిన ముఖ్యసమస్యలను సంపూర్ణముగ పరిశోధించుటకు తగినన్ని యాధారము లింకను దొరకనందున మన మీ సందర్భమున నెట్టిసిద్ధాంతములను జేసినను వానియందలి సత్యాసత్యములు భావిపరిశోధనలవలనగాని వ్యక్తము గావు. అయినను మన కింతవరకును దొరకినయాధారములనే సమగ్రముగ పరీక్షించిన పురాతత్వశాస్త్రజ్ఞులు ఒక్క అమరావతీకళమాత్రమే కాక హైందవకళయంతయుగూడ చాలవరకు ప్రాచీనశిలాయుగపు లలితకళలపై నాధారపడియున్నదని వక్కాణించియున్నారు. సింధులోయనాగరికతను గూర్చిన పరిశోధనలనుండి ఈయభిప్రాయములు నానాటికి బలవత్తరము లగుచున్నవి. ఈనాగరికత సింధులోయయందుమాత్రమే కాక గంగా, యమునాతీరములందుగూడ గల దనియు, దీనికిని దక్షిణాపథమునందలి ప్రాచీనసంస్కృతికిని అధికసంబంధ మున్న దనియు తెలియుచున్నది. కాన హైందవకళల పుట్టుపూర్వోత్తరములను గూర్చి చర్చించునపుడు ఈ ద్వివిధసంస్కృతిని గమనింపక తప్పదు.

అనార్యసంస్కృతికితోడు, ప్రాచీనార్యసంస్కృతికూడ అమరావతీ శిల్పకళావిన్యాసమునకు అధికముగ తోడ్పడియుండును. "ప్రాచీనార్యులు బ్రహ్మజిజ్ఞాసాతత్పరులు; కాన లలితకళలకు వారెట్టిప్రోత్సాహమును ఒసగలేదు" అని కొందరు వాదించుచున్నారు. ఇది కొంతవరకు నిజమే. శిల్పములేమి, కుండపెంకులేమి, గోరీలేమి, కట్టడములేమి, అనార్యసంస్కృతిచిహ్నములు ప్రతిసంవత్సరమును ఎన్నెన్నియో దొరకుచుండ ప్రాచీనార్యులకు సంబంధించినవి మాత్రము అత్యల్పముగ దొరికినవి. ఇప్పటివరకును పురాతత్వవేత్తలు హిందూదేశమున ప్రాచీనార్యులకు సంబంధించిన శిథిలావశేషములను కనుగొనినది ఒక్క 'లౌరియానందనఘరు' నందు మాత్రమే. ప్రాచీనార్యులు ప్రప్రథమమున లలితకళలపై తమదృష్టిని ప్రసరింపచేయలేదు. కాని కాలక్రమమున వీరును అనార్యజనసంస్కృతికి చాలవరకు లోనై, తమ యభిప్రాయానుసరణముగ కళావిధానములను మార్చి శిల్పకళను ప్రోత్సహింపబూనిరి. నిర్మాణపద్ధతులను చాలవరకు అనార్యజనసంస్కృతినుండి గ్రహించినను తమ వ్యక్తిత్వమును మాత్రము కోల్పోక ప్రాచీనార్యులు తమ యుత్కృష్టభావములనే శిల్పరూపమున ప్రకటింప సమకట్టిరి.

అమరావతీకళా విన్యాసమున ప్రకటితమైనది ఆర్య, అనార్య సంస్కృతిమాత్రమే కాదు. హిందూదేశ చరిత్రమును చదివినచో ఒక్క ఋగ్వేదార్యులేకాక ఎన్నియో జాతులవారు అప్పుడప్పుడు మనదేశముపై దండెత్తి వచ్చుచుండిరని తెలియును. అట్లు దండెత్తి వచ్చినవారిలో చాలమంది ఇటనే నివాస మేర్పరచుకొని హిందూదేశీయులతో జేరిపోయి తమ పార్థక్యమును బోగొట్టుకొనిరి. కాని వారి యభిప్రాయములు మాత్రము సర్వనాశనము చెందక హైందవ విజ్ఞానాభివృద్ధికిని, మనోవికాసమునకును తోడ్పడెను. ఈ తెరగున హైందవకళాపరిణామమున ఎన్నియో అంశములు చేరిపోయినవి. ఎన్నియోజాతుల ప్రత్యేకవ్యక్తి భావములు సమ్మేళనము నొంది హైందవకళ యుద్భవించినది. పారసీక, యవన, కుషాణ, పహ్లవ, చీన, హూణాది నానాజాతుల సంస్కారసాంకర్యమువలన నొక ప్రత్యేక వ్యక్తిత్వము దాల్చిన దీహైందవకళ. అమరావతీశిల్పకళావిషయము గూడ నింతే. ఈ శిల్పపరిణామమున ఇన్నిరకముల భావములు చేరియుండక పోవచ్చును; ఇన్ని ప్రత్యేకాంశములు ఇందు సమ్మేళనమును జెందియుండక పోవచ్చును. కాని ఇదియు నానాసంస్కృతి సాంకర్యమున పరిణామము చెందినదే.

అమరావతీ శిల్పమునం దేయే విశేషములు అన్యసంస్కృతిజన్యములు? ఏవి స్వతంత్రము లిట ఉద్భవించి వృద్ధిచెందినవి? అనువిషయము నర్థము చేసికొనవలెనన్న ఈ శిల్పరీతి ఏర్పడుటకు పూర్వము హైందవ శిల్ప మెట్టిస్థితియం దుండెనో కొంత పరిశీలించవలెను.

సింధుతీరశిల్పాది అతిప్రాచీనశిల్పమును వదలివైచినచో ఇక మధ్యదేశమునందలి భార్హూత్, సాంచీలయందును, కళింగమునందలి ఉదయగిరి ఖండగిరి గుహాలయందును మాత్రమే అమరావతీశిల్పముకన్న పురాతనమైన శిల్పము కొంచె మెక్కువగా గాన్పించుచున్నది. మౌర్యులనాటి శిల్పము

కూడ ఇటీవల కొంత గన్పడినది. కాని మౌర్యశిల్పమున చాలభాగము యక్ష యక్షిణుల యాకారములను తిర్యగ్జంతువులయాకారములను ప్రదర్శించుటవలన, చూచుటకు సింధులోయశిల్పమే కాలానుగుణముగ మార్పు చెంది ఈరీతిగ పరిణమించిన దని యనిపించును. ఇందువలనను, ఇంకను ఇతరకారణములవలనను హైందవ శిల్పపరిణామమున మౌర్యశిల్పమున కియ్యదగిన ప్రాధాన్యమత్యల్ప మని పురాతత్వశాస్త్రజ్ఞులు నిర్ధరించి యున్నారు. కాని తెలుగుదేశము మౌర్యులపాలనమున చాలకాల ముండినను, అమరావతీ శిల్పము మౌర్యశిల్పమునుండి ఎట్టియంశములను గ్రహింపలే దనియు, మౌర్యశిల్పముపై అమరావతీశిల్ప మెంతమాత్రమును ఆధారపడలేదనియు జెప్పవచ్చును.

భార్హూత్, సాంచిస్తూపములలో కొన్ని భాగములు క్రీస్తుపూర్వము రెండవశతాబ్దమునకు జెందినవి. అమరావతియందు గూడ క్రీస్తుపూర్వము రెండవశతాబ్దమునకు జెందిన శిల్పములు కొన్ని కలవు; గాని భార్హూత్, సాంచీశిల్పములు అమరావతీశిల్పములకంటె అంత ప్రాచీనము లని చెప్ప సాధ్యముగాదు. నిజమునకు ఈప్రదేశము లన్నిటియందును శిల్పకళ ఇంచుమించుగ నొకేమారు ఆరంభము చెందిన దని తోచుచున్నది. కాని భార్హూత్, సాంచీశిల్పకళ అతిశీఘ్రకాలముననే పరిణామము చెంది క్రీస్తుపూర్వము మొదటిశతాబ్దిమధ్యమునకే యుచ్ఛస్థితిని బొంది త్వరలో నశించెను. బుద్ధగయయందలి శిల్పకళ విషయముగూడ నట్టిదే. అమరావతి శిల్పకళ త్వరగా అభివృద్ధి చెందినను ఇంత శీఘ్రముగ క్షీణదశకు రాలేదు. భార్హూత్, సాంచీశిల్పకళ యంతరించినపిదపగూడ అమరావతీశిల్ప మభివృద్ధి చెంది అంతికన్న ఉత్కృష్టపదవి నందెను.

భార్హూత్, సాంచి, బుద్ధగయశిల్పములను ఈసందర్భమున రెండుముఖ్యవిషయములందు పరీక్షింపవలెను: (౧) మొదటిది నిర్మాణపద్ధతి; (౨) రెండవది నిర్మితశిల్పమునందలి ప్రధానవిషయము. కాని ఏయంశమును పరీక్షించినను శిల్పియుద్దేశమాత్రము విశదము గాకపోదు ఈయుద్దేశము హైందవజనసామాన్యమునకు అనాదినుండి పారంపర్యముగ వచ్చుచున్న ఉద్దేశమే కాని క్రొత్తది గాదు. రూపరహితమై, పృథివ్యాద్యతీతమైన యాథార్థ్యమును పాంచభౌతికరూపమున ప్రత్యక్షీకృతము చేయుటయే ప్రాచీన హైందవశిల్పి యుద్దేశము. ఈయుద్దేశము నెరవేరుటకై నిర్మాణవిధానమునం దేమి, ప్రదర్శిత అభిప్రాయౌన్నత్యమం దేమి హైందవ శిల్పి కాలక్రమమున వివిధపద్ధతుల ననుసరించి నానాప్రయత్నములను సల్పెను. తదకీ యుద్దేశము నెరవేరెనా లేదా యని పరీక్షింపవలె ననిన భార్హూత్, సాంచి, అమరావతీ శిల్పరీతుల నతిక్రమించిపోయి మహాబలిపురము, పట్టదకల్లు, ఎల్లోరా, ఎలిఫెంటా మొదలగు ప్రదేశములందలి శిల్పములను పరీక్షింపవలెను. కాని ఈయుద్దేశము నెరవేరుటకు చేసిన ప్రయత్నములలో భార్హూత్ సాంచీశిల్పముల ప్రయత్నములు పునాదుల వంటివి.

ఈ శిల్పములం దధికప్రాముఖ్యమును వహించినట్లు గన్పడునది తామరతీగె. ఎన్ని విధములుగనో తామరతీగె ఈశిల్పములందు మాటిమాటికిని గాన్పించుచుండును. దీని

యాకారగుణములే ప్రధానములై ఇతరవస్తువుల స్వరూపగుణములప్రధానములై, సర్వమును దీనిపైననే యాధారపడి యుండినట్లు చిత్రించి శిల్పి చిత్రిత వస్తు స్వరూపములందు చాలమార్పులు గావించినాడు. ఈ శిల్పములందు వృక్షముల స్కంధములు గూడ తామరతీగెలవలె వంకరలు దేరి ప్రధానలయ ననుసరించుచున్నట్లు గనిపించుచున్నవి. మనుష్యులనో జంతువులనో చిత్రించునపుడుగూడ అంగవైఖరి తామరతీగె ననుకరించుచున్నందున, అంగములు తీగెలవలె ప్రాకుచున్నట్లు గన్పడును. ఈశిల్పుల యభిప్రాయమున జీవనసమృద్ధికి తామరతీగె యొక్క సమగ్ర ప్రతీకమువంటిది కావుననే ఈ శిల్పమున నెందు జూచినను తామరనాళము అటు నిటు వంకరటింకరగ తిరుగుచు, సర్వవ్యాపియై, పుష్పములను, జంతువులను, జనులను, యక్షాది గణములను నానావిధవస్తువులను ప్రభవింపజేయుచున్నది. ఇందు దొరకు సమృద్ధియు, ప్రశాంతసమగ్రతయు ఉన్నట్లు వ్యక్తమగుచున్నది. ఈశిల్పరీతి యభివృద్ధి చెందుచు వచ్చినకొలదిని ఈ ప్రశాంతభావ మధికమగుచువచ్చినట్లు గాన్పించుచున్నది ఆరంభదశ దాటి కొంతకాలము గడచినపిదప చిత్రింపబడిన శిల్పములందు తామరతీగె గంభీరముగ అనేకవృక్షజంతు నిబిడ దుర్గమారణ్యమున మదగజగమనముతో పర్యటనము సల్పుచున్నట్లు గన్పించుచున్నది. ఎటు చూచినను దీని ప్రభయే, దీని ప్రాధాన్యమే. దీని గాంభీర్య మందచలనము అఖండముగ సర్వత్ర వ్యాపించి ఒక ప్రత్యేకలయ ననుసరించి పరిస్పందనము చేయుచున్నట్లు కనుపట్టుచున్నది. చిత్రమునందలి సర్వాంశములును దీనిపై నాధారపడియున్నవి.

కాని కాల మింకను గడచినకొలదిని చిత్రములందలి మానవులసంఖ్యయు, జంతువుల సంఖ్యయు క్రమముగ నధిక మగుచు వచ్చినది. అయినను ఇప్పటికిని ఈ లతాప్రాధాన్యము గాని, దానిపైననే యాధారపడిన ఆవిచిత్రలయానుసరణముగాని తగ్గలేదు. ఇంకను కొంతకాలమునకు సాంచీ శిల్పములంగు ఇదియు మారి ఈయవిచ్ఛిన్నలయ తగ్గుచువచ్చినది. మానవాకారముల సంఖ్య యధిక మగుటయే కాక మానవ సమూహమున కొకప్రస్ఫుటతయు, ప్రాధాన్యమును ఏర్పడి శిల్పి అంతర్నిబిడ చిత్తవృత్తుల యుద్వేగత నొకింత వెలిబుచ్చుటకు బూనుకొనెను. మానవాకారమునకు క్రమముగ నొకపరిణామ మేర్పడుచు వచ్చెను.

సాంచీయందలి మొట్టమొదటి శిల్పములను జూచిన అందు మానవాకారములు తామరతీగెతోనే కలసిపోయి తమవ్యక్తిత్వమును పోగొట్టుకొన్నట్లు గన్పడుచున్నవి. తామరతూండ్లవలె హృదయాకర్షముగ నానావిధముల వ్యాపించుగీతల నల్లారుముద్దుగ గీచినట్లు నిర్మింపగల శిల్పి తన మనోభావములను ఘనపరిమాణమున కన్వయించునట్లు సరిచేసికొనలేక మానవసుందరాంగములను బంకమట్టితో తీర్చిదిద్దినట్లు చిత్రింపలేకపోయినాడు. రేఖావిన్యాసమున గల సౌందర్యమును చవి చూచిన శిల్పి సమతలము నతిక్రమించిపోయి ఘనపరిమాణమునకు వ్యాపించు ద్రవ్యరాశిస్వరూపమునందలి సౌందర్యమును స్పష్టముగ అవగాహన చేసికొని చిత్రింపలేకపోయినాడు. కావుననే లతానికుంజములను,

తామరతూండ్లను మనోహరముగ తీర్చగల నేర్పరి మానవాకారమును సర్వాంగసుందరముగ చిత్రింపలేకపోయినాడు. కడకు సౌందర్యోత్పత్తిజనకరచనలందు మానవదేహమున కట్టియ మూల్యప్రయోజన మున్నదో గూడ విశదముగ నర్థము చేసికొనలేకపోయినాడు.

కొంతకాలమునకు శిల్పకౌశల మధికమై మానవాకారమున కొక నియతప్రయోజన మేర్పడినది. కాని శిల్పి తన విచిత్రతామర నాళమును మానవులే మోసికొనిపోవుచున్నట్లు నిర్మించినను, వా రందరను ఒకటే కార్యమునకై ఒక ప్రత్యేక సమూహముగ నేర్పడినట్లును, వారిచర్యలకు పరస్పర సంబంధ మున్నట్లును ఎంతమాత్రమును జూపలేదు. ఎవరిపాటికి వారేగాని, సమష్టితత్వమును శిల్పి సరిగ నర్థముచేసికొనిన ట్లగపడదు. అయినను మానవాకారమునందలి ప్రాముఖ్యమును ఒకమారు గమనించినపిదప శిల్పి తనచిత్రములందు మానవులసంఖ్యను క్రమక్రమముగ నధికముచేయుచు కొంతకాలమునకు తనచిత్రములం దున్నలోపములనుగూడ గ్రహించి వీరందరికిని ఒక పరస్పరసంబంధ మున్నట్లు చూపనేర్చెను. ఈ యంశము క్రీస్తుపూర్వము ప్రథమశతాబ్దము నాటి బుద్ధగయాశిల్పములందే కాన్పించుచున్నను, ఆ శతాబ్దమధ్యమమున నిర్మితములైన సాంచీస్తూపద్వారములందు అంతకన్న విశదముగ గాంచనగును. మానవావయవముల నొక్కొక్కదానిని జాగ్రత్తగ తీర్చిదిద్ది, ఇవి మృదుకోమలగాత్రములని నొక్కిచెప్పుట బుద్ధగయాశిల్పములందే ప్రథమమున గాంచనగును. సాంచీస్తూపద్వారములందు చిత్రించియున్న శిల్పములందు మానవాకారములను, నానావైఖరులందు చిత్రించియున్నారు.

మానవరూపరేఖలయందుగూడ సాంచీరీతియంత్యదశనాటికి క్రమముగ కొంత మార్పు గలిగినది. ఇంతవరకును ఇరుకైన కంఠములు, భారమైనశిరములు చిత్రించుచుండిరి. ఇప్పు డందుకుబదులు కండలు మెలిదేరి కాయకష్టమున కలవాటుపడినవారినే శిల్పి యాదర్శముగ గ్రహించి బంకమట్టితో తీర్చి దిద్దినట్లు సర్వావయవములను సౌష్ఠవముగ చిత్రించెను. ఇప్పటినుండి మానవాకారములు ప్రాణములేని బొమ్మలవలెగాక శక్తియుతములగు జీవరాసులవలె గన్పడుచున్నవి.

కాని ఇంకను మానవాకారమునకు ఉత్కృష్టప్రాధాన్యము రాలేదు. చిత్రితములైన మానవాకారము లన్నియు సామాన్యజనులవే కాని ఆదర్శప్రాయపురుషులవి కావు. బుద్ధునిగాని, బోధిసత్వులనుగాని చిత్రింప ప్రారంభించిననాటినుండియే శిల్పి మానవాకారమునందలి యాధిక్యమును గుర్తెరుగ నారంభించెను. మానవుడు కేవలము క్షుత్పిపాసాదులకు లోనైన క్షుద్రజంతువుగాక శమదమాద్యనేక అంతశ్శక్తులు గలవాడని గుర్తెరిగి శిల్పి తన శిల్పమున ఈ యంతశ్శక్తులను వ్యక్తముచేయవలయునని ప్రయత్నించినది నాటినుండియే.

కాని చాలకాలమువరకును శిల్పి ఇట్టి ఉన్నతాదర్శములను ప్రతిఫలింపజేయు శిల్పమును నిర్మించుటకు బూనుకొనలేదు. బుద్ధరూపచిత్రీకరణమునెడ శిల్పికున్న పరాఙ్ముఖతయే ఇందులకు కారణము. ఈపరాఙ్ముఖత

యేల కల్గెనో, బుద్ధజీవితాంశములను జాతక కథలను చిత్రించునపుడు బుద్ధ బోధిసత్త్వుల రూపములను చిత్రించుటకుబదులు చిహ్నములను చిత్రించి సంకేతపద్ధతిని ఆయాకారముల నిర్దేశించుట కేమి మహాత్కారణము లుండెనో మన మిట చర్చింప నవసరము లేదు. ఏ కారణమైన నేమి? మానవాకారమును చిత్రింపగల్గినను శిల్పి ఇట్టిసందర్భము లందు మాత్రము సంకేతపద్ధతినే యవలంబించుచుండెను.

నిర్మాణపద్ధతియందు గూడ భార్హూత్, సాంచీశిల్పములందు గానవగు విశేషముల నిదివరకే చూచితిమి. శిల్పి ఇప్పటికి రాతిని మైనమువలె తీర్చి దిద్ది ఆకారము నేర్పరుప నేర్చినాడు. ఈశిల్పములను జాగ్రత్తగ పరీక్షించినయెడల చిత్రవస్తుస్వరూపమున నొక అనిర్వచనీయమైన ద్రవత (fluidity) యున్నట్లు గాన్పించుచున్నది. కాని రేఖావిన్యాసమున గాన్పించులయ కింకను శిల్పి బద్ధుడై యున్నాడు. చిత్రలేఖనమునకును, శిల్పనిర్మాణమునకును ఉన్న ప్రత్యేకధర్మముల నింకను శిల్పి విశదముగ అవగాహనచేసికొని తన శిల్పకౌశలమును పెంపొందించుకొన లేదు. ఈదశ యాఖరునాటికి మానవావయవములు గతియుతములుగ నున్నట్లు చిత్రింపనేర్చినను శిల్పప్రాధాన్యమైన దిద్దుబాటు శిల్పి ఇంకను సమగ్రముగ సాధించలేదు.

అమరావతీశిల్పపద్ధతి పరిపక్వము చెందుచుండినకాలముననే మథురయందలి శిల్పమొక ఉచ్చస్థితి నొందెను. ఈశిల్పమును గూడ నొక ప్రత్యేకరీతిశిల్పముగ పరిగణింపవచ్చును. మథురయం దొకచోటనే గాక పశ్చిమ హిందూస్థానమున భాజాయందును, ఒరిస్సాయందలి రాణీగుంఫా, గణేశగుంఫా గుహాలయములందును, ఇతరచోట్లను గూడ శిల్పము క్రమాభివృద్ధి నొందుచునే యుండెను. మరొకవైపు గాంధారశిల్పము ఒక నూతనపద్ధతిని ప్రాముఖ్యమునకు దెచ్చుచుండెను. కాని వీని యన్నిటికన్నను అమరావతీరీతికి జెందిన శిల్పములే శ్రేష్ఠములని నిస్సందేహముగ జెప్పవచ్చును.

అమరావతీశిల్పమునందు ముఖ్యముగా గానవచ్చు విషయము మానవత్వమున కొసగిన ప్రాధాన్యమే; అనగా అమరావతీ శిల్పులు ప్రకృతిని చిత్రించుట మానుకొనిరని యర్థము గాదు. కాని ఇప్పుడు ప్రకృతికిని మానవునికిని ఒకే స్థానము నిచ్చుటకు బదులు మానవునికి ప్రకృతి యొక ఉపాంగముగ నుండునట్లు చిత్రించినారు. శిలలు, చెట్లు, నీళ్లు మునుపటివలెనే ఇప్పుడును చిత్రితములగుచుండెను గాని పూర్వమువలెగాక అవి ఇప్పుడొక ప్రత్యేకస్థలమునో, సందర్భమునో చూపుటకే చిత్రింపబడెను; లేదా సాంకేతికముగ నేదేని ఒక యంశమును దెలుపుటకు చిత్రింపబడెను. వృక్షచిత్రీకరణమున పూర్వమున్న శ్రద్ధ ఇపుడు నశించి చూచుటకవి ప్రధానవస్తువునకు ఉపకరణప్రాయముగ నేర్పడినవి. ఎటు చూచినను మానవవ్యక్తులే — కూర్చొనియున్న వ్యక్తులు, నిల్చున్నవ్యక్తులు, నృత్యము చేయుచున్న వ్యక్తులు, సంతోషమున గంతులువేయుచు ఎగురుచున్న వ్యక్తులు — ఎన్నివిధముల మానవాకారమును చిత్రింపవచ్చునో అన్నివిధములను ఇచ్చట చిత్రింపబడినవి. ఏ పార్శ్వదృశ్యమునైనను, ఎట్టిచేష్టలు చేయుచున్నట్లు

చూపవలసినను అమరావతీశిల్పి యవలీలగ చిత్రింపగలడు.

గీతలసొబగునకును, రేఖావిన్యాస నిశ్చితలయకును ముగ్ధుడై, తన చిత్రీకరణము సమతలవిస్తీర్ణమునగాక ఘనపరిమాణముగల రాతియందు అనువిషయమునుగూడ మరచిన శిల్పి ఇదివరకే తనలోపమును గుర్తెరిగి తన్నివారణోపాయమును వెదకుచుండినను ఇప్పటికిగాని కార్యసిద్ధి గాంచలేదు. సమతలముపై గీతలు గీచిన జాలును, చిత్రము తయారగును అనువిషయమును ఇప్పటికి బొత్తిగ మరచి మైనమునో బంకమట్టినో సాగదీసి, తన కిష్టము వచ్చినట్లు తీర్చి దిద్దినట్లుగ శిల్పి భావింపజొచ్చెను. కావుననే ఈ శిల్పమునందలి అవయవములకు జీవసాదృశ్య మధికముగ నున్నది.

సాధారణముగ అమరావతియందు గాన్పించు మానవరూపము నవయౌవనాకారము. అవయవసౌష్ఠవమును బాగుగ నాటి చెప్పుటకుగాబోలు శిల్పి అచ్చటచ్చట పొట్టలుబలిసిన కుబ్జులనుగూడ చిత్రించినాడు. ఈ "దృష్టినిగ్రహము"ల ఎదుట తాను చిత్రించిన వ్యక్తులసౌందర్యము సువ్యక్తమై ఎట్టివారికిని అచ్చెరువు గొల్పును.

అంగములను ప్రకృతిసమముగ తీర్చి దిద్దుటయేగాక అంగవైఖరులందు జీవలక్షణమగు "గతి" యున్నట్లు శిల్పి చిత్రింపగల్గెను. తనవిద్యయం దధికపాండిత్యమును, కౌశలమును సంపాదించెనుగాననే నాటిశిల్పి అంగవైఖరులందు వివిధచలనమును జూపగల్గెను. ఈశిల్పములందు మానవస్వరూపము నిర్జీవమైన కొయ్యబొమ్మవలె బిర్రబిగిసి నిల్చుండక శిలామయమైనను సజీవమువలె సుందరముగ వంపులు దిరిగి గాన్పించుచున్నది. మెడ నేవైపు త్రిప్పవలెను? తల నెంతమట్టుకు వంపవలెను? మొదలగు సంశయములను ఈ నాటిశిల్పి అతిజాగ్రత్తగ గమనించి చిత్రించెను. మానవస్వరూపమును త్రిభంగముగ దీర్చిన చాల అందముగ నుండునని కనిపెట్టినది అమరావతీశిల్పియే. ఈ యంశమే శతాబ్దముల యనంతరము దక్షిణదేశమునందలి స్థపతులు విశదముగ గుర్తించి, జగదుత్తమములైన నటరాజవిగ్రహములను త్రిభంగముగ నుండునట్లు నిర్మించిరి.

విషయరచన (Composition) యందు గూడ అమరావతీశిల్పి అధికకౌశలమును గనబఱచెను. మానవవ్యక్తులను, ప్రకృతిపరిసరములను హృద్యముగ చిత్రింపనేర్చినను వీని నన్నిటిని చేర్చి యొక కథాంశముగనో, ఒక అభిప్రాయవిశేషముగనో వ్యక్తపరుప నెంచిన యెడల శిల్పికి రచనాకౌశల మున్నగాని శిల్పము రక్తికట్టదు. ఎంత సుందరములైన యాకారములనైనను బారులుతీర్చినట్లు రచన లేక చిత్రించినచో మనోరంజకముగ నుండుటకుబదులు రసాభాసముగ నుండును. అమరావతీశిల్పములందు రచనాకౌశలముగూడ నొక అపూర్వపరిపూర్ణత నొందినది. ఈ శిల్పమున నేదేని ఒకచిత్రమును గైకొని అందలి మానవసమూహమును పరీక్షించినచో, ఆ సమూహమున కంతటికిని నొక ప్రత్యేకవ్యక్తిత్వ మున్నట్లు గోచరించును. అందొక ప్రధానవ్యక్తియైననో, ప్రధానవస్తువైననో ఇతరాంశము లన్నియు నొక నిర్ణీతసంబంధమున నాధారపడియుండుటవలన ఏ యంశ

మును దీసివైచినను చిత్రమునకు లోపము వాటిల్లినట్లు గాన్పించును.

ప్రకృతి, మానవుల పరస్పరసంబంధమునుగూడ స్పష్టముగ నిశ్చయించి నిర్ధరించినది అమరావతీశిల్పియే యని ఇదివరకే చూచితిమి. మానవాకారమునకు శిల్పి నాడొసంగిన ప్రాముఖ్యమే కాలక్రమమున విగ్రహనిర్మాణమునకు మార్గదర్శక మాయెనని గూడ అమరావతీశిల్పములను జాగ్రత్తగ పరీక్షించినచో బోధపడును. ప్రకృతి, పురుషులయైక్యతను అంగీకరించి శిల్పి ప్రకృతిని పురుషునియందే లీనముచేయ యత్నించినాడేమోయని కొన్ని కొన్ని శిల్పములు తలంపజేయును. బీజరూపముననున్న ఈ యభిప్రాయమే ఉత్తరకాలమున పరిపక్వము చెంది మానవాతీతరూపనిర్మాణమునకు పురికొల్పెననుటకు సందియములేదు.

కాని ఇంకను మానవరూపమున ముఖమునుమాత్రము సర్వోత్కృష్టముగ చిత్రింప సాధ్యము గాలేదు. అంతఃస్తంభితములైన మానవాభిప్రాయములను, శమదమాదిగుణవిశేషములను, సంయమజనిత అఖండశక్తిని వ్యక్తముచేయగల ముఖబింబముల చిత్రింపనింకను ఈ శిల్పిశేఖరులకు సాధ్యము కాలేదు. ఈ శిల్పములందలి ముఖములు వికసితకమలములే! నిజముగ నివి యంత హృద్యములుగ నున్నవి. కాని జ్ఞానజ్యోతి వీనియందు వెలుగుటలేదు. మోక్షప్రాప్తి వీనినుండి వ్యక్తమగుట లేదు. ఈ వ్యక్తులు సంసారవిమోచనము నొందినట్లు ప్రతిమాముఖములనుండి గాన్పించదు. చిత్తక్షోభలు, ఉద్వేగవిశ్రాంతులు మున్నగు క్లిష్టపరిస్థితులనుగూడ సులభముగ చిత్రింపగల్గినను ఇట్టి పరమోత్తమవికాసమును స్ఫురింపజేయుట కింకను శిల్పికి సాధ్యము గాలేదు.



# యాచన

శ్రీ రుక్మిణీనాథశాస్త్రి

౧

"ఒరేయ్ —"

ఉలిక్కిపడి చూచాను. ఎవరా? అని. సూరి!! ఇతఃపూర్వం మాకున్న పరిచయం లవ లేశమైనా, యిల్లా పిలుస్తున్నాడు మరి.

"క్యా భాయ్, పిలిచినా పలకవ్?"

పరిచయమందహాసం చెయ్యాలని చూస్తున్నాను. దీం దుంపతెగా— ఊహూఁ - మూరాం పడుతోంది.

"ఏం? అల్లా గమ్మత్తుచూపులు చూస్తావ్?"

"ఏమీ లేదండి!"

"ఇదుగో - భాయ్ - అండీగిండీ జాంతే నై. మనం భాయీ అంటే- భాయీ-, లౌకిక మర్యాదలు, కుక్క క్రియాలు వొద్దు. హృదయాలు విప్పి మాట్లాడుకుందాం."

నాకు వికారంతో కూడిన నవ్వు వొచ్చింది. ఆపుకున్నాను. యిల్లా నేను వెనక, చవకగా హృదయం విప్పి, విప్పమనీ అన్నప్పుడల్లా ఎందరు నవ్వుకున్నారో?

"ఏం అల్లా ఆలోచిస్తున్నావు? నవ్వుకుంటూన్నారు? తమాషాగా ఫీలు అవుతున్నారా?"

"కాదండి. మీరు ఇంత అమాయికులే. యిల్లా అయితే లోకంలో ఎల్లా నెగ్గుకొస్తారా- అని ఆలోచిస్తున్నాను."

నమ్మినట్లు కనబడుతోంది. కానీ - నా నుదురు దొంగను పట్టి యివ్వకుంటుందా?

"అదుగో మళ్లీ నన్ను మీరు అంటున్నావు? ఏకవచనం. మనది రామప్పంతులకి (కన్యాశుల్కంలో) ఎదురు మతం." నవ్వుతున్నాడు.

"క్షమించాలి. అయినా నా అలవాటును యిక్కడే మార్చుకోయత్నిస్తాను." ఆర్మీనియన్ స్ట్రీటు దాటాలిగనక వొళ్లు దగ్గర పెట్టుకుని, మాటలు మాని బైటపడ్డాం.

"ఎప్పుడు వొచ్చావ్ యిక్కడికి?"

"యిక్కడే ఉంటున్నానండి."

"ఎక్కడా ఉద్యోగం?"

"లేదండి ఊరికేనే వచ్చాను." (అబద్ధం. నేనూ పొట్ట చేత పుచ్చుకునే వొచ్చాను).

నెమ్మదిగా వైయం. సి. ఏ. దాకా వచ్చాము. నాకు నో రూరుతోంది. రామకృష్ణ లంచ్ హోం నీరవాహ్వానాలతో రమ్మని బతిమాలుతోంది.

"రాండి, కొంచం కాఫీ తాగుదాం."

"నా దగ్గిర డబ్బుల్లేవు. ఐనా మీరు పొండి, నే నిక్కడ ఉండగలను."

చివుక్కుమంది ప్రాణం.

"రాండి నా దగ్గిర ఉన్నయిలెండి."

కెంద్రణా అంటూ అరిచే బైరీలకేసి చూస్తున్నాడు. వీపు తట్టి, రామకృష్ణలోకి లాక్కెళ్లాను. అద్దరిచ్చి బాతాఖానీలో పడ్డాం. — పళ్లాల చప్పుడులోనూ, మా లాంటివాళ్ల బాతాఖానీమహాభాష్యపు రొదలో కళకళలాడుతూన్న వెయ్యి సంతర్పణల గలభాలో — అక్కడక్కడ వినబడుతోంది. వో: తన దుర్దశను వెళ్లబోస్తున్నాడు. పాపం.

బైట కొచ్చి కిల్లీ యిచ్చి సిగరెట్ ఆఫర్ చేశాను.

"వొద్దు భాయ్ — మనం అవతారాలు, (సిగరెట్టు, బీడీ,) దాటి విరాట్ స్వరూపం (చుట్ట, పొడుం, మసాలా) దగ్గరకే వెళ్లాం."

నవ్వు వొచ్చింది. కాశిని చుట్టలు కొనిపెట్టి, నేను దేవతలు కటాక్షించి యిచ్చినవరం, సిగరెట్టు తొలిగ్రుక్కలు పీలుస్తున్నాను.

"భాయీ! నా పద్యాలు కాశీ వినాలి!"

వాడు పనేమీ లేదు ముందుకొచ్చేది. సరే అన్నాను. అటు హైకోర్టుపక్కలకు తీసుకెళ్లి కూర్చో పెట్టి చదివాను. అన్నింటిలోనూ, ఏదో వో చమత్కారం వుందిగాని, 'వేశ్య'మీద రాశిన 'కావ్యం' చాలా బాగుంటుంది.

చాలా కొంచెం జరిగాక చివరకు వేశ్య అంటుందీ: 'నా జీవితం అంతా గాలించాను; ఎక్కడా సుఖం దొరకలేదు. మళ్లీ మొదటికొచ్చి చూస్తే — అంతా అయోమయంగా, భయం భయంగా వుంటోంది, కొత్త కొత్తగా వుంటోంది' అని. పక్కనున్న వేదాంతి అంటాడూ... 'అల్లా అంటావేం? నీవు ఎంత ప్రేమను ఎరుగున్నావ్? ఎంత స్వేచ్ఛాజీవివి! ఎంత ఆశాజీవివి?' అని. వేశ్య అంటుందీ-? 'ప్రేమా— సింగినాదం జీలకర్రాను; తోటి మనుష్యులా? జలగలు! తెలీకుండా నెత్తురు పీలుస్తారు; స్వేచ్ఛా— ? అఘ ప్రమాణాలు తలలో తురుముకోడం; ఆశా?— కన్నీటి బొట్టుపైని సూర్యకిరణం తెప్పించే ఇంద్రధనువు!! ఎందుకు లెండి ఇప్పుడు వాటి స్మరణ- మీ పనేదో మీరు చూచుకోండి!!' అని.

వేదాంతి అంటాడూ భరతవాక్యంగా...'ఒసే- చూడు, పిల్లి (తానే) —పాలమకొని, వెన్నెల కింద బసితే— ఆగచ్చే నాకుతోంది చూడూ' అని.

"సూరిగారూ! ఇంత గొప్ప కవుల్ని ఆదరించని దేశం, ఏఒక్క ఆర్టిస్టునూ పోషించని దేశం ... తగుదునమ్మా అంటూ ఎలా 'ప్రావిన్స్, స్వతంత్ర్యం కావాలి' అంటూ తగూకొస్తుందీ"? అన్నాను.

పాపం. ఆయన్ను ఏదో కెలుకుతూన్నా నల్లే వుంది. గాద్గదికంతో- 'భాయీ! నిజం చెప్తున్నాను. నాపద్యాలు విని, నాముఖం చూసి, ఎద్దేవా చేసిన వాళ్లని నే ఎరుగుదునుకానీ - యిల్లా చక్కగా తెలిసి మెచ్చుకున్నవాడిని చూణ్ణేలేదు భాయీ' అంటూ చాలా ఖేదపడ్డాడు సూరి. — నావళ్లు మండిపోతోంది. మేకీ పిక్ ఫోర్డు వస్తే— లండన్ లండనంతా పొరగబడ్డారుట. ఏ రాజాధిరాజుకూ జరగనంత అఖండ గౌరవం చేశారుట ఆమెను. ఇదా-? ఏ వొక్క శిల్పినీ పోషించని దేశం. వెధవదే—. పళ్లు పటపట కొరుకుతూన్నాను-నేనే మహాకవినై జీవితం అంతా ద్వేషింపబడినట్లు.

ఎవరో- ఆదారిన పోతూంటే-వారిని పేరెట్టి పిలిచాడు. సరే అని లేచాను వెళ్దామంటూ.— నాకేసి చూస్తూ—"నీ అడ్రసు?"

"౧౮ సుంక్ వార్ స్ట్రీట్-ట్రిప్లికేన్."

"అచ్ఛా- రేపు కలుస్తాను." అని ఆ కొత్తాయనతో పడి పోతున్నాడు. మళ్లీ వెనక్కొచ్చి— బ్రాడ్వే దగ్గర బస్ స్టాప్ ఆశ్రమభూమిదగ్గర్నుంచున్నాను బస్ కోసం. చలపతిరావు కనిపించాడు. పిచ్చాపాటీ— చెప్తున్నాం. సూరి మాట వొచ్చింది. చలపతిరావు— 'ఇవాళ మీకు అంటుకున్నాడేం — అంబాశీపేట ఆముదం. భలే జిడ్డు. ఎంత వొదలిందీ?' అన్నాడు.

చురుగ్గా చూశాను. వెటకారంగా నవ్వాను. ఏడ్చావులే— నీకేం తెలుసు? అతని గొప్పఅన్నట్లు.

చలపతిరావు అసాధ్యుడు. "అల్లా చూడకండీ- యీ అభిమానం— నాలుగురోజులు పోతే— వుండదు లెండి..."

ప్రసంగం తప్పించాను. ఆ సంగతీ యీ సంగతీ మాట్లాడి 'రాండ్టానా' దగ్గర దిగిపోయాడు— చలపతిరావు.

## ౨

అరిచేతుల్లో ప్రాణాలు పెట్టుకొని— వైట్ వేసంచి...బసాటోకేసి— రోడ్— క్రాస్ చేస్తున్నాను. ఎదురుపండా సూరి...

"ఫర్వాలేదు. రా"

ఎల్లాగో అల్లా గుప్పెట్లో ప్రాణాలు పెట్టుకుని వొచ్చాను. నేను అల్లా కెలిస్ రోడ్డు బస్ ఎక్కి— ఎగ్మోరులో దిగి- అక్కణ్ణుంచీ - మాంబళం పోవాలి.

'ఐతే—నేనూ కొంతదూరం వొస్తాను' అన్నాడు సూరి.

'సరే'

"భాయీ — నిన్నటి పద్యాలు ఎలా ఉన్నై?"

కన్నుబొమ్మలు పైకెత్తాను. నుదురు ముడతలు పడ్డవి. కనురెప్పలు కళ్లను మూసి నోటితో చెప్పాలా-- వేరే --- అని అంటున్నాయి. కొద్దిగా తల ఎగరవేశాను.

"భాయీ! 'వేశ్య'పద్యం యిస్తే—'అమాత్య' రిటర్న్ చేశింది."

"అమాత్య?"

"అవును, అమాత్య!! ఏకో నాలుగు రాళ్లిచ్చే పత్రిగదా అని పంపితే........"

"ప్చ్!"

అప్రయత్నంగా భారత్ కెఫేలోకి పోయాం. జేబు దులుపుకొని బైటపడి కలిప్ రోడ్డు బస్ ఎక్కాం. టిక్కట్టువాడు వొస్తే — నేను 'ఓవరు బ్రిడ్జి' అన్నాను. సూరి డిటో అన్నాడు. అణాన్నరా తీసి రెండు టిక్కట్లూ నేనే కొన్నాను. ఆ మాటా — యీ మాటా మాట్లాడుతున్నాడు. స్టేజి, స్క్రీన్, స్టూడియో — ఈ త్రికూటంతోనే పరిపాలిస్తున్నాడు: కొంతదూరం దాటాక — నేను — మాంబళం...... నౌకరీ — ఈ విషయమే......... తెగ ఆలోచిస్తున్నాను.

"భాయీ — పిల్లలెంత మంది నీకు"?

"ఇద్దరు"

"పేర్లు?"

"అమ్మ—నాన్న."

"నేనే ఐతేనా — సోదరి: జాహ్నవి... అని పెట్టేవాణ్ణి"

ఎవడడిగాడు?

"క్షాత్మేళ్ళ ఊరుకోండి!"

వొచ్చుకున్నాడు. ఎగ్మోరు స్టేషన్ దాటి క్షణంలో — మా బస్—ఓవర్ బ్రిడ్జి బస్ స్టాప్ ఆశ్రమం దగ్గర కొచ్చింది. దిగాం.

"భాయీ! వొక్క విన్నపం"

"ఊఁ!"

"ఈరాత్రికి అన్నం లేదు మరి. రెండు గారెలు యిప్పించాలి నివ్వు."

నాకు వేళ ఔతోంది. మాంబళం పోయి, మాట్లాడి, (ఏముందీ. ఉద్యోగం దేబిరించే) మళ్లీ రావాలి. —

"హోటలెక్కడ??"

"యిక్కడే— పంకజలంచి — ఎగ్మూరు హైరోడ్డుమీద."

"పదండి."

"వెళ్లి ఆయ్న పని పూర్తి చేస్తూ ఉండగా విశ్వేశ్వరావు వొచ్చాడు. అతని బలవంతాన మళ్లీ తలో అరకప్ కాఫీ — గ్రోలి — దగ్గిర దగ్గిర — పావలా ధరించి, బైటపడ్డాం.

'థాంక్స్ బ్రదర్' సూరి.

"నో మెన్షన్."

యింతలో నీలిరంగు బస్సు రావడమూ... అదరా బాదా బస్ స్టాప్ దగ్గరకు చేరుకోవడం. ...జరిగింది. విశ్వేశ్వరరావు మాంబళం వొస్తున్నాడు: సూరి మమ్మల్నిద్దర్నీ ఎక్కించి తాను ఎటో పోయాడు.

విశ్వం— 'ఏమండీ ఎక్కడ దొరికాడు? పాపం ఈయన!'

"ఏముటోనండి—పాపం—అల్పసంతోషి".

"అంతేకానీండి—భరించలేమండి, అబ్బ!!"

"ఏం?"

"వేధిస్తాడు!!"

"ఊఁ !"

ఊఁ అన్నానేగానీ — నాకూ అల్లాగే ఉంది అప్పుడే.

3

నేను ఎంత ఆశపడి మద్రాసు వొచ్చానో— అంతగా లాభించలేదు. వొకటి రెండు చోట్ల లాభిస్తుందేమో అని ఆశగా వుంది. Try చేస్తున్నాను. కానీ— ఏమిటో — యిప్పటి నా స్తితి అంతా తెగ తిప్పటగా ఉంది. ట్రాంవాళ్ళకూ బస్సులవాళ్ళకూ— కుమ్మరిస్తున్నాను: సాయంత్రం ఔతోంది. రూముకు పోయి వొకరితో మాట్లాడి— యింటికి చేరుకో బయలుదేరాను. చీకట్లు మీదపడి— దబాయించ బోతున్నై. రామకృష్ణలో ఆ దీపాలు ఎంత నావంటివాణ్ణైనా నవమన్మథుణ్ణిగా చేస్తున్నై. చిక్కని కాంతిలో దీపాలమీది మోజుకోసం వెళ్లి—నోటికి పని చెప్పి— మళ్లీ భోజనం లేనికని—అక్కడే విరుచుకు తింటున్నాను.

"హల్లో."

—సూరి.

కూర్చోండి అన్నానేగానీ — చలపతిరావు అన్నట్లు-జిడ్డు—వొదుల్తుందేమో అని—కొంచం...

సర్వర్ Whit Sir అని అడిగాడు సూరిని— ఏం ఆర్డర్ యిస్తాడో అని — చూస్తున్నాను, ఓర కంటితో.

పెదిమ విరిచి అడ్డంగా, తల ఊయించాడు, ఏమీ అక్కర్లే దన్నట్లు.

సర్వరు—నన్ను 'యింకా' అన్నాడు.

'కాఫీ'—అని సూరికేసి—'మీరు?' అన్నాను.

'నా కేం వొద్దు. కానీ—బిల్ లో— యిద్దరికి అని వేయించు. మరేం లేదు. శేషయ్య వొచ్చాడేమో అని అనుమానంతో లోనికి వొచ్చాను. అతను లేడు. ఊరికే—వెళ్తే—తిని ఎగేస్తున్నట్లు వాళ్లు అనుమానపడి తల కొట్టినంతపని చేస్తారు. పోనీ— అంటే— నాకు కోరికా లేదు, జేబులో దుగ్గాణీ—లేదు' అని వొక్కదమ్ములో ఊదేశాడు సూరి.

—ఎంత చెడ్డా-కవి! ఎంత రమ్యంగా చెప్పాడు!!

సర్వర్ కాఫీ తెస్తున్నాడు. కాఫీ అయినా యిప్పిద్దాం అనుకున్నాను. కానీ—నాకు వాక్‌స్థానశని! జాతకాన్ని పుచ్చుకుని శిరోమణిదాకా— పో అక్కర్లేదు, నాకే తెలుసు. 'ఈరాత్రి భోయినం ఉందా మీకు' అన్నాను. ఉలిక్కిపడి— 'హుఁ' అన్నాడు. కంఠస్వరమూ, మనస్సుని పట్టి యిచ్చే మొహమూ,— నాకు భోజనం లేదు కాని... నువ్వుకూడా యుద్దేవా చెయ్యాలా అనీ — యిప్పుడా -- పేళవ అనీ చెప్పాయి నాకు.

కాఫీ వొచ్చింది. రెండుగారె లన్నాను నేను, సాంబార్ అన్నాడు సూరి.

నేను కాఫీ తాగి సిజర్ ముట్టించాను. 'డ్రీం' లో పడిపోయాను. గారెలు తిని— పూరీలు కూరతో పట్టించి—కాఫీ అక్ఖర్లేనని మంచినీళ్లు తాగాడు సూరి.

చలపతిరావు యితన్ని ఇల్లాగే ఎరుగున్నాడు కాబోలు! చుట్టలు అడిగి కొనిపించాడు. నేను రోడ్డు క్రాస్ చేసి బస్ అందుకోవాలి. నాతోపాటు వొచ్చాడు. యింకా యేం వొదిలిస్తాడో అని లోలో ఇదౌతున్న నన్ను గమనించినట్లే లేదు సూరి. బస్ వొచ్చింది, ఎక్కబోతున్నాను.

'మరి—'

వెనక్కి తిరిగిచూస్తే— ఏం ముణుగుతుందో అని చూణ్ణేలేదు. యింకా— ఏ మిమ్మంటాడో— థాంక్స్ చెప్పటానికేమో—ఆ'మరి' థాంక్సూ కాదు గింక్సూ కాదు. దేనికో—పాదికేస్తున్నాడు.

౪

మెయిలులో రాజారావు వొస్తాడని సెంట్రల్ స్టేషనుకు పోయాను. ఆయన వొస్తే నాకు చాలా మేలు. రేడియో టాక్ కోసమై - ఆయనరాక...నాకు అనుకోని ఉపకారం. ఆయన కొత్త మనమాట- ఆడంబరం వాళ్లతో అంటేనా- అని అనుకొంటూ- వెళ్లాను.

ఎవరో వొస్తా రని - సూరి అక్కడ.

'ఏం భాయీ!'

చిమ్మ్ఫునవ్వు నవ్వాను.

"భాయి! నిన్నొకటి అడుగుతాను, నిజం చెప్పు."

"ఏమి టది?"

"ఉద్యోగ ప్రయత్నం యేమన్నా చేస్తున్నావా-?"

దాద్దా మనుకున్నానుగానీ- దాయలా - చెప్పేశాను.

'నీ నోటి చెప్తాను, వినూ. నౌకరీ- అదే ఉద్యోగం. మన అదృష్టాకొద్దీ - వాపోయి దేవులాడుతాం - గానీ - దొరకదు. యివ్వరు. వాళ్ల చిట్టెం కట్టింది. (సిట్టూర్చి-) ఎవరి లక్ వారిది. Try Try Try again అన్నారు. మాడు!"

"అందుకే - నేను రాజారావుకోసం వొచ్చాను. ఆయన తెలుసుకుంటేనా - ?"

"అంతేవారా- ???"

"ఓ."

ఇంతలో దూసుకొంటూ మెయిల్ వొచ్చింది. రాజారావుగారు దిగారు. యిద్దరం కలుసుకూంటే... నూరి వొచ్చి, తన ఫ్రెండ్ రాలేదని చెప్పాడు. తన్ను యింట్రడ్యూస్ చెయ్యమన్నట్లు - లాలనతో - చూశాడు. గానీ యీయన వెంటబడి ఎక్కడ మన గోప్యం చెడగొడతాడో అని చూడనట్లు నటించాను. బైటకొచ్చాం - హోటలు ఎదురెట్టుకు రిక్షాలో- మేమూ - జనరల్ హాస్పిటల్ పక్కనుంచి పడి వెళ్లాడు నూరీ.

— ... వీలుచేసుకుని, రాజారావుగారు, ఆ మర్నాడు బయలుదేరారు. నేను రాజారావుగారితోటే ఉన్నాను. నాకోసం రాజారావుగారు బయలుదేరారు. 'లజ్' దగ్గర దిగి మాపని పూర్తిచేసుకో- వడిగావడిగా వడివడిగా పోతోతున్నాం. కచేరీరోడ్డులోంచివొస్తూ- నూరి!

రాజారావుగారూ - నూరీ పరిచయ మంద హాసములు చేసుకుంటూన్నారు. నాకు చిరాకు ఎత్తుకొస్తోంది. వీడెక్కడ పోగై నాడంట- శనిలాగు!

రాజారావుగారు మహా మెతకమనిషి. చూసీ చూడనట్లు పోక - వీణ్ణి పలకరించారు.

నూరి ఆయనకు దణ్ణం పెట్టి...నాతో - 'భాయీ ఆ ఖాదీకొట్టులో - కొత్తగా పెట్టారులే - కొంచం పరిచయం వుంది. నౌకరీకి ఎంత ప్రాధేయపడి వొచ్చానని!'

"ఏమయింది ?"

"లాభం లేదు."

కథ మస్తా అంటూ మేం బయలుదేరక మేమిటే- ఈ పైకిపలుకు లేమిటి ? రాజారావుగారూ థకేవాలే- తనుకునమ్మ అంటూ - యింత కాఫీ పుచ్చుకొద్దాం అన్నారు. నాకేం- ఖర్చు- కాదు. కానీ- మనం నిక్కినీలిగి మనం- పోయేసరికి— ఆ అవకలపెద్దమనిషి వుండొద్దూ ... మన అవసరమా ? వాళ్లవసరమా ? ఇదీ- నాబాధ. 'దావంతి' అన్నట్లు వోమాపు మాశి, సైఁ అన్నాను.

నూరికి మద్రాసు మద్రా సంతా హృత్కని. 'యిటుగో - బ్రాడీస్ రోడ్డు - యిక్కడే ఉడిపి హోటలు' అంటూ దారితీశాడు.

నా కక్కసి కాలుకొస్తోంది. రాజారావుమీనికనీ కూడా కలిపి.—'నూరీ ! మద్రాసులో ఎన్ని కాఫీహోటల్లో-అవీ ఎక్కడెక్కడో - అకారాది క్రమపట్టిక- తయారుచేసి ఉంచుకున్నా వల్లే ఉందే - అని నవ్వాను. హోటల్ కుపోదాం-నూరి లఘువుగానే తృప్తిపడ్డాను. ఏం చెప్పు ? అని అనుకున్నాను. రాజారావుగారు కిల్లీలు కొంటూన్నారు. నన్నివతలికి పిల్చినూరి-'భాయి సాబ్ ! వో పావలా యివ్వవూ ?' అన్నాడు.

'నీమొహం మండా !' అనుకున్నాను నాలో. లోలో. నెత్తవనాగరికత ఉన్న దున్నట్లు అని బతక లేమారె.

ఏమనుకున్నాడో మరి నూరి-'పోనీలే-వొద్దులే' అని అన్నాడు. ఉద్యోగానికని పోతూ వీడి ఆక్రోశం దేనికంటూ రాజారావుగారిపర్సు, చొరవ నటించి, అడిగి తీసుకుని, అందులోంచి - వో అర్ధరూపాయి (పావలా లేదు. మార్చచ్చు. కానీ - యిది వీడికి నొప్పి కలిగించవచ్చు అని యిట్లా చేశాను) తీసి - రాజారావు చూస్తూండగానే - నూరి కిచ్చాను.

చాటంత మొహం చేసుకుని, వెంటనే కృతజ్ఞతాభారంతో, నొప్పితో కుంగి, 'థాంక్స్' అని సూరి సెలవు పుచ్చుకున్నాడు.

విశ్వేశ్వర్రావు అన్నది నిజం. మహా వేధిస్తాడు!

ॐ

రాజారావుగారు చెప్పినా పని కాలేదు. రాజరాజేశ్వరుడు వొచ్చి చెప్పినా — కాలేదు. ఆశలు అడుగంటాయి. యింటిదగ్గర్నుంచి తెచ్చుకున్న మొత్తంలో పదే మిగిలాయి. నిరాశ ప్రబలిపోతోంది.

బంధువులింట్లో పెట్టా - పరువుపుట్టా పెట్టి... పూట పూట తిని తిరుగుతున్నాను. కాలక్షేపం చేస్తున్నాను. గాలి ఆడ్డంలేదు. ఏమీ తోచడంలేదు. దిగులు వికృతవదనంతో వెక్కిరించి వెక్కిరించి చంపుకుతింటోంది. ఏమీ చెయ్యడానికి తోచక- ఆక్వేరియంకు పోయాను. ఏమైనాసరే—కాస్సేపు వున్నా నేను మరిచే పోవాలి.

ఏ ఉపమానమూ దొరకని ఆ నీటిపాము ప్రియురాలికనుబొమ్మలా వంపు తిరిగి—ఉంది. ఈ ఈశ్వర సృష్టి ఇంద్రజాలం చూస్తూ— పైమరచి చూసిందే— చూస్తూ తిరుగుతూన్నాను. ఆ రంగురంగుల చుక్కల చాప నోరు తెరిచి—దేబెమోహంతో— పన్నునిపన్ను దగ్గర నోరు మూసుకుంది. ఆ తాంబేలు— ఆ అద్దం నిచ్చెన కన్నాల్లోంచి, అవలి ప్రక్కకు పోవాలని— తల మార్చి—పో ప్రయత్నించి- కన్నం విశాలం చాలక తాను పోలేక— కోడిపోయి— మళ్లీ ప్రయత్నిస్తోంది.

"బ్రదర్! క్షమించాలి!"

"ఎవర్రా నాయనా ???"

"సూరి!!!"

పీడిగొంతుక ఎల్లా పిసకడమా — అని ఆలోచిస్తున్నాను.

"బ్రదర్! నీతో కించిత్తు క్షమార్పణ చెయ్యాలి"

"ఊఁ—కానీ—"

"నేను ఇక్కడ ఎక్కువసేపు ఉండకూడదు. మా స్నేహితుడు లోపల ఉన్నాడు. మాట చెప్పి వస్తానని లోనికి వొచ్చాను. మర్యాదకు దయ వుంచి బైటకు రావాలి."

'ఏం గ్రహచారంరా నాయనా' — బైటకు వొచ్చాను.

పక్కనే కాఫీహోటలు వుంది. ఎంత వొదలాలో-

పక్కనే ఉన్న చెట్టునీడను యెవ్వరూ లేరు. అక్కడ కూచోబెట్టాడు సూరి.

"శాస్త్రీ! నిజం చెబుతున్నాను. నువ్వు యేమనుకున్నాసరే— నేనూ నాకోసమే వల వేసి గాలించి వెతుకుతున్నాను. ఈసారి నేను వొక్క చేతిసంచీతో మాత్రమే మద్రాసు వొస్తే!— ఎన్నో వ్యసనాలను చంపుకున్నాను, వొక్క ఆకలిని తప్ప. ఆ ఆకలి- సృష్టి కంతకూ—సహజంగా ఉన్నదే. కాని నా ఆకలి వల్ల నేను 'వల్చర్'గా చూడబడుతూన్నాను. భూభారమై పోతూన్నాను. (ఏడుపు వొస్తోంది అతనికి). నా పేరు చెప్తే మండిపడతారు. నువ్వు అల్లా అందరిమాదిరీ కాదు, రసజ్ఞుడివి. (డిగ్రీ యిచ్చేశాడు. ఏం కావాలో యిస్తాడు...) లోకంకంటె వెయ్యి విధాల ఉన్నతుడివి...ఏదో వొక ఔన్నత్యం నీలో లేకపోలేదు. అట్టి నీవుకూడా...నన్ను - నిన్న లజ్ దగ్గర చూసీ చూణ్ణట్టు నటించావు. ఎవరు చేసిన పాపఖర్మం అనుభవించే దిక్కూడా...ఇంతే - నిన్న పావలాకు అర్థ ఇవ్వడమూ యింతే - నాకు తెలుసు - ఆపత్తు - కాళిదాసు - యాచ్నా మోఘా వరమధిగుణే - నాధమే లబ్ధకామా - అన్నాడు. అంచేత నిన్ను అరమర లేకుండా అడిగి - ఎక్కసపెట్టాను. క్షమించు. భగవంతుడా! యిట్లామమ్మల్ని సాధించి వేధించి ఏం ఆనందం అనుభవిస్తావోయ్ తండ్రీ!" కన్నీళ్లు కార్చాడు.

—యిదంతా నిజమేనా? కన్నీళ్లు కొంతమందికి పైటలకు పైంట్లు తయారుగా ఉంటాయి కాబోలు!

పైకిమాత్రం - "భాయీ ఇంత చెప్పాలా - చిల్లరలేకానా - రాజారావు ఏమనుకోడు గనకానా -

అల్లా యిచ్చాను గానీ - యింకోవిధంగా ఆలోచిం చకు" అన్నాను.

"మరి—చూసీచూణ్ణట్టు నటించావేం?"

"తొందరగా పోతున్నాం - ఆలీశ్యం ఔ తుందని."

"ఆమాటే చెప్పెయ్యకపోయావూ - శాస్త్రీ! నీవు మోరల్ కవర్డ్వి కావే-"

- పిచ్చివాడు. లోని నిజం పైకి చెబితే - విషం కాదా ?

సమదాయించాను: తేరుకుని వెళ్లిపోయాడు. ఇదంతా నిజమేనా...? లేక ఇదీ వో వేషమా—? ఏమో మరి - కవీశ్వరుడు మరి - ఎన్ని చమత్కారా లైనా చెయ్యగలడు...

## ౬

రెండు మూడురోజుల్లో ఉడాయించేద్దా మను కొంటూవున్నాను. నా కేమీ పాలుపోటం లేదు. మద రాసు వొచ్చేటప్పుడు నాభార్య - 'ముస్తైత్తుదాం - వంటలు చేద్దాం. పిలుపులు పిలుద్దాం, కాఫీహోటల్లో మీారు వడ్డనా - నేను పిండి రుబ్బడమూ - ఏదైనాసరే ఏమైనాసరే - ఏకృత్తయినా సరే - తప్పేమీ లేదు, స్వంత అన్నం తిందాం' - అని చెప్పినమాటలు అప్పట్లో వేడీ, మధ్యన బాధా, తుదికి - విషపునవ్వూ నిచ్చాయి. కానీ - యిప్పుడు...చెప్పలేను, కుంగిపోతున్నాను, ఏ మొహం పెట్టుకొని యింటికి పోటం ?? అని.

హఠాత్తుగా శ్రీనివాసరావు కనిపించాడు మూరితో సహా, బ్రాడ్వేదగ్గర. మాపరిచయాల సంగతి, ఎరక్క - మూరి - మాఇద్దరికీ తొలిపరిచయం చేయ బోయాడు. ఏంరా - అంటే ఏంరా - అని మేం సంభాషణ మొదలుపెట్టాము. - విస్తుపోయి చూచి, వోః కుంగిపోయి ముళ్లమీద వున్నట్లు వున్నాడు మూరి.

కొంచెం సేపటికిగాని నేను గ్రహించలేదు అతనిబాధ. శ్రీనివాసులు — అతణ్ణి (మూరిని) మకీ తీసికట్టుగా చూస్తాడాయె - తానా - నాముందు కవిఆయె - యీ విషమస్థితి అతనికి మరీ యిబ్బందిగా ఉంది.

శ్రీనివాసులు ఆమాటా ఈమాటా తెచ్చి, 'వో రయ్ నివ్వు నాఅతిథివిరో'- అని నన్ను ఆహ్వానించాడు. మూరి మాటో-? శ్రీనివాసరావు అతణ్ణి పిలవనేలేదు. కదల బోతున్నాం ఆమాటా ఈమాటా చెప్పుకుని, కిళ్లీలు తీసు కొస్తానని శ్రీని బయలుదేరాడు.

మూరి నన్ను 'భాయీ!'

పరధ్యానం నటించాను.

"భాయీ!!"

"ఊఁ - ఏం ?"

"ఏం లేదు..." పడగ ముడుచుకునే తాచు పాములా తల వాల్చుకున్నాడు.

నా కర్థమైంది. కాని తెలీనట్లు చూస్తున్నాను.

శ్రీనివాసరావు యిన్ని గోల్డ్ ఫ్లేకులూ కాకిని చుట్టలూ తెచ్చి 'కదుల్దామా-??' అని అన్నాడు.

'వుంటానండీ' అని మూరికేసి చూశాను. అతని మొహం స్పష్టంగా చెప్తోంది, వీళ్లు ఈపూట భోజనానికి పిలిస్తే బాగుణ్ణే అని.

శ్రీనివాసరావు తొందరపడుతూన్నాడు. వో చుట్ట అడిగి తీసుకుని, మూరి కిచ్చాను. ఆక్వేరియంలో చాప లాగు - దేబెమొహంతో మూరి నిష్క్రమించాడు.

శ్రీనివాసరావు ఆమాటా ఈమాటా చెప్తూ-

"అబ్బాయి! వానవెలిశాక కాశేవన్నెట్లో ఉన్నా నురా నేను. యిదుగో. సిగరెట్టు ముట్టించు: తీరిగ్గా కథుర్లు చెప్పుకుందాము... నిజం చెప్తే - నమ్ముతావో - నమ్మ వో - కానీ, తెనాల్లో ఈమధ్య నేను పడ్డ, బాధలు కొ స్త మరిచేపోయామురా - యిక్కడ వో డిస్ట్రిబ్యూటర్ దగ్గర నాఖరీ. డెబ్బయిరూపాయి లిస్తారు. సుఖా లం టావా? - అవి ఎప్పుడూ సాధ్యాలే—ఆనందం అంటావూ-? అది మనస్సు కల్పించే ఇంద్రజాలం. ఎప్పు డైనా..." అంటూ రోటరీ మిషన్ సంగీతంలా ఉప క్రమించాడు.

నాకూ ఏదైనాపని చూపించిపెట్టమని అందా మని పెదవిదాకా వొచ్చింది. కాని- నిక్కచ్చపోయాను. 'విప్రాః పశ్చిమబుద్ధయః' అని ఊరికే అన్నారా?

హోటల్ ఎస్ప్లనేడులో భోంచేసి అద్దంలో చూస్తూ చేతులు కడుక్కొని, కిందికొచ్చి పేము సోఫాల్లో పత్రిక చదివి, మళ్లీ బయలుదేరాము. మూకర్ నల్ల ముత్తు వీధిలో యున్న 'బ్లాకులు' ఆఫీసుతాలుకు తీసుకుని- వెల్లిగా బీచ్ స్టేషన్‌కు వొచ్చాం.

"నువ్వు ఎందాకా?" అన్నాడు నన్ను.

"నీతోటే."

అచ్చా అని రెండు మాంబళం టిక్కెట్లు కొని - రైలులో కూర్చున్నాం. యింకో ఉద్దేశంతో వెంటబడ లేదుగానీ - ఎల్లాగయినా పీడిచేత అడిగించుకొని - ఏయాభైరూపాయిల job ఐనా లంకించుకోవాలి అని ఆలోచిస్తున్నాను. పార్కు స్టేషన్ దాటి ఎగ్మోర్ స్టేషను దగ్గరకు వొస్తూంది, ఎలక్ట్రిక్ ట్రైన్.

'ఏంరా!'

'ఆఁ!'

"మరేం అనకోకు - దేనికి వొచ్చావురా -ఇక్కడికి (మద్రాసుకి)?"

- నవ్వాను. ఆ వొక్కనవ్వూ నాజీవితాన్నం తనూ పట్టి యివ్వవచ్చు.

"నౌఖరీ చూట్టానికి వొచ్చావుట్రా?"

జెగ్గదర్పం- 'ఔను' అనలేకపోయాను. పెదవు విరిచి 'ప్చ!' అన్నాను.

"-చూశావా మంచి ఫిలిమ్స్ వున్నై వూళ్లో" అన్నాడు మళ్లీ శ్రీనివాసరావు.

"ఊఁహూఁ" అన్నాను లేదన్నట్లు.

'అయితే ఫస్ట్ క్లాసిప్పిస్తాను. పో, మినర్వాకు. 'లైఫ్ ఆఫ్ ఎమిలీ జోలా' మంచి ఫిలిం."

'అచ్ఛా' అన్నాను. చేసేదిలేక.

మాంబళంలో దిగి వ డిఆఫీసుకు పోయాం. మేనేజర్‌తో పది పదిహేను నిముషాలు మాట్లాడి యిదతలకు వొచ్చి, "అబ్బాయి నాకు నెల్లూరు ప్రయాణం తగిలింది. సాయంత్రం పోవాలి. సరే. కాని కాస్సేపు నువ్వు పడుకుంటావా—?"

"అహ — మరి నువ్వు?"

"పనుంది - పోను. దా" అని వొగదిలోకి తీసుకెళ్లి వోమంచం చూపించి దిండు యిచ్చాడు. తనపని లోకి తాను పోయాడు!

—అయిదింటికో - అయిదున్నరకో నిద్ర లేపాడు. మొహం కడుక్కొని తల దువ్వుకుని, బయలుదేరాము.

"భోంచేస్తావా యిప్పుడు?"

'అర్ధగంతరం' లేదన్నాను.

యిద్దరం భోంచేశాము. షైటి కొస్తూంటే మినర్వాకు ఫస్ట్ క్లాస్ టికెటు - ఆర్డర్ - యిచ్చి 'యిహ నే వెళ్తాను నెల్లూరు పోవాలి' అన్నాడు శ్రీని.

'అచ్ఛా.'

కిల్లీలూ - సిగిరెట్లూ కొని పర్సు లో జేబులో పెట్టుకోబోతున్నాడు.

'శ్రీ!' పిలిచాను.

'క్యా?'

'వో రెండురూపాయలు కావాలిరా.'

నాకంఠం చచ్చిచావనిదళకు సూచిస్తోంది.

'అలాగే'.

పర్సులోంచి డబ్బు తీసి అరిచేతిలో పెట్టుకొని నాకేసి చాచాడు చెయ్యి తీసుకో అన్నట్లు. యిదో మర్యాద.

మూడురూపాయలు తీసుకున్నాను.

మళ్లీ శ్రీనివాసరావు అన్నాడూ: 'యిక్కడే వో ప్రెస్‌లో ప్రూఫ్ రీడర్‌గిరీ ఖాళీ ఉంది. వోపాతిక యిస్తారు. వొప్పుకో. ఓం ప్రథమంలో ఎక్కడో అక్కడ ఇరికితే - తర్వాత పైపైకి ఎగ్రాకవొచ్చు.'

'—పాతికా —భూమిపాతిక — ఎందుకులే' అన్నట్లు - పెదవి విరిచి తల విసిరాను. 'శైశో' అని శ్రీనివాసరావు వాళ్ల ఆఫీసుకేసి వెళ్లాడు.

—ఉస్లోకి వొచ్చాను.

'భాయీ!'

'ఆహా—సూరీ!'

ఇందాక శ్రీనివాసులు దగ్గిర మూడురూపాయలు తీసుకునేప్పటికే - నాకు చచ్చేచావనిపన్నైంది. తల కొట్టినట్లైంది. ఈసూరి యిలా ఎన్నాళ్లు బతగ్గలడో?

'క్యా భాయి!' గర్జించాను.

"శ్రీనివాసరావు చూశావా - యిందాక భోజనానికి పిలవనేలేదు."

ఏమో మరి మీటరమ్స్ నాకేం తెల్సు చెప్పండి? అయినా నేను అతిధిని చూడండీ—?"

"శాస్త్రము వ్వేమైనా తీసుకుని యిస్తా వనుకున్నాను."

—యిదో ఆటా—? పైకి 'చెప్పకపోయావా?' అన్నాను.

"నేనే చెప్పాలా - నా కుచేలదారిద్ర్యం నీకు తెలవం దేమిటి భాయీ!"

"పాపం శ్రీనివాసరావుదగ్గర కూడా అట్టే లేనంది!"

"లేకేం—వుంటుంది!"

వెధవ Poetic eye.

బుకాయిద్దా మనుకున్నాను.

"అట్టే లేదండీ - యిందాక నేను హోటల్ బిల్ కోసం వాడిపర్సు తీసి చూశాను. రూపాయిన్నరే ఉంది."

"ఆరూపాయి లేకపోయావ్ శాస్త్రీ. వాడు మార్వాడీల గుమాస్తాకదా - ఆమాత్రం ఆఫీసులో దొరక్కపోతుందా-?"

—వోరి పీడికుంప తెగా - ఎంతవరకూ దిగాడు!

"వాడి జీతంకూడా-అట్టే లేదండి".

"లేకపోవట మేమిటండీ - నేనంటే వాడికి. పనరు. నువ్వే ధైర్యంచేసి - యిస్తా వనుకున్నాను. యిందాక వోచుట్ట తీసుకు యివ్వలా - అలాగే వో రూపాయి లేకపోయావా—? వాడుకునేవాళ్లం!"

—వాడుకునేవాళ్లం !!! - నన్నూ కలిపాడు. పొడిచినట్లైంది. అమాంతం విరుచుకుపడ్డాను.

"యిట్లా సేరతింది, మిత్రికూడా, దోపిడీ—దోచుకోటం, పిగ్గయ్యకుటోయ్: కవిట, కవి. అమ్మో రాత - తెలుగుదేశంలో - ఎవరూ కాకోయ్ కవి."

"దొందుంప తెగా - కళ్లకట్టనపట్టం ధుమ మారా. ఛీ. ఛీ. ఎక్కణ్ణుంచి తెస్తారు? కుప్పలు పోసు కూర్చున్నారా? యిల్లా సతాయించే బదులు ఏ అచ్చాఫీసులోనన్నా పని కుదుర్చుకోరాదూ? దేశబాధ తప్పుతుందీ.ధనికులు. ధనికులు! వీళ్లదుంపతెగా —పని చూపించి తిండి పెట్టేబదులు, కీర్తికోసం-బిచ్చం వేసి- దానమ్మంటారు. ఈ దోపిడీగాళ్లజట్టును తయారు చేసింది మహాదాతలే."

—పాపం! సూరి కిక్కురు మనలేదు. నిప్పులు మీద నుంచున్నట్లు నుంచుని ఆకాశంకేసి చూస్తున్నాడు.

వా డేమన్నా సమాధానం చెప్పకస్తేకాదూ—నానోరు లేవనీలు.

చేసేదిలేక—ఊరుకుని, 'మినర్వా ఎక్కడ?'

"లోన్ స్క్వేర్‌లో."

"దా. చూపించు."

వొచ్చాడు. అదుగో అని చూపించాడు.

"సినీమాకు వొస్తావా?"

"రాను. పనుంది."

"పైసా ఏమన్నా కావాలా?"

"అక్కర్లేదు."

వెళ్లిపోయాడు.

ఆ మర్నాడు కనిపించలేదు సూరి.

## ౭

అయ్యో! శ్రీనివాసరావుదగ్గర పెట్టుకు పోయానే—అని ఏట్టు వాపోతున్నాను. ఏం లాభం. వాడు నెల్లూర్లో. పోనీ అక్కడికే పోదాం అని అనుకున్నా, నువ్వు ట్రా—పని చేసేదీ—అని ములుకర్ర పృచ్ఛకుంటాను. అయినా అందదు.

ఆ మరుసటిరోజు సింగరాచారివీధి హోటల్ గకి భోంచేసి కారు స్ట్రీటు దాటి వార్తా టాంక్ వీధులోంచి అంగలు వేసుకొంటూ వెంకట్రంగంపిళ్లె వీధి క్రాస్ చేసి సుంకువారి వీధిలో పడ్డాను. పోస్టు జవాను వొస్తున్నాడు.

"ఉత్తరాలు ఉన్నయ్యా?"

"యింట్లో యిచ్చావండీ."

ఎక్కణ్ణుంచో — ఉద్యోగం ఆర్డరేమో... కాలక్షేప యింటి దగ్గర్నుంచేమో—లవణ (నా భార్య) రాసిందేమో. ఏమో—ఎక్కణ్ణుంచో.—

గాలిలాగా ఊగిపోతూ - యింటికొచ్చి ఉత్తరం అడిగి తీసుకుని - చించి చూశాను.

"శ్రీ శాస్త్రిగారికి. నమస్కారాలు. నీ రెండుకాళ్లూ పట్టుకుని దణ్ణం పెడ్దామని మహావుంది. కాని మూణ్ణాలుగు బస్ కిచ్చే పత్తువలేక - జాబు రాస్తున్నాను. క్షమించు. ఇన్నాళ్లూ, అన్నిపాపాల్లోకీ - యితరుల మనస్సును నొప్పించడం మహాపాపమని అనకొనేవాణ్ణి. యిప్పుడు కించిత్తు మతం మార్చుకుంటున్నాను.

"మనస్సుకు నొప్పి కలక్కపోతే - మనం ముందుకు పోం. చలిమిడి ముద్దగా ఉన్నట్టుగానే ఉంటాం: మానవమానసికవేదనకు ఖరీదు లేదు. నిజం. తల్లి, తండ్రి, భార్య, స్నేహితులు, సంఘం కట్టుకట్టి పోరి మెహాన వుమ్మేసి గెంటకపోతే, మానవమాత్రుడు సంపాదనకు దిగడు. సోమరిపోతు ఔతాడు. నిజం.

"నన్ను ఆనాడుమహాశవికింద కట్టినసీవు, నావద్యాలకు తినిపి, నన్ను ఎక్కిరించినవాళ్లకై పళ్లు పటపటకొరిన నీవు, ఆనీవు, నీవు, నీనవ్వుకు నాలుగుసార్లు ఆశపడేటప్పటికి -మురుక్కాలవలోని పురుగునుగా చూశావు ను క్వేమిటిలే - అందరూ చూస్తారు. నన్ను చూశారు. నిజం. కాని - యిన్నాళ్లనుంచీ రానిబుద్ధి, ఎన్నిసార్లో తల బొప్పి కట్టించినబుద్ధి, మొండికత్తివబుద్ధి, నీవంటి రసజ్ఞుడి - సహనశీలుడి చీవాట్లతో - ఏమో - మరి - ఎంచేతో - దారిన పడ్డది.

"కాని-నావీ తప్పులు లేకపోలేదు. ఐనా నీవు - ఔదార్యంతో వాటిని ఆకలితప్పులకింద మన్నించితే-నే నింకా ఆ బురదలోనే - కంఠందాకా నన్ను నుంజుకున్న ఆ ఊబిలోనే కూరుకునిపోయి - శవంలా బ్రతుకుదును. ఉద్ధరించి - మహోపకారం చేశావు. నీలో తెలీని ఔన్నత్యం ఉందని మహా అనుకునేవాణ్ణి... ఈ నాటికి కించిత్తుగా నైనా గోచరించింది.

"జీవించడం అనుభవాలకోసం. యిన్నాళ్లనుంచీ-ఎత్తిన అవతారం చాలించి, కొత్త అనుభవాలు అనుభవించ బోతున్నాను.

ఆవేశోపంలో-గనికులనూ తిట్టావు గుర్తుందా...? ఉండదులే. ఎప్పుడూ - మాట పడ్డవాళ్లకేగానీ - అన్నవాళ్లకు గుర్తుండదు. సహజం. విద్యం పెట్టక పని చూపించాలి అని.

"నిజమైన దేశోద్ధారకులు శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుగారిని బ్రతిమాలి 'శరద్విసంవాగ్దతి చాశకోపి' బ్రతిమాలి కంపోజింగ్ నేర్చుకోకుదిరాను. నో నెలా-నెలాపదిహేనురోజులు నేర్చుకుంటే వొస్తుంది అన్నారు. మొదటి రెణ్ణెల్లూ పదిహేప్పన యిస్తామన్నారు. ముందు భుక్తికి వుచితంగా వో ఫది యిచ్చారు. ఆరు రూపాయలకు అన్నం పెట్టేహోటల్లో అన్నం తిన మొదలు పెట్టాను. నా పంచీ, చాపా - మా ఆఫీసులోనే.—

"భాయీ—నీసదుపదేశం ద్వారా పొ అన్నం నేను తింటున్నాను. తింటాను. ఈ మహోపకారం చేసిన నీకై ఎన్ని steps ఐనా దిగి బ్రతుకుతెరువు చూసుకో-, పోజులు వదులుకో, మార్గదర్శివి ఐన నీకై - నా జీవితాన్నంతా పరమేశ్వరునకువలె మంగళహారతి ఎత్తుతాను. నిజం. కవులం, కవులం అని అంబోతులా తిరగక, కవిత్వశక్తి ఉండుగాక, అది దేశానికై వినియుక్తం అని మాన

తతను గుర్తించి, మానవుని సాధారణ ధర్మమైన బాధ్యతల్ని వహించడంలో నీవు చేసిన నవజాగృతి సంస్తవనీయము.

"ఈ జ్ఞానము ఏనాడో రావలసినదైనా—బండబారిన బుద్ధిమంతుణ్ణి గనక— ఆలిస్యమైంది. ఈ 'దాలిగుంటశాంతి' జీవితాంతమూ నిలుచునట్లుగా నీ ఆశీర్వచనము కోరుతూ— నీవున్న దిక్కుకై తల వంచి, ఈనా ఎడద, నీకై నిరంతరము కేలో మ్రొక్కుగా నిలుపుకొనే—

నీ సూరి."

గబగబా వుత్తరం మడిచి, జేబులో పెట్టి పర్సు చూసుకొని వెంకట్రటంగంపిళ్లవీధి చివరకు టర్మినస్‌కు పోయినాను, బస్‌కోసం. సూరిని చూడాలి. ఏమిటో - 'కలదు నాలోన క్షీరసాగరము నేడు'-అనలేను. పారిస్ కార్నరు నేరుగా పోయేబస్సు లేదు. వేళకు దీం దంప తెగా ఎర్రగా కొట్టొస్తూ - వచ్చీ హారిస్ బ్రిడ్జి పోయే బస్—కదలబోతోంది—ఖాళీగా.

(నిశ్శేషం)

# మద్రాసు సహకారకేంద్ర భూమి తనఖాసంఘము

## (THE MADRAS CO-OPERATIVE CENTRAL LAND MORTGAGE BANK)

శ్రీ నరసింహదేవసుందర రామశాస్త్రి

[శ్రీ నరసింహదేవర సుందరరామశాస్త్రిగారు భారతి పాఠకులకు సుపరిచితులు. వీరు ఆర్థిక శాస్త్రవేత్తలు; ప్రస్తుతం మద్రాసు విశ్వవిద్యాలయములో 'స్టేటిస్టిషియన్' (Statistition) గా ఉంటున్నారు. ఉన్నతవిద్యాబిరుదముల నందుటకై వీరీ వరకు ఇంగ్లాండు వెళ్లినారు. కాని యుద్ధము వచ్చుటచే ఆ ప్రయత్న మిప్పటి కింకను సాంతము కాలేదు. వీరిది ఆర్థికవ్యవహార గణకశాస్త్రమునా అందెవేసిన చేయి. కేంద్రభూమి తనఖాసంఘమును గురించి వీరు వ్రాసిన ఈ వ్యాసమును సహకారోద్యమాభిమానులు అందరు శ్రద్ధతో చదివి పర్యాలోచింపదగినది.

—భా. సం.]

ఇప్పటికి సుమారు ౧౫ సంవత్సరాల క్రితం, చెన్నరాజధానిలోని ఋణపీడితులైన భూమిఖామందులకు దీర్ఘవాయిదాలమీద (౨౦ సంవత్సరములు) సులువుగా ఋణమును తీర్చుకొనే అవకాశము కలుగజేయుటకు కొన్ని సహకార భూమితనఖా ప్రాథమిక సంఘములు కొన్నిచోట్ల స్థాపించారు. వాటిని క్రమంగా అన్నిజిల్లాలలోను పెట్టుటకు ప్రయత్నాలుకూడా జరిగినవి. ఈసంఘములు అందులో చేరినసభ్యులకు భూమి తనఖామీద, ముఖ్యముగా తమపాతఅప్పులు తీర్చుకొనే నిమిత్తము సొమ్ము బదులిస్తూ వుండేవి. ఈ సొమ్ముకొరకై ఆసంఘములు సభ్యుల భూమిహామీమీద ఆ సంఘంలో డబ్బు నిలవచేసుకొన్నవారికి (నిలవదారులకు - depositors) ఋణపత్రాలు వ్రాసి యిచ్చి, సభ్యులవద్దనుంచి వచ్చిన వడ్డీతో ఆపత్రములమీద వడ్డీని ఏటా తీరుస్తూ, మిగతసొమ్ము వ్యాపారానికయ్యే ఖర్చుల కిందను, కొంతనిలవనిధి (Reserve fund) కిందను, వాటాదారులకు పంచిపెట్టే లాభము కిందను వినియోగిస్తూ ఉండేవి. ఈసంస్థల మీద ప్రజలకు నమ్మకం కలుగడానికి ప్రభుత్వంవారు వీటిని తనిఖీ చేయుటకున్ను, అప్పుదరఖాస్తులను, హామీఆస్తులను తనిఖీ చేయుటకున్ను తగు సిబ్బందిని తమ సొంత ఖర్చులమీద ఏర్పరచి, ఈతనఖా ఆస్తులకు సహకార సంఘ రిజిస్ట్రారుగారిని ధర్మకర్త ("Trustee") గా ఏర్పాటుచేశారు. ఇదిగాక, నిలవదారుల వద్దనుంచి తీసుకువచ్చిన సొమ్ముతో సమానముగా, ౫౦ వేలకు మించని పద్ధతిని

ప్రతి సంఘమునకు ప్రభుత్వంవారు అప్పు ఇస్తూవచ్చారు. కాని అనేక కారణాలవల్ల ఈ ప్రాథమిక సంఘాలు సత్వరాభివృద్ధి గాంచక పోవడంచేత, వ్యాపారమును కేంద్రీకరించి, విరివిగా పనిచేయుటకు ౧౯౨౯-వ సంవత్సరములో మదరాసులో కేంద్ర భూమి



శ్రీ నరసింహదేవర సుందరరామశాస్త్రి.

ఖాసంఘమును ఏర్పాటుచేశారు. మొదలో అప్పటి వ్యాపారమందము (Economic pression) మూలమున ఈసంస్థకుకూడా మ్ము సేకరించడం కష్టమయింది గాని ప్పటి అధ్యక్షులైన కీ. శే. దివాన్ బహా ం, మోచర్ల రామచంద్రరావుపంతులు రి కార్యదక్షత మూలమునను, మదసు రాష్ట్రీయ ప్రభుత్వంవారి అనుగ్రహంను ఈసంస్థకు పలుకుబడి హెచ్చి. సంగా, వ్యాపారము అభివృద్ధి పొందింది

కేంద్రసంఘం అదృష్టంవల్ల వెంటనే వడ్డీ ధరలు కూడా తగ్గి బజారులో (money market) విరివిగా సొమ్ము ప్రవహించడంచేత కష్ట మేమీా లేకపోయింది. సమయం కనిపెట్టి కేంద్రసంఘముఅధికారులు అదివరకు హెచ్చువడ్డీలపై నున్న ఋణపత్రాలను (debentures) తక్కువ వడ్డీలోనికి మార్చి, సభ్యులకు సదుపాయంచేశారు. ౨౦ సంవత్సరాలవరకు సాలీనా ఎక్కువ ఆదాయం వస్తుందనుకున్న నిల్వదారులకు (depositors) ఈసొమ్ము వెంటనే తిరిగి వచ్చి, తిరిగి దీనిని తక్కువవడ్డీకి అన్వు ఇవ్వవలసి వచ్చుటచేత కొంత అసంతృప్తి కలిగింది. ఆ తరువాత, ౧౯౩౭ లో కేంద్రసంఘపు అప్పుపత్రాలు కనీసం పదిసంవత్సరాలలోగా తీర్చబడవని సంఘం హామీాయివ్వడంచేత ఆభయం తీరి, తిరిగి సొమ్ము విరివిగా రాసాగింది. ఈదశలో సంఘముయొక్క అభివృద్ధి ఈకింది పట్టిక వల్ల తెయగలదు.

(వేల రూపాయలలో)

| సంవత్సరం | సం॥రంలో సంఘం ఇచ్చిన అప్పులు | సం॥రం ఆఖరున సంఘానికి రావలసిన మొత్తం బాకీలు. |
|---|---|---|
| ౧౯౨౯-౩౦ | ౪౨ | ౪౨ |
| " ౩౦-౩౧ | ౫౦౪ | ౫౩౯ |
| " ౩౧-౩౨ | ౬౪౪ | ౧,౧౩౧ |
| " ౩౨-౩౩ | ౧,౦౮౧ | ౨,౦౯౩ |
| " ౩౩-౩౪ | ౧,౪౭౮ | ౩,౩౮౨ |
| " ౩౪-౩౫ | ౨,౦౦౦ | ౫,౧౦౪ |
| " ౩౫-౩౬ | ౩,౧౯౬ | ౭,౮౬౬ |
| " ౩౬-౩౭ | ౩,౯౧౮ | ౧౧,౨౮౬ |
| " ౩౭-౩౮ | ౩,౫౭౯ | ౧౪,౦౮౦ |
| " ౩౮-౩౯ | ౫,౮౫౩ | ౧౭,౯౧౮ |

౧౯౩౪-వ సంవత్సరమునుండి ఈ సంఘం వ్యాపారం విరివిగా అభివృద్ధి పొందింది. అందులోనూ అఖరు సంవత్సరం అభివృద్ధికి వ్యవసాయదారుల ఋణవిమోచన చట్టమే ముఖ్య కారణము.

కాని, ఈమధ్య యుద్ధప్రయత్నములు, చివరకు యుద్ధము సంభవించినందువల్ల తిరిగి సంఘానికి క్లిష్టపరిస్థితులు ఏర్పడినవి. యుద్ధవార్తలు బయలు దేరినప్పటినుంచీ, ఋణదాతలు (investors) వడ్డీధరలు (interest rates) క్రమంగా ఎక్కువగునసే ఉద్దేశము కొద్దీ, దీర్ఘవాయిదాలకు ధనమును అప్పిచ్చుటకు ఇష్టపడటం లేదు. సంఘముకూడా వడ్డీధరలు హెచ్చిస్తేకాని దానికి సొమ్ము దొరకదు. హెచ్చుధరలు ఇచ్చినా, దీర్ఘకాలానికి అప్పు నిలవయుంచేవారిసంఖ్య చాలాతక్కువ కాబట్టి ఈ సమయంలోకూడా పూర్వములాగునే సంఘం తనవ్యాపారం అభివృద్ధిచేసుకోవాలంటే కొన్ని కట్టుబాట్లు చేసికొని, వ్యాపార మార్గాలను మార్చుకోవాలి. సంఘంయొక్క గత సంవత్సరము నివేదికను చూస్తే, ఇక ముందు ప్రతిసంవత్సరము సగటున ౧౦ లేక ౧౨ లక్షలరూపాయలు అసలు కింద వసూలుకాగలదని తెలుస్తుంది. ఇదివరలో, ఈ వసూలయేసొమ్ములో కొంతభాగము ఋణపత్రములు(debentures) తీర్చుటకును, మిగిలినది ఋణనిధి (Sinking fund) లో నిలవచేయుటకును ఉపయోగపడుతుండేది. సంఘం వసూలయినసొమ్ము వేరే ౨౦ సంవత్సరాలు నిల్వచేసి ఉంచవలసిన బాధ్యత తప్పించుకొనుటకిట్లా ఋణపత్రాలు తీరుస్తూ ఉండేది కాని, సరిగ్గా చూస్తే, ౨౦ సంవత్సరాలలోగా ఆపత్రాలు తీర్చవలసిన పూచీ లేదు దానికి. చిక్కుపరిస్థితు లేర్పడినవి కాబట్టి, ఆసొమ్మును తిరిగి పత్రం వాయిదానాటికి వసూలయేపద్ధతిని అప్పు లిచ్చేటందుకుపయోగించడంలో తప్పులేదు. ఈపద్ధతికి ఉదాహరణం (precedent) కావాలంటే ౧౯౩౧-వ సంవత్సరంలో జరిగినసంగతి ఒకటుంది. ఋణనిధి(Sinking fund)లోని డబ్బును ప్రభుత్వపు ఋణపత్రములు కొనుటకు (Government Securities) ఉపయోగపరుస్తున్నారు. సంఘమునకు విరివిగా డబ్బు వస్తున్నపుడు ఇట్లా వేరే నిల్వచేయుట మంచిదే కాని సంఘానికే డబ్బు లేనప్పుడు ఇట్లా ఉన్నసొమ్మును ఇతరవిధముల వినియోగపరచడం మంచిదికాదు. కాని, ఇట్లా సంఘంలో సంఘానికే ఉపయోగపర్చుకోవడం ప్రభుత్వమువారికి అంగీకారం కాకపోవచ్చును. ప్రభుత్వం ఈసంఘం అప్పులకు హామీ యిచ్చినప్పుడు ఆపత్రాలు మిగతాపత్రాలకన్న ఎట్లా తీసిపోయినవో తెలియదు. ఈవిధంగా ప్రభుత్వమే వాటిని తక్కువగా చూచినట్లయితే ఈపత్రాలు కొనాలని సంఘం ఇతరులను ఏవిధంగా హెచ్చరించగలదు? ఇది మామూలు పరిస్థితులలో అవలంబించవలసిన మార్గం కాకపోయినప్పటికీ, అసాధారణపరిస్థితులలో శాస్త్రీయపద్ధతులను అతిక్రమించే ఆచారము కలదు గనుక, ఆపరిస్థితులు తిరిగి మామూలు రీతికి వచ్చేవరకు ఈమార్పు చేయడం తప్పుకాదు. ఇదిగాక, ప్రస్తుతము మదరాసు రాష్ట్రీయ సహకారసంస్థలోను, జిల్లాకేంద్ర సహకారసంస్థలలోను దీర్ఘకాలపు వాయిదాకు అప్పిచ్చుటకు వీలయే సొమ్ము (క్షేమనిధి వగైరా) ఉంది. అది ప్రతి సంవత్స

రము వృదిఅవుతూ ఉంటుంది. దానిని వారు ప్రభుత్వపు అప్పుపత్రాలు కొనుటకు గాని, తమ వ్యాపారధనములోగాని ఉపయోగపరుస్తున్నారు. వారి వ్యాపారానికి విరివిగా సొమ్ము తక్కువకాలానికి సొమ్ము నిలవచేసేవారి(depositers)వద్దనుంచి వస్తూ ఉన్నది. ఇట్టిసొమ్మును ఈ తనఖా సంఘము పత్రాలలో నిలవ ఉంచవచ్చునని ప్రభుత్వం ప్రకటించినా, అట్లా విరివిగా చేస్తున్నట్టు కనబడదు. కాబట్టి, తమ దీర్ఘకాలానికి నిలవయుంచదగ్గ సొమ్మును ఇందులోనే ఉంచవలసిందని ప్రభుత్వంవారు ఆ సంస్థలకు, సహకార, భీమా సంఘములకు తాఖీదు పంపవలెను. సహకారోద్యమములో ఉన్న సంస్థలే ఒకదాని కొకటి సహకారము చూపక, ఇతరులసహాయము కోరుట హాస్యాస్పదము. మరియొకవిషయ మేమనగా, ఈ పరిస్థితులు యుద్ధం ముగిసేవరకు మాత్రమే ఉండగలవు; అనగా, నాలుగయిదు సంవత్సరాలలో తిరిగి మామూలు పరిస్థితు లేర్పడగలవు. అప్పుడు సంఘానికి విరివిగా సొమ్ము లభింపగలదు. అందుకొరకు ఈ చిక్కురోజులలో ౨౦ సంవత్సరాల వాయిదాలకు సొమ్ము లభించనట్టయితే, ౫, ౧౦, ౧౫ సంవత్సరాల వాయిదాలకు సొమ్ము నిలవచేసే లోకల్‌బోర్డులు, భీమాసంఘాలు మొదలైన సంస్థలు కొన్ని ఉండవచ్చును. వాటి సాకర్యార్థము తక్కువ వాయిదాలకు పత్రాలు వ్రాసి యిచ్చి, ఆ వాయిదాలలో తీర్చగలవారికి కొంతసొమ్మున్ను, దీర్ఘవాయిదాల మీద తీర్చేవారికి కొంతసొమ్మున్ను అప్పియవచ్చును. అవసరమయినట్టయితే, తిరిగి మామూలు పరిస్థితు లేర్పడినప్పుడు తిరిగి అప్పుపుచ్చుకొని, యీఅప్పులు తీర్చవచ్చును. సంఘానికి ప్రతిసంవత్సరం మామూలుగా వసూలు కావలసిన సొమ్ముకంటె ఎక్కువ వసూలు (advance collections) అవుతూ ఉండడం చేత అన్ని అప్పులు ౨౦ సంవత్సరాల దాకా కూడా ఉండవనే తోస్తుంది. కాబట్టి, ఇట్లా చేయడం ఒకవేళ శాస్త్రీయపద్ధతి కాకపోయినా సంఘానికి ఎట్టిచిక్కులు కలుగవు. పైన సూచించిన మార్గములన్నీ సాధారణ పరిస్థితులలో ఆచరించవలసినవి కాకపోయినా, ఈ అసాధారణ పరిస్థితులలో సంఘం అభివృద్ధి ఆగిపోకుండా ఉండేటందుకు వాటిని ఉపయోగింపవచ్చును. ఇట్లా ఏవిధంగాను సంఘంసొమ్ము సంపాదించ లేకపోయినట్టయితే, ఈభారం ప్రభుత్వానికే వప్పజెప్పి, వారివద్దనుంచి సొమ్ము పుచ్చుకొని బటువాడా చేసే ముక్త్యారి (agent) గా ఉండవలసి ఉంటుంది అది. వ్యవసాయదారుల ఋణవిమోచనచట్టం సందర్భంలో ప్రభుత్వంవారు ఋణస్థులకు అప్పియ్యడానికి ౭౫ లక్షల రూపాయలు ప్రత్యేకించి ఉంచారు. ఈ సంఘము ఆ అప్పులను చాలాభాగము తీరుస్తుంది కాబట్టి, ప్రభుత్వంవారివద్ద ఆసొమ్ములో కొంత - సగమైనను పుచ్చుకొని బటువాడా చేయవచ్చును. ఇట్లా చేసినట్లయితే, ఇప్పుడున్న స్వల్పస్వతంత్రమునుగూడా సంఘము పోగొట్టుకుంటుంది. ప్రభుత్వంవారినుండి ఇట్లా ఎన్నివిధాల ప్రయత్నించినా, కావలసిన సొమ్ము లభించనట్లయితే కేంద్రసంస్థ తక్కువ మొత్తములు కోరినవారికిని, తక్కువవ్యాపారముగల సంఘములకును, అభిమానము చూపవలెను. ఈ ప్రక్కనిచ్చిన పట్టికనుబట్టి

కేంద్రసంఘ మిదివరకే ఇందులో మొదటి విషయమును గుర్తించినట్లు కనబడుతుంది:

౧౯౩౮-౩౯ సంవత్సరములో బటువాడాచేసిన అప్పులవైనము

| అప్పుమొత్తము. | అప్పులసంఖ్య. | మొత్తం ఇచ్చిన అప్పు. |
|---|---|---|
| రు. | రు. | రు. |
| ౫౦౦ లోపు | ౪౩౧ | ౧,౪౭,౨౪౦ |
| ౫౦౦ మొ. ౧,౦౦౦ వ. | ౯౪౬ | ౬,౩౯,౪౮౫ |
| ౧,౦౦౦ మొ. ౨,౦౦౦ వ. | ౧,౧౨౧ | ౧౪,౮౨,౫౬౦ |
| ౨,౦౦౦ మొ. ౩,౦౦౦ వ. | ౪౨౭ | ౯,౭౫,౯౪౫ |
| ౩,౦౦౦ మొ. ౪,౦౦౦ వ. | ౨౦౯ | ౬,౮౮,౦౭౦ |
| ౪,౦౦౦ మొ. ౫,౦౦౦ వ. | ౧౫౮ | ౬,౮౩,౬౫౦ |
| ౫,౦౦౦ మొ. ౬,౦౦౦ వ. | ౧౨౫ | ౬,౩౨,౪౫౦ |
| ౬,౦౦౦ మొ. ౭,౦౦౦ వ. | ౧౨ | ౭౪,౧౦౦ |
| ౭,౦౦౦ మొ. ౮,౦౦౦ వ. | ౬ | ౪౩,౩౫౦ |
| ౮,౦౦౦ మొ. ౯,౦౦౦ వ. | ౧౫ | ౧,౨౧,౧౭౫ |
| ౯,౦౦౦ మొ. ౧౦,౦౦౦ వ. | ౭ | ౬౪,౮౭౦ |
| ౧౦,౦౦౦ | ౩౦ | ౩,౦౦,౦౦౦ |
| మొత్తం | ౩,౪౮౭ | ౫౯,౫౪,౮౬౫ |

ఆరువేలకు మించిన అప్పులసంఖ్య, ఇచ్చినమొత్తము తక్కువగా ఉన్నా, రెండు వేలకు ౬ వేలకు మధ్య చాలా మొత్తము కలదు. భూమి తనఖాబ్యాంకు పరతుల మీద అప్పు పుచ్చుకొనేవారి ఆస్తి వసతులను చూచినట్లయితే ఇన్నివాయిదాలు దొరకకపోయినా ఈవడ్డీ ధరలకు ఇతరుల వద్దనుండి వారికి అప్పు దొరకకపోదు కాబట్టి తక్కువ మొత్తములు కావలసిన వారికి ముందు సౌకర్యములను ఇవ్వాలి. ఇది గాక, ఈసంవత్సరనివేదికను చూచినయెడల, ఎక్కువ వ్యాపారముగల కొద్ది పెద్దసంఘములు మాత్రమే తిరిగి ఎక్కువ అప్పులు పుచ్చుకొన్నట్లు విశదమవుతుంది. ఇందువల్ల, ఫలిత మేమంటే, వాటివ్యాపారమూ, లాభములూ వృద్ధిపొందుతవి. కాని, సొమ్ము లేనప్పుడు వాటివ్యాపారము కొంతకాలము స్థిరముగా నిలబడిపోయినా ఇబ్బందిలేదు. తక్కువ వ్యాపారముగల సంఘాలకు డబ్బును అందుబాటు చేయనట్లయితే అవి నష్టం పొందగలవు. కాబట్టి, వచ్చినసొమ్ములో ముందుగా, ఈ చిన్నసంఘాల అవసరము చూచి, మిగిలినసొమ్ము మాత్రమే పెద్ద సంఘాల కివ్వాలి.

ఈసందర్భములో ఇంకొకసంగతి విశదీకరించవలసి ఉంది. ప్రస్తుతం పత్రముల (debentures)మీాద కేంద్రసంఘము ఇచ్చే వడ్డీకిని, ఋణస్థుడు ప్రాథమికసంఘము (primary bank) చెల్లించే వడ్డీకిని మధ్య ౧౦౦-కి రు ౨-౮-౦ లు తేడా కలదు. ఇందులో సిబ్బందివగైరా ఖర్చులకున్నూ, సంఘముల లాభములకున్నూ కేంద్రసంస్థ రు ౧-౮-౦ లున్నూ, ప్రాథమికసంఘము రు ౧-౦-౦ న్నూ పుచ్చుకొంటున్నవి. ఎక్కువ వ్యాపార మున్నసంస్థకు ఈతేడాలో తక్కువ భాగమున్నా సరిపోతుంది. కాని, ఇది తారుమా రవడంచేత, కేంద్రసంస్థకు విశేష లాభం వచ్చి, దానిని వారు విరివిగా, చావుబాకీలకు రు. ౪౦ వేలు, గృహనిధి (Building fund) కి రు. ౪౦ వేలు పంచిపెట్టినారు. స్థిరాస్తి తనఖాగల సంస్థలకు చావుబాకీలు తక్కువ. అట్లా ఉన్నవాటికైనా బాధ్యత కేంద్రసంస్థకు తక్కువ. ప్రాథమిక సంస్థకూడా దివాలాతీస్తేకాని కేంద్రసంస్థకు నష్టము రాదు. కేంద్రసంఘము అనేక కట్టుదిట్టములు చేసుకొని మరీ అప్పు లిస్తున్నప్పుడు, ఋణస్థులను బాధ పెట్టడానికి తప్ప ఇట్లా ఎక్కువ వడ్డీధరలను పెంచ నవసరంలేదు.

దానిలో కూడా ౧౦౦-కి ౩౫ ప్రాథమిక సంస్థలు నష్టములో మునుగుతూవున్నప్పుడును, మిగిలిన ౬౫ లోను సుమారు సగము ను ౧,౦౦౦ కు తక్కువలాభములతో పని చేస్తున్నప్పుడును, ప్రాథమిక సంఘాలలోని గౌరవోద్యోగులమీదనే విశేషభార మున్నప్పుడును కేంద్రసంస్థ ఎక్కువభాగము పుచ్చుకొని ఇట్లా పంచిపెట్టడము న్యాయముకాదు. ఎక్కువభాగము ప్రాథమికసంస్థల కివ్వవలసినధర్మము.

ఈనెలలో తనసభాసంఘముల ప్రతినిధులు సమావేశమయి, ముందుసంవత్సరపు వ్యాపారమునుగురించి పర్యాలోచన చేస్తారు; కాబట్టి, పైన వ్రాసినవిషయాలు చర్చించి, తగు నిర్ధారణలకు రావలసిన బాధ్యత వారిమీద ఉన్నది.

---

# యుద్ధము - విదేశవ్యాపారము: పరిశ్రమలు

శ్రీ సి. వి. దీక్షితులు

హిందూదేశమునకు సంబంధించినంత వరకు విదేశ వ్యాపారము, పరిశ్రమలు- ఈ రెండింటి విషయమునను యుద్ధమువలన ఎట్టి మార్పులు వచ్చుటకు అవకాశ మున్నదో సూచించుటయే ఈ వ్యాసముయొక్క ఉద్దేశము.

యూరపులో ఈ మధ్య ప్రారంభమయిన యుద్ధము త్వరలో ముగియుజాడ లేవియును కానవచ్చుటలేదు; పరిస్థితులన్నియును ఈ యుద్ధము చాలకాలము జరుగగలదని తోఁపించుచున్నవి. అనతికాలములో ముగియు యుద్ధమువలన ప్రత్యక్షముగా యుద్ధములో పాల్గొనని దేశముల కంత చిక్కుండదుగాని, కొన్ని సంవత్సరాలపాటు యుద్ధము నడచినచో దానివలన యుద్ధముతో సంబంధము లేని దేశముల ఆర్థికపరిస్థితులు సహితము తారుమారు గావచ్చును. చెరువుమధ్య కొక రాయి విసరినచో దానివలన గలుగు కదలిక అలల రూపమున క్రమముగా నలుగడల కెగ బ్రాకును; ఆ రాయి పరిమాణము తగినంత యున్నచో ఆకదలిక అంచులవరకును గూడ వ్యాపించవచ్చును. ప్రపంచకమండలి ఆర్థిక పరిస్థితుల విషయమున యుద్ధము ఈ తీరుగానే పనిచేయును.

యుద్ధము సర్వసాధారణముగా భీతావహమును, వినాశకరమును అయినను, అట్టి సమయమున జాగరూకతతో మెలగినట్లయిన కొన్ని దేశములకైనను నూతనావకాశములు లభింపకపోవు. ఇందుల కుదాహరణముగ మనము జపానుదేశమును తీసుకొనవచ్చును; గత యుద్ధమున జపాను తన విదేశవ్యాపారమునుఅపరిమితముగా వృద్ధిచేసుకొని,అంతకు ముందు యూరపియను దేశముల చేతులలో నున్న ఎగుమతి వ్యాపారమును చాలవరకు తనవశ మొనర్చుకొన్నది. మన దేశము కూడ గత యుద్ధమున మన ఎగుమతులు తగ్గిపోవుటచే నష్టము పొందినను, అంతకుముందు లేనట్టిగాని, అప్పటికి నామమాత్రముగ నున్నట్టిగానికొన్ని పరిశ్రమలను లేవనెత్తియు, పెంపొందించుకొనియు కొంతలాభము పొందినది. ఈ యుద్ధ సమయమునగూడ మన దేశము వెనుకటి తీరుననే విదేశవ్యాపారము విషయమున కొంత నష్టపడినను, పరిశ్రమల విషయమున లాభమునొందుటకు అవకాశములు లభింపగలవని చెప్పవచ్చును; కాని వెనుకటి యుద్ధమునకును ఈ యుద్ధమునకును సామ్యము తక్కువ, భేద మెక్కువ యను సంగతి ఈ సందర్భమున జ్ఞాపకముంచుకొనుట మంచిది.

మన దేశమునకు విదేశముల నుండి వచ్చు దిగుమతుల విలువకంటె మన దేశము నుండి విదేశములకు పోవు ఎగుమతుల విలువయే హెచ్చు. ఈ కారణమువలన ప్రతి సంవత్సరమును విదేశములతో వ్యాపారము వలన మన మొకరికి బాకీపడక పోవుటేగాక ఇతరదేశములనుండియే మనకు కొంత సొమ్ము రావలసియుండును. ఏ కారణము వలననైనను మన ఎగుమతులు నిలిచిపోయినను లేక తగ్గిపోయినను, విదేశవ్యాపారము వలన మనకు వచ్చులాభము[1] తగ్గుటగాని, లేక నష్టము[2] వచ్చుటగాని సంభవించుటయు, దేశముయొక్క ఆర్థికపరిస్థితులు విషమించుటయు తటస్థించును.

మనదేశమునుండి విదేశములకు ముఖ్యముగా ముడిపదార్థము లెగుమతియగును. కాని యుద్ధము రాగానే ఎగుమతులు తగ్గిపోవును. ఇందుల కనేక కారణము లున్నవి. ఒకవంక, శత్రుదేశములతో వ్యాపారము నిషేధింపబడుటచేతను, శత్రుదేశముల కవసరమగు పదార్థము లా దేశములు చేరకుండుటకుగాను తటస్థదేశములతో వ్యాపారము సహితము చాలవరకు నిరోధింపబడుటచేతను, మిత్రతతోనున్న దేశములు సహితము యుద్ధమునందు చిక్కుకొని, పూర్వమువలెగాక, యుద్ధకాలమున కేవలము ఆహారపదార్థములను, యుద్ధపరికరముల కవసరమగు పదార్థములను మాత్రమే దిగుమతి చేసుకొనుటచేతను విదేశవ్యాపారము క్షీణించును; ఇంకొకవంక యుద్ధభయమువలనను, ఆయాదేశపు ప్రభుత్వములు యుద్ధావసరము నిమిత్తము నౌకలను స్వాధీనముచేసికొనుట వలనను సరకులను గొనిపోవుటకు తగినన్ని యోడ లందక వ్యాపారము ఉన్న కొలది పాటియు కూడ స్తంభించును; వీనికి తోడు యుద్ధమువలన మారకపు రేటులకు స్థిరత్వము పోయి చంచలత్వ మేర్పడుటచే విదేశ వ్యాపారము సాగుట కిది ఇంకొకయాటంక మగును. వీటియన్నిటి ఫలితముగా మన దేశమునుండి విదేశములకు పోవుఎగుమతులు తగ్గిపోవును. ఇదే విధముగా మనకు విదేశములనుండి వచ్చుదిగుమతుల మొత్తముకూడ తగ్గును; శత్రుదేశములు దిగుమతుల పంపవీలు లేదు, మిత్రదేశములు యుద్ధపరికరములను తయారు చేసికొనుటలో నిమగ్నమై యుండుటచే, సాధారణముగా పంపు దిగుమతులను పంపజాలవు. వీనికితోడు యుద్ధము వలన నౌకాసౌకర్యము తగ్గిపోవును. తటస్థ దేశములు సహితము తమ దేశములనుండి విదేశములకు ఎగుమతులను పంపుటలో చిక్కులకు లోనగును. అంతేకాక సాధారణ సామగ్రులకంటె యుద్ధపరికరములను తయారుచేయుటలోనే వాని కెక్కువ లాభము దొరకుటచే ఆదేశములు తమ దృష్టి నటు త్రిప్పును. ఈ కారణములను బట్టి దిగుమతుల మొత్తము తగ్గుటయేకాక మన దేశములకు వచ్చు దిగుమతులవెల ఎక్కువగా నుండును. ఈ రెండింటి ఫలిత మేమనిన, మన ఎగుమతులు తగ్గుటచే విదేశములనుండి మనకు వచ్చు సొమ్ము తగ్గును; మనకు వచ్చుదిగుమతులు తగ్గినను వాని

1. Balance of Trade.
2. ఈ నష్టమునే Adverse Balance of Trade అందురు.

విలువ హెచ్చుటచే మనము విదేశముల కిచ్చుకొనవలసిన సొమ్ము హెచ్చును; ఎటు చూచినను మనకే నష్టము. మన వ్యాపార లాభము సన్నగిల్లును.

గత యుద్ధమునాటి కొన్ని లెక్కలను మనము పరిశీలించితిమేని పై విషయము స్పష్టము కాగలదు. ౧౯౧౪-వ సంవత్సరమున యుద్ధము ఆగస్టునెలలో ప్రారంభమైనది. ఈ ప్రక్క జూపిన ౧-వ పట్టికలో ౧౯౧౩-వ సంవత్సరము సెప్టెంబరు నెల మొదలు ౧౯౧౪-వ సంవత్సరము ఏప్రిలు నెల వరకును, ౧౯౧౪-వ సంవత్సరము సెప్టెంబరు నెల మొదలు ౧౯౧౫-వ సంవత్సరము ఏప్రిలు నెల వరకును మన దేశపు ఎగుమతి దిగుమతుల విలువ లీయబడినవి; ఈ సంఖ్యలు యుద్ధమువలన ఎగుమతి దిగుమతులలో గలిగిన మార్పులను పోల్చి చూచుకొనుట కనువుగానుండును.

౧-వ పట్టిక

(సెప్టెంబరు ను. ఏప్రిలువరకు- కోట్ల రూపాయలలో)

| సంవత్సరం | ౧౯౧౩-౧౪ | ౧౯౧౪-౧౫ | తగ్గుదల నూటికి |
|---|---|---|---|
| ఎగుమతులు | ౧౬౬ | ౯౫ | ౪౩.౧ |
| దిగుమతులు | ౧౨౭ | ౮౩ | ౩౪.౧ |

యుద్ధమువలన, ఎగుమతులలో నూరింట ౪౩ పాళ్లను, దిగుమతులలో నూరింట ౩౪ పాళ్లను పడిపోయినవి. ఈ తగ్గుదల ఏయే పదార్థముల విషయమున ఎంతెంతయో ఈ క్రింద ఈయబడినది.

౨-వ పట్టిక

**యుద్ధమువలని నష్టము**

(లక్షల రూపాయలలో)

౧. ఆహారపదార్థములు మద్యము మొదలగునవి.

| | దిగుమతులు | | ఎగుమతులు |
|---|---|---|---|
| మద్య పదార్థములు | — ౩౪ | ధాన్యములు, కాయధనుసులు | — ౮౦౦ |
| ఇతర ఆహారములు | — ౪౦ | తేయాకు | — ౭ |
| పంచదార | — ౪౩౯ | ఇతర ఆహారపదార్థములు | — ౪౯ |
| | — ౫౪౭ | | — ౮౯౫ |

౨. ముడిపదార్థములు.

| | | | |
|---|---|---|---|
| రాక్షసిబొగ్గు వగైరా | — ౨౩ | రాక్షసిబొగ్గు | — ౪ |
| | | లక్క, జనురులు | — ౬౬ |
| కిరసనాయిలు వగైరా | + ౧౮ | తోళ్లు, చర్మములు | — ౪౨౩ |
| | | లోహములు | — ౫౨ |
| వస్త్రములు | — ౧౪౩ | నూనెగింజలు | — ౧౦౮౭ |
| | | ప్రత్తి | — ౩౫౪౪ |
| | — ౧౪౮ | | — ౫౨౪౭ |

3. తయారైన సరకులు[1]

| | | | | | |
|---|---|---|---|---|---|
| దుస్తులు[2] | — | ౮౨ | రసాయనికములు(వల్లమందు) | — | ౧౧౨ |
| బండ్లు[3] | — | ౬౨ | రంగులు | + | ౫౪ |
| రసాయనికములు[4] | — | ౨౦ | తోళ్లు, చర్మములు | + | ౩౫ |
| ఇనుప పనిముట్లు[5] | — | ౨౦౧ | బట్టలు | — | ౭౪౫ |
| రంగులు | — | ౭౭ | | — | ౮౫౯ |
| గాజు సామానులు | — | ౧౦౩ | | | |
| యంత్రములు | — | ౧౮౨ | | | |
| ఇనుము, ఉక్కు | — | ౫౮౭ | | | |
| ఇతర లోహములు | — | ౨౫౩ | | | |
| కాగితములు | — | ౪౭ | | | |
| రైలు సామానులు[6] | — | ౧౧౯ | | | |
| బట్టలు[7] | — | ౧౭౮౧ | | | |
| | — | ౩,౬౪౬ | | | |

౪. ఇతరములు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| | — | ౬౩ | | — | ౬౦ |
| మొత్తము | — | ౪,౪౦౪ | మొత్తము | — | ౭,౦౬౧ |

ఎగుమతులలో హెచ్చుతగ్గుదల ముడి పదార్థములలోను, దిగుమతులలో హెచ్చుతగ్గుదల ఆహారపదార్థములు, తయారైన సరకులు, వీనిలోను కన్పట్టినది. ౧౯౧౪-వ సంవత్సరమున మనకు కావలసిన పంచదార అంతయు విదేశముల నుండియే వచ్చుచుండెడిది; కాని ఇప్పుడు మన కవసరమైన పంచదార, యించుమించుగా నంతయు, మనమే తయారుచేసుకొనుచున్నాము. అట్లే, ఇనుము, ఉక్కు - వీనికొరకై మన మిప్పుడు విదేశములపై నాధారపడియుండ నవసరము లేదు. బట్టలుకూడ మనకు కావలసినన్ని మన మిల్లులే తయారు చేయుచున్నవి. కాని, రసాయనికములు, ఇనప పనిముట్లు యంత్రములు, కాగితములు, రైలుసామానులు మాత్రము మన కింకను విదేశములనుండియే రావలసియున్నది.

ఎగుమతుల విషయమున పరిస్థితులలో అప్పటికిని ఇప్పటికిని విశేషము మార్పులేదని చెప్పవచ్చును; ఏలయన మన దేశమునుండి ముఖ్యముగా ముడి సరకులే ఎగుమతి యగుచున్నవి. వీనిని తీసికొను దేశములలో

1. Manufactured articles.
2. Apparel.
8. Carriages.
4. Chemicals.
5. Hardware.
6. Railway Materials.
7. Textiles.

కొన్ని యుద్ధమునందు శత్రుపక్షములో నుండుటచే ఎగుమతులు కొంతవరకు తగ్గక తప్పదు.

గత యుద్ధమునాటి విషయములను సూచించు పై పట్టికలనుబట్టి ఈ యుద్ధ సమయమున కూడ ఎగుమతి దిగుమతులు రెండును కొంత తగ్గగలవని స్పష్టమైనను అప్పటికిని ఇప్పటికిని పరిస్థితులలో కొంత భేద ముండుటచే ఈ సమయమున స్థితిగతు లెట్లుండునో స్పష్టముగా తెలిసికొనుటకుగాను శత్రుదేశములతో యుద్ధారంభకాలమునకు మనకున్న వ్యాపారమునుపరిశీలించుటవసరమైయున్నది.

ఈ యుద్ధమున ప్రధాననాయకత్వము శత్రువులలో జర్మనీది. ఆస్ట్రియా, జెకో-స్లావేకియాలు జర్మనీలో అంతర్భూతమైనవి; ఈ యుద్ధారంభమున పోలెండు పరాజితమై జర్మనీలో కొంతయు రష్యాలో కొంతయు చేర్చుకోబడినది. కావున ఈ యుద్ధము ముగియువరకును పై నాలుగు దేశములతో మనకు గల వ్యాపారము పూర్తిగా నిలిచిపోవును; మన దేశమునుండి ఎగుమతులు కాని, ఆ దేశములనుండి దిగుమతులు కాని రా వీలులేదు. 3-వ పట్టికలో ౧౯౩౨ - ౩౩ మొదలు అయిదు సంవత్సరములపాటు, మన కాయా దేశములతో గల ఎగుమతి వ్యాపారము సరకువారీలెక్కలతో ఈయబడినది.

3-వ పట్టిక: ఎగుమతులు
(విలువ లక్షలరూపాయలలో ఈయబడినది.)

| సరకు | సంవత్సరములు | | | | |
|---|---|---|---|---|---|
| | ౧౯౩౨-౩౩ | ౧౯౩౩-౩౪ | ౧౯౩౪-౩౫ | ౧౯౩౫-౩౬ | ౧౯౩౬-౩౭ |
| **జర్మనీకి** | | | | | |
| ఎముకలు ... | ౩ | ౨ | ౩ | ౩ | ౮ |
| కాఫీ ... | ౯ | ౯ | ౩ | ౫ | ౩ |
| మందులు వగైరా | ౩ | ౩ | ౨ | ౪ | ౪ |
| రంగులు వగైరా | ౭ | ౬ | ౮ | ౮ | ౫ |
| నారలు ... | ౩ | ౩ | ౨ | ౩ | ౧ |
| తివుడు ... | ౭ | ... | ౧ | ... | ... |
| బియ్యము ... | ౧౫౫ | ౧౩౮ | ౮౮ | ౫౫ | ౩౯ |
| ఇతరధాన్యములు | ౨౫ | ౫ | ... | ౨ | ౯ |
| తినుబడు పదార్థములు ... | ౪ | ౫ | ౬ | ౪ | ౧౦ |
| తోళ్లు ... | ౨౦ | ౩౪ | ౨౯ | ౩౮ | ౪౪ |
| చర్మములు ... | ౯ | ౧౩ | ౪ | ౯ | ౧౧ |
| లక్క ... | ౧౪ | ౧౫ | ౧౯ | ౧౫ | ౨౩ |
| ఎరువులు ... | ౧ | ౧ | ౧ | ౧ | ౩ |
| లోహములు ఖనిజములు | ౩౯ | ౪౨ | ౪౦ | ౪౭ | ౫౪ |
| అభ్రకము ... | ౩ | ౪ | ౬ | ౭ | ౮ |
| చమురులు ... | ౪ | ౫ | ౫ | ౪ | ౨ |
| చమురుపిండి .. | ౪౭ | ౧౬ | ౨౦ | ౯ | ౨౬ |
| రబ్బరు (ముడి సరకు) ... | ... | ౧ | ... | ౫ | ౮ |
| నూనె గింజలు | ౧౦౭ | ౧౫౨ | ౮౯ | ౧౩౧ | ౨౦౪ |
| వాహన ద్రవ్యములు ... | ౪ | ౪ | ౨ | ౨ | ౧ |
| టీ ... | ౧ | ౨ | ౧ | ౧ | ౧ |
| ప్రత్తి ... | ౧౩౯ | ౨౧౬ | ౧౪౩ | ౨౭౪ | ౨౫౦ |
| జనపనార ... | ౨౧౨ | ౨౪౨ | ౨౦౧ | ౨౭౩ | ౨౩౬ |
| జనపనారతో తయారైనసరకులు | ౯ | ౫ | ౨ | ౫ | ౬ |
| ఉన్ని (ముడి సరకు) ... | ౧ | ౨ | ౧ | ౧ | ౩ |
| కలప ... | ౧ | ౩ | ౬ | ౧౧ | ౧౪ |
| మొత్తము* ... | ౮౫౯ | ౯౮౩ | ౭౧౭ | ౯౫౦ | ౧౦౦౩ |

* మొత్తములలో విడిగా చేర్చబడని ఇతర పదార్థముల విలువకూడ చేరియున్నది.

| సరకు | సంవత్సరములు ౧౯౩౨-౩౩ | ౧౯౩౩-౩౪ | ౧౯౩౪-౩౫ | ౧౯౩౫-౩౬ | ౧౯౩౬-౩౭ |
|---|---|---|---|---|---|
| **హోలెండుకు** | | | | | |
| బియ్యము ... | ౨౦ | ౧౭ | ౨౬ | ౩౪ | ౩౧ |
| ప్రత్తి ... | ౧ | ౧౯ | ౨౪ | ౩౨ | ౫౦ |
| జనపనార ... | ౨ | ౩ | ౪ | ౧౨ | ౧౭ |
| మొత్తము ... | ౨౩ | ౪౧ | ౫౭ | ౭౨ | ౧౦౮ |
| **ఆస్ట్రియాకు** | | | | | |
| జనపనార ... | ... | ... | ౧ | ౪ | ౩ |
| మొత్తము ... | ... | ... | ౧ | ౪ | ౩ |
| **జెకోస్లావేకియాకు** | | | | | |
| బియ్యము ... | ... | ... | ... | ౨ | ౮ |
| తోళ్లు ... | ౧ | ౧ | ౧ | ౨ | ౨ |
| చర్మములు ... | ౨ | ౪ | ౪ | ౨ | ౩ |
| రబ్బరు (ముడిసరకు) | ... | ... | ... | ౫ | ౫ |
| ప్రత్తి ... | ... | ... | ... | ౧ | ... |
| జనపనార ... | ... | ... | ౧ | ... | ౩ |
| మొత్తము ... | ౩ | ౫ | ౬ | ౧౨ | ౨౧ |
| ాలసదేశముల మొత్తము ... | ౭౭౫ | ౧౦౨౯ | ౮౭౨ | ౧౦౪౭ | ౧౧౩౪ |

పైపట్టికనుబట్టి జర్మనీయును, దానిలో చేరియున్న ఇతర దేశములును ఈమధ్య మన దేశమునుండి సుమారు ౧౧ కోట్ల రూపాయల విలువగల సరకులను దిగుమతి చేసికొనుచున్నవని తెలియగలదు. ఇట్టి దిగుమతులలో ముఖ్యమైనవి ప్రత్తి, జనపనార, నూనెగింజలు, తోళ్లు, చర్మములు, మొదలగునవి. ఈపదార్థములను మనము తదిర దేశములకు ఎగుమతి చేయగలిగిననే తప్ప మనకు నష్టము రాకమానదు.

పై దేశములనుండి ౧౯౩౨-౩౩ మొదలు అయిదు సంవత్సరములలో మన దేశమునకే యే దిగుమతులు ఎంత ఎంత వచ్చుచున్నవో ఈక్రిందిపట్టికలో చూపబడినవి.

౪-వ పట్టిక

దిగుమతులు

(లక్షల రూపాయలలో)

| సరకు | సంవత్సరము ౧౯౩౨-౩౩ | ౧౯౩౩-౩౪ | ౧౯౩౪-౩౫ | ౧౯౩౫-౩౬ | ౧౯౩౬-౩౭ |
|---|---|---|---|---|---|
| **జర్మనీనుండి** | | | | | |
| వెండి, బంగారు జరీ | ౩ | ౩ | ౩ | ౩ | ౩ |
| తుపాకులు, మందుగుండు సామాను | ౨ | ౨ | ౨ | ౨ | ౩ |
| యూక్సుప్లాస్ | ౧ | ౧ | ౧ | ౧ | ౧ |
| యంత్రముల బెల్టింగు | ౩ | ౨ | ౨ | ౨ | ౨ |
| జోళ్లు | ౧ | ౧ | ... | ... | ... |
| బ్రష్షులు | ౪ | ౩ | ౨ | ౩ | ౨ |
| రసాయనికములు | ౪౦ | ౩౪ | ౩౯ | ౪౫ | ౩౬ |
| మందులు | ౪౩ | ౪౩ | ౪౪ | ౫౪ | ౫౫ |
| రంగులు | ౧౩౮ | ౧౩౮ | ౧౯౨ | ౨౦౧ | ౧౯౦ |
| గాజు, గాజు సామానులు | ౧౭ | ౧౩ | ౧౪ | ౧౭ | ౧౬ |
| ఇనుప సామానులు | ౧౦౭ | ౭౬ | ౯౫ | ౧౦౭ | ౯౪ |
| సున్నితమైన[1] యంత్రములు | ౬౫ | ౫౬ | ౬౯ | ౮౪ | ౭౨ |

1. Instruments ; Apparatus etc.

| సరకు | సంవత్సరము ౧౯౩౨-౩౩ | ౧౯౩౩-౩౪ | ౧౯౩౪-౩౫ | ౧౯౩౫-౩౬ | ౧౯౩౬-౩౭ |
|---|---|---|---|---|---|
| మద్యములు | ౧౭ | ౧౫ | ౧౫ | ౧౬ | ౧౫ |
| యంత్రములు | ౯౮ | ౧౩౨ | ౧౨౭ | ౧౬౪ | ౨౦౩ |
| లోహములు | ౨౦౩ | ౧౩౬ | ౧౬౨ | ౨౩౦ | ౧౭౦ |
| నూనెలు | ౧౬ | ౮ | ౮ | ౧౫ | ౨౩ |
| నూనెరంగులు | ౧౧ | ౯ | ౯ | ౧౦ | ౯ |
| కాగితములు | ౩౦ | ౨౦ | ౨౬ | ౫౭ | ౭౧ |
| రబ్బరు సామానులు | ౧౫ | ౯ | ౧౩ | ౧౦ | ౧౯ |
| వ్రాత కాగితపు సరకులు 1 | ౧౬ | ౧౫ | ౧౮ | ౧౮ | ౧౭ |
| బట్టలు | ౯ | ౩ | ౪ | ౪ | ౫ |
| ఉన్ని బట్టలు | ౨౪ | ౧౬ | ౧౯ | ౧౩ | ౧౮ |
| పట్టుబట్టలు | ౫ | ౩ | ౪ | ౨ | ౩ |
| బండ్లు 2 | ౧౭ | ౨౨ | ౨౩ | ౫౩ | ౫౦ |
| కలపవగైరా | ౯ | ౮ | ౯ | ౭ | ౪ |
| మొత్తము * | ౧౦౩౯ | ౮౮౯ | ౧౦౧౦ | ౧౨౩౪ | ౧౨౧౩ |
| **పోలెండునుండి** | | | | | |
| లోహములు | ౯ | ౯ | ౯ | ౪ | ౭ |
| ఉన్ని బట్టలు | ౮ | ౫ | ౬ | ౮ | ౮ |
| కలప | ౪ | ౩ | ౩ | ౪ | ౪ |
| మొత్తము | ౨౩ | ౧౯ | ౨౫ | ౧౯ | ౨౭ |
| **ఆస్ట్రియానుండి** | | | | | |
| గాజు, గాజు సామానులు | ౨ | ౨ | ౨ | ౧ | ౧ |
| ఇనపసామానులు | ౫ | ౪ | ౪ | ౩ | ౩ |
| పనిముట్లు3 | ౩ | ౨ | ౨ | ౨ | ౨ |
| యంత్ర సామగ్రి | ౧ | ౧ | ౩ | ౩ | ౪ |
| లోహములు | ౫ | ౪ | ౩ | ౩ | ౨ |
| కాగితములు | ౨౯ | ౨౫ | ౨౧ | ౧౪ | ౯ |
| బట్టలు | ౧౦ | ౨ | ౯ | ౮ | ౯ |
| మొత్తము | ౬౫ | ౫౨ | ౫౩ | ౪౩ | ౩౮ |
| **జెకోస్లావేకియానుండి** | | | | | |
| టోపీలు | ౩ | ౩ | ౪ | ౧ | ౧ |
| జోళ్లు | ౫ | ౬ | ౭ | ౮ | ౮ |
| బొత్తాములు | ౫ | ౫ | ౬ | ౪ | ౪ |
| గాజు, గాజు సామానులు | ౨౩ | ౨౦ | ౧౯ | ౨౦ | ౨౦ |
| ఇనప సామానులు | ౯ | ౮ | ౯ | ౯ | ౬ |
| పనిముట్లు | ౩ | ౩ | ౪ | ౨ | ౩ |
| యంత్ర సామగ్రి | ౪ | ౧౫ | ౬ | ౪ | ౮ |
| లోహములు | ౭ | ౮ | ౧౩ | ౬ | ౬ |
| కాగితములు | ౫ | ౪ | ౧౧ | ౭ | ౬ |
| ఉన్ని బట్టలు | ౬ | ౧ | ... | ... | ... |
| మొత్తము | ౭౮ | ౮౦ | ౩౮ | ౬౮ | ౭౮ |
| నాలుగు దేశముల మొత్తము | ౧౧౯౫ | ౧౦౪౦ | ౧౧౨౬ | ౧౩౬౪ | ౧౩౫౬ |

16 11 13

౧౯౩౬-౩౭-వ సంవత్సరమున జర్మనీయును దానికి సంబంధించిన పై మూడు దేశములును మన దేశమునుండి సుమారు ౧౧ కోట్ల రు. విలువగల సరకులను ఎగుమతి చేసికొని తత్ప్రత్యామ్నాయముగ సుమారు ౧౩⅓ కోట్ల రూపాయల విలువగల సరకులను మనకు దిగుమతిచేసినవి. గత మహాసంగ్రామమునకు పూర్వము జర్మనీదేశము మనకు దిగుమతులను విరివిగా పంపుచుండెడిది; ఇప్పుడు జపాను ఆక్రమించుకొనిన స్థానము అప్పుడు జర్మనీదేశమునకు చెందినది; కాని గత యుద్ధమున జర్మనీతో వ్యాపారము

1. Stationery.
2. Vehicles.
3. Instruments.

* మొత్తములో ఇందులో వివరము లేనట్టి ఇతర సరకుల విలువకూడ చేరియున్నది.

లిచిపోవుటచే జపానునుండి దిగుమతులు పెరిగినవి. ఈమధ్య మరల జర్మనీ పూర్వపు స్థాన మాక్రమించక పోయినను, గత అయి దారు సంవత్సరములనుండియు మన దేశమునకు తన దిగుమతులను క్రమముగా హెచ్చుచేయ నారంభించినది. ౧౯౩౨ ౩౩-వ సంవత్సరముతో పోల్చి చూచితిమేని ౧౯౩౭-౩౮-వ సంవత్సరమున జర్మనీ దేశపు దిగుమతులు నూరింట ౧౮ పాళ్లు పెరిగినవి. మనము జర్మనీ దేశమునకు పంపు ఎగుమతుల విలువకూడ ఆవరుసనే పెరిగినది కాని మొత్తముమీద మనతో వ్యాపారము జర్మనీకే లాభదాయకముగా నుండెను.

జర్మనీతోడను, తత్సంబంధ దేశములతోడను వ్యాపారము నిలిచిపోవుటచే ఎగుమతులును, దిగుమతులును చేర్చి సుమారు ఇరువదియైదు కోట్ల రూపాయలవరకును మన విదేశ వ్యాపారము సంకుచితము కాగలదు. ఇదిగాక పైన జెప్పిన తీరున ఇతర దేశములతో వ్యాపారము సహితము తగ్గిపోవును. మొదటి పట్టికనుబట్టి ౧౯౧౪-౧౫-వ సంవత్సరమున ఆఖరు ఎనిమిది మాసములలోను యుద్ధము కారణముగా ఎగుమతులలో ౮౧ కోట్లవరకును, దిగుమతులలో ౪౪ కోట్లవరకును, అనగా మొత్తముమీద విదేశ వ్యాపారము ౧౨౫ కోట్ల రూపాయలవరకును తగ్గిపోయినదని తెలియగలదు. గత యుద్ధమున ఈ తగ్గుదల అంతటితో సరిపోలేదు. ౧౯౧౫-౧౬-వ సంవత్సరమును ౧౯౧౩-౧౪-వ సంవత్సరముతో పోల్చి చూచినట్లయిన ఎగుమతులలో ౫౨ కోట్లవరకును, అనగా మొత్తముమీద ౧౦౪ కోట్లవరకును వ్యాపారము కుదించిపోయినది; యుద్ధము ప్రారంభమయిన మరుసటి సంవత్సరము వ్యాపారము కొలదిగా కోలుకొనినను ఎగుమతి దిగుమతులలో విస్తారము తగ్గుదల యట్లే నిలిచిపోయినది. యుద్ధాంతమువరకును ఆ పరిస్థితు లట్లే యున్నవని చెప్పవచ్చును.

కాబట్టి ఈ యుద్ధసమయమునగూడ ఏవో కొలదిమార్పులతో మన దేశము యొక్క విదేశవ్యాపారము వెనుకటి పరిస్థితులనే యనుసరించు నని మన మూహింపవచ్చును. విదేశవ్యాపారము కొంతవరకు తగ్గిపోవును; అందువలన దేశములో వ్యాపారముకూడ కొంత తగ్గగలదు. ఎగుమతి కావలసిన సరకులు ఎగుమతులు నిలచిపోవుటచే నిలవయుండి వానిధర మందగించును; దిగుమతుల ధరలు హెచ్చగును. తత్ఫలితముగ అంతకుముందు విదేశములనుండి తెప్పించుకొనుచున్న సరకులను స్వదేశముననే తయారుచేయుటకు వీలైన పరిస్థితు లేర్పడును. విదేశములలో తయారయి మన దేశమునకు దిగుమతియగు సరకులను మన దేశములోనే తయారుచేసికొనవలెనని సాధారణ పరిస్థితులలో వానిని విదేశములతో పోటీ చేయగలిగినంత తక్కువ ధరలకు తయారు చేయవలసియుండును; లేకున్న ప్రభుత్వము రక్షణ సుంకములను విధించి దేశీయోద్యమమునకు ప్రోత్సాహ మొసగవలెను. కాని యుద్ధసమయమున విదేశములపోటీ చాలవరకు తగ్గిపోవుటచే రక్షణ సుంకముల యవసరము లేకయే మన దేశమున క్రొత్త పరిశ్రమలను నెలకొల్పి మనకవసరమగు సరకులను తయారుచేసికొనవచ్చును.

పైవిషయముకందలి నిజము గత యుద్ధమున మనపరిశ్రమ లెట్లభివృద్ధి నొందినవో చూచినట్లయిన ధృవపడగలదు. అంతకు ముందు, మనము మనకు కావలసినబట్టలు, పంచదార, కాగితములు, సిమెంటు, ఇనుము, ఉక్కు, అగ్గిపెట్టెలు ఇవన్నియును విదేశములనుండి తెప్పించుకొనుచుండెడివారము, గతయుద్ధమున మనకు బట్టలకును అగ్గిపెట్టెలకును కఱవువచ్చినదని చెప్పవచ్చును. కాని ఈక్లిష్టపరిస్థితులు దేశీయోద్యమములకు సహకారులై దేశీయ పరిశ్రమలు పుట్టుటకు కారణమైనవి. ఇప్పుడన్ననో మనకు కావలసిన పంచదార, అగ్గిపెట్టెలు పూర్తిగా ఇచ్చటనే తయారగుచున్నవి. బట్టలు, ఇనుము, ఉక్కు, సిమెంటు, కాగితములు, — వీనిలో చాలవరకును, మనమే తయారుచేసికొనుచున్నాము కాని, ఇంకను మనము విదేశములపై నాధారపడవలసిన దురవస్థ తొలగిపోలేదు. మన మారంభించి వృద్ధి నొందించుకొనవలసిన పరిశ్రమ లెన్నియో యున్నవి. విదేశపు సరకుల ధరలు పెరుగుచుండుటచే వానికొరకై మనము క్రొత్త పరిశ్రమలను లేవదీయుట కిది చాల చక్కని యదను.

ఈక్రిందిపట్టికలో ౧౯౩౩-౩౪ మొదలు ౧౯౩౭-౩౮ - వ సంవత్సరమువరకును మనము విదేశములనుండి దిగుమతి చేసికొనుచున్న వస్తువుల విలువ సరకువారిగా సీయబడినది. ఈపట్టికను జాగ్రత్తగా పరిశీలించి చూచికొనినట్లయిన ఏనూతన పరిశ్రమల కవకాశ మున్నదియు విశదమగును.

౫-వ పట్టిక

(విలువ లక్షల రూపాయలలో నీయబడినది.)

| సరకు | సంవత్సరము | | | | |
|---|---|---|---|---|---|
| | ౧౯౩౩-౩౪ | ౧౯౩౪-౩౫ | ౧౯౩౫-౩౬ | ౧౯౩౬-౩౭ | ౧౯౩౭-౩౮ |
| ౧. ఆహార పదార్థములు, మద్యము, పొగాకు | | | | | |
| ధాన్యము పప్పులు వగైరా ... | ౮౪ | ౨౬౬ | ౧౬౨ | ౭౨ | ౧౨౧౭[1] |
| మద్యము ... | ౧౭౯ | ౧౮౬ | ౧౯౯ | ౧౯౨ | ౧౮౩ |
| ఇతర ఆహార పదార్థములు... | ౨౭౨ | ౨౮౯ | ౩౧౨ | ౩౨౦ | ౨౬౦ |
| పంచదార ... | ౨౭౧ | ౨౧౧ | ౧౯౧ | ౨౪ | ౧౯ |
| పొగాకు ... | ౭౨ | ౬౨ | ౬౨ | ౮౧ | ౮౫ |
| మొత్తము 2 ... | ౧౨౨౪ | ౧౩౮౭ | ౧౩౨౨ | ౧౧౧౫ | ౨౯౮౭ |

1. బర్మాచేర్చి.    2. మొత్తములలో వివరము వ్రాయబడని ఇతరపదార్థముల విలువ చేరియున్నది.

| సరకు | సంవత్సరము | | | | |
|---|---|---|---|---|---|
| | ౧౯౩౩–౩౪ | ౧౯౩౪–౩౫ | ౧౯౩౫–౩౬ | ౧౯౩౬–౩౭ | ౧౯౩౭–౩ |
| **౨. ముడిదినుసులు** | | | | | |
| ఖనిజాదులు ... | ౧౨౨ | ౯౬ | ౧౦౪ | ౧౫౪ | ౨౦౦ |
| చర్మములు (ఖనిజ, వృక్ష, జంతు సంబంధములు) ... | ౬౭౫ | ౬౯౭ | ౭౨౫ | ౭౨౫ | ౧౮౭౦[1] |
| కాగితములు తయారు చేయుటకు ముడిదినుసులు ... | ౨౭ | ౨౭ | ౨౦ | ౧౫ | ౧౮ |
| గింజలు ... | ౪౪ | ౪౫ | ౮౨ | ౧౧౩ | ౧౦౬ |
| ముక్కిప్రత్తి ... | ౩౫౬ | ౫౨౮ | ౬౭౪ | ౫౮౫ | ౧౨౧౩ |
| ముడి పట్టు ... | ౭౨ | ౫౭ | ౫౮ | ౬౪ | ౯౫ |
| ముడి ఉన్ని ... | ౩౪ | ౪౧ | ౪౪ | ౬౦ | ౮౫ |
| మొత్తము ... | ౧౫౨౨ | ౧౭౧౨ | ౧౯౧౬ | ౧౯౪౨ | ౪౦౯౪ |
| **౩. తయారైన సరకులు** | | | | | |
| ఆయుధములు ... | ౪౩ | ౪౩ | ౪౯ | ౬౬ | ౧౨౮ |
| రసాయనికములు ... | ౪౯౭ | ౫౨౧ | ౫౬౧ | ౫౧౭ | ౬౦౬ |
| ఇనుపసామానులు, పనిముట్లు | ౫౦౪ | ౫౪౪ | ౫౮౫ | ౫౭౮ | ౬౮౪ |
| రంగులు ... | ౩౪౫ | ౪౧౦ | ౪౩౯ | ౪౦౧ | ౪౯౯ |
| ఎలెక్ట్రిక్ సామానులు ... | ౨౩౧ | ౨౮౧ | ౩౦౮ | ౩౦౪ | ౩౪౭ |
| గాజు, పింగాణి వగైరా సామానులు ... | ౧౬౬ | ౧౭౭ | ౧౮౬ | ౧౭౫ | ౨౦౦ |
| యంత్ర సామగ్రులు ... | ౧౩౩౮ | ౧౩౨౮ | ౧౪౩౮ | ౧౪౭౮ | ౧౭౯౯ |
| పదునుచేసిన తోళ్లు ... | ౪౭ | ౫౪ | ౫౫ | ౫౧ | ౬౬ |
| ఇనుము, ఉక్కు ... | ౫౫౨ | ౬౩౮ | ౭౨౨ | ౫౯౪ | ౮౨౦ |
| ఇతర లోహములు ... | ౩౯౫ | ౪౯౯ | ౪౮౦ | ౩౭౩ | ౫౧౦ |
| కాగితములు, అట్టలు ... | ౩౨౯ | ౩౪౨ | ౩౭౫ | ౩౫౭ | ౪౯౬ |
| రబ్బరు ... | ౧౮౮ | ౨౦౬ | ౨౦౭ | ౨౧౧ | ౧౮౯ |
| బండ్లు [2] ... | ౪౭౭ | ౬౬౦ | ౬౯౨ | ౬౫౮ | ౮౯౨ |
| నూలు, బట్టలు ... | ౧౭౭౪ | ౨౧౭౬ | ౨౧౧౫ | ౧౭౪౮ | ౧౫౫౫ |
| పట్టు బట్టలు ... | ౨౮౭ | ౨౮౦ | ౨౨౦ | ౧౭౭ | ౧౯౧ |
| ఉన్ని బట్టలు ... | ౨౨౧ | ౩౪౫ | ౨౩౪ | ౨౨౭ | ౩౩౦ |
| ఇతర బట్టలు ... | ౭౫౨ | ౫౩౯ | ౪౭౫ | ౫౭౩ | ౬౪౭ |
| మొత్తము ... | ౮౫౨౧ | ౯౮౫౧ | ౯౯౩౬ | ౯౨౪౦ | ౧౦,౮౦౭ |
| దినుసు లన్నిటి మొత్తము ... | ౧౧,౫౩౬ | ౧౩,౨౨౯ | ౧౩,౪౪౨ | ౧౨,౫౨౪ | ౧౭,౩౭౯ |

1. బర్మా చేర్చి. 2 Vehicles

ఆహారపదార్థముల తరగతిలో గమనించవలసినవి, మద్యము, పొగాకు, మద్యపదార్థముల దిగుమతులను తగ్గించుట కంతవీలు గాకపోవచ్చును. మన దేశమున యూరపియనులు కొంద రుండుటచే వారు యూదేశపు మద్యములను వాంఛింతురు ; కాని, పొగాకు విషయమున స్వదేశపు పరిశ్రమ నభివృద్ధి గావించుటకును మంచిరకము సిగరెట్లు నిచ్చుటనే తయారుచేయుటకును మనము యత్నించవలసియున్నది; ఏలనన అందులకు గావలసిన పొగాకు మనమే పండించుచున్నాము; సిగరెట్లనుకూడ మనమే తయారు చేసికొనుట ఉత్తమము. పరిశ్రమల విషయమును గూర్చి మాటలాడునప్పుడు ముడిపదార్థముల దిగుమతులను గూర్చి అంతగా చెప్ప నవసరము లేదు. దేశీయ పరిశ్రమ లభివృద్ధినొందినకొలదిని, మనకు వలయు ముడిపదార్థములను దేశములోనే పడయుటకు యత్నములు జరిగితీరును. ఆప్రయత్నము లెంతవరకు ఫలించునదియు, దేశముయొక్క ఖనిజసంపత్తినిబట్టియు, మన పారిశ్రామికుల బుద్ధి ప్రతిభనుబట్టియు నుండును.

తయారైన సరకులు (manufactured articles) అను విభాగమును పరిశీలింతుమేని పరిశ్రమలవిషయమున మనదేశ మెంత వెనుకబడియున్నదియు తేలగలదు. ప్రతి సాలునను మనము ౧౦౦ కోట్ల రూపాయల విలువగల తయారైన - సరకులను తెప్పించుకొనుచున్నాము, అనగా ఇంతధనము విదేశములకు పంపి మనభాగ్యమును క్షీయింపజేసికొనుచున్నాము.

మన దేశమున ఇనుము ఉక్కు పరిశ్రమ మంచి యభివృద్ధిగాంచుచున్నను యంత్రనిర్మాణ పరిశ్రమ[1] మాత్రము పేరునకైనను లేదు. ప్రతి సాలునను మనము సుమారు పదునైదుకోట్ల రూపాయల విలువగల యంత్ర సామగ్రిని విదేశములనుండి తెప్పించుకొనుచున్నాము. యుద్ధ సమయమున మన పరిశ్రమల నభివృద్ధిగావించుకొనుట కిది యొక పెద్ద యాటంకము; ఏమనగా క్రొత్త పరిశ్రమ ప్రారంభించుటకు పూర్వము దానికి వలయు యంత్రములు విదేశములనుండి రావలెను; అందుల కవకాశములు తక్కువగుటయే గాక వాని విలువకూడ తత్సమయమున హెచ్చుగా నుండును. అయినను మన పరిశ్రమాధికారులు పౌరవచేసి, యంత్రనిర్మాణమునకు వలయు పరిశ్రమల నారంభింపవలయును. ఈవిషయమున టాటా కంపెనీవారు ముందడుగిడుటకు సమర్థులై యున్నారు. ఇది చాల ముఖ్య విషయము. ఈకాలమున ఏపరిశ్రమకైనను ముడిపదార్థము లెంత యవసరమో సరియగు యంత్ర సామగ్రి అంతకంటె యెక్కువ యవసరము.

యంత్ర నిర్మాణమునకు పిదప ముఖ్యమైనది మోటారు పరిశ్రమ. ఆమధ్య, సర్ యమ్. విశ్వేశ్వరయ్యగారు సూచించినట్లు బొంబాయిలో మోటారులు తయారుచేయు యంత్రశాలను మనము నిర్మించికొనియుండినట్లయిన, గత యుద్ధములో ఇనుము ఉక్కు పరిశ్రమ కాలు నిలద్రొక్కుకొనగలిగినట్లే

1. Engineering Industries.

ఈయుద్ధమున, మోటారు పరిశ్రమయు ముందడగు వైచియుండెడిది. ౧౯౩౭–౩౮-వ సంవత్సరమున మనము ౨౮౩ కోట్ల రూపాయల విలువగల మోటారు కారులను దిగుమతిచేసుకొనియున్నాము

ఇట్లే, విద్యుచ్ఛక్తి సామగ్రులు, (Electrical goods and appliances, అనగా, ఎలక్ట్రిక్ బల్బులు, తీగలు, పంకాలు మొదలగునవి) వ్యవసాయపు పనిముట్లు యంత్రములు, రసాయనిక పదార్థములు, మందులు, ఇనప సామానులు పనిముట్లు, రంగులు మొదలగు నవన్నియును మనము తయారుచేయుట కీ సమయమున యత్నించవచ్చును.

మన మింకను పచ్చితోళ్లను పదును చేయుటకు విదేశములకు పంపుచున్నాము. ఇప్పుడైనను మనతోళ్లను మనమే పదును చేసికొనుటకు గట్టిపట్టుదలతో పనిచేయ వచ్చును.

పైనచెప్పినవి గాక రెండు ముఖ్యమైన పరిశ్రమలనుగూర్చి కొంచము చెప్పవలసి యున్నది. ఇం దొకటి రైలు సామగ్రులను తయారుచేయుట, రెండవది యుద్ధ పరికరములను తయారుచేయుట. ఈరెండింటికిని వ్యక్తి సాహసముకంటె ప్రభుత్వ ప్రోత్సాహమే ఎక్కువగా కావలసియున్నది. ఈక్లిష్టసమయముననైనను ఇండియా ప్రభుత్వము తన ధర్మమును గుర్తెరిగి రైలుసామగ్రులను మనదేశములోనే తయారు చేయించుటకు యత్నించునని నమ్మవచ్చును. ఇక యుద్ధ పరికరముల విషయ మన్ననో అది కేవలము ప్రభుత్వేచ్ఛపై నాధారపడియున్నది. మన దేశమున అట్టి పరిశ్రమ ఇంతవరకును లేకత్తకుండుటకు ప్రభుత్వమునకు ప్రజలపై విశ్వాసము లేకుండుటయే కారణమని చెప్పవచ్చును. కెనడాయును, మనకంటె దూరమునయున్న ఆస్ట్రేలియాయును ప్రస్తుతము బ్రిటనుకు ఆయుధసామగ్రులను నిర్మించి ఇచ్చుచున్నవి. మనదేశము ముడి పదార్థములలోనేమి, మనుష్యబలముననేమి వానికి తీసిపోదు. అయినను మన మూరకుండ వలసివచ్చుటకు కారణము ప్రభుత్వము యొక్క ఉదాసీనతయే.

పైన చెప్పినవిగాక కొద్ది సాహసముతో మనమే తయారు చేసుకొనుటకు యత్నించ దగిన వస్తువులు కొన్నిగలవు. ౧౯౩౭-౩౮-వ సంవత్సరమున మనము ౬౭ లక్షల రూపాయల విలువగల దేహాలంకారమున కుపయోగించు సామగ్రులను (toilet requisites) దిగుమతి చేసుకొనినాము. ఒకింత పరిశోధనతో మన పెట్టుబడిదారులు వీనిలో చాలభాగము మన దేశముననే తయారు చేయింపవచ్చును. ఇట్లే మనము దిగుమతి చేసికొనుచున్న ౧౮ లక్షల రూపాయల విలువగల గొడుగులను, ౪౪ లక్షల రూపాయల విలువగల పిల్లల ఆటవస్తువులను మన దేశముననే చేయుటకు గట్టి ప్రయత్నము చేయవచ్చును.

గత యుద్ధసమయమున కంటె ఈ యుద్ధ సమయమున నూతన పరిశ్రమలను స్థాపించుటకు మన కవకాశ మెక్కువగా నున్నదని చెప్పవచ్చును. ఆ సమయమునకంటె ఇప్పుడు మన పెట్టుబడిదారుల కనుభవ మెక్కువగా నున్నది. గత ఇరువది సంవత్సరములలోను కొన్ని నూతన పరిశ్రమలను ప్రారంభించి మొదట చిక్కులకు లోనైనను క్రమముగా

వారు వానిని మంచి స్థితికి తీసుకొనివచ్చినారు. అయినను మన పెట్టుబడిదారుల కొకప్రక్క బెదురున్నది. మనకంటె జపాను పరిశ్రమలలో ముందంజవేసినది. యంత్ర నిర్మాణమునను, యంత్రోపయోగములందను బాగుగా ఆరితేరిన యూరపియను దేశములనే జపాను పల్లీటీలు కొట్టించి ఆ దేశములలో తాను నిర్మించిన సరకులను గొనిపోయి చౌకగా అమ్ముచున్నది. యూరపియను దేశములకంటె జపాను మనకు సమీపములో నున్నది. అట్టితఱి జపాను మన నూతనపరిశ్రమలకు పుట్టినవెంటనే గొంతుకలో వడ్లగింజ వేయఁడా యన్నసంశయము పెట్టుబడిదారులకు కలుగవచ్చును. సాధారణ పరిస్థితులలో ఈవిషయ మాలోచనీయమే గాని జపాను ప్రస్తుతము చైనాతో యుద్ధమందు తగుల్కొనియుండుటచే మన పరిశ్రమలతో పోటీ చేయుటకు జపానువారికి అవకాశము తక్కువ. యూరపియను దేశములవలెనే వారును యుద్ధ సమస్యలలో మునిగి తేలుచుందురు. అందుచేత జపానువలని భయము లేకుండ క్రొత్తపరిశ్రమలను ప్రారంభింపవచ్చును. ఇందుల కవసరమైనది సాహస మొక్కటే; ఇనుము, ఉక్కు పరిశ్రమను స్థాపించిన తాతావంటి మహానుభావుల యవసర మిప్పుడు మన దేశమున కెంతయో యున్నది.

### పర్యవసానము

యుద్ధమువలన విదేశ వ్యాపారము, అనగా ఎగుమతులును దిగుమతులును కొంతవరకు తగ్గగలవు. దిగుమతులను పంపుదేశములు యుద్ధములో చిక్కుకొనుటచేతను ఇతర కారణములచేతను, విదేశములనుండి వచ్చెడి దిగుమతుల విలువ హెచ్చుగా నుండును. ఈ కారణమువలన మన దేశమునందే మన మిప్పు డితరదేశములనుండి తెప్పించుకొనుచున్న సరకులను తయారు చేసికొనుట కవకాశము లభించును. విదేశముల పోటీ తగ్గుటచే రక్షణసుంకములు లేకయే క్రొత్త దేశీయ పరిశ్రమలను స్థాపించుటకును ఉన్న వానిని వృద్ధినొందించుటకును ఇది మంచి తరుణము. జపాను చైనాయుద్ధములో చిక్కుకొనియుండుటచే మన మిప్పుడు జపాను పోటీకి భయపడ నక్కరలేదు. యంత్ర నిర్మాణము, మోటారుకారులు, బస్సులు, విద్యుచ్ఛక్తి సామగ్రులు, ఇనుప సామానులు, రంగులు, మందులు, రబ్బరు సరకులు మొదలగున వెన్నియో మనము తయారుచేసికొనుటకు కావలసిన పరిశ్రమలను స్థాపించుట కవకాశమున్నది. రైల్వేలకు వలయు సామానులును, ఆయుధములు, మందుగుండు మొదలగు యుద్ధపరికరములును ప్రభుత్వప్రోత్సాహమున్నయెడల మనమే తయారుచేయవచ్చును. ఈ రెంటింటి విషయమునను వ్యక్తి బాధ్యతకంటె ప్రభుత్వమునకే ఎక్కుడు బాధ్యత కలదు. మిగిలిన పరిశ్రమల విషయమున మన పెట్టుబడిదారులు సాహసించి గట్టి ప్రయత్నము చేయవలసియున్నది. అట్లు చేసినట్లయిన ఈ యుద్ధమువలన మనకు కొంత లాభ మొనగూడగలదు.

---



**శ్రీ సూరి నారాయణమూర్తిగారు**

మదరాసులోని ఆల్ ఇండియా రేడియో కార్యాలయమున ప్రోగ్రాం అసిస్టెంటుగ నున్న వీరు శ్రీ పి. వి. ఆచార్యగారి స్థానమున గతనెలనుండి అఫీషియేటింగు ప్రోగ్రాము డైరెక్టరుగ నియమింపబడిరి.

# భారతదేశము: లక్క పరిశ్రమ

శ్రీ వడ్డాది రామారావు

### లక్క పుట్టుపూర్వోత్తరాలు:

లక్కకు పుట్టిల్లు భారతభూమి. లక్క క్రొత్త పదార్థమేమీ కాదు. పూర్వంనుండి భారతీయులకు పరిచయమైన వస్తువే. మహాభారతంలో చెప్పబడిన, పాండవులు వసించుటకై కౌరవులు నిర్మించిన 'లాక్ష గృహము'నుబట్టి లక్కయొక్క పురాతనత, ఉపయోగం విశదమవుతుంది. సంస్కృత శబ్దమైన 'లక్ష'నుండి ఉత్పత్తి అయింది లక్క యనేపదం. లక్షలకొలది లక్కపురుగులచే స్రవింపబడిన దానివలనో లేక, అధర్వణ వేదంలో, లక్కను పండించు మోదుగ చెట్టు 'లక్షతరువు'గా చెప్పబడిన కారణంచేతనో లక్క యను పదం వాడుకలోకి వచ్చింది. క్రీ.శ. ౮౦-వ సంవత్సరంలో రచింపబడిన 'పెరిప్లస్' (Periplus) యనే గ్రంథంలో, హిందూదేశంనుండి లక్కరంగు ఎర్రసముద్ర తీరమునకు ఆఫ్రికాఖండంలోని 'అదులి' (Aduli)కి ఎగుమతి చేయబడినదని వ్రాయబడియున్నది. మరియు, క్రీ. శ. ౧౫౦ లో ఏరియన్ (Aerian) అను చరిత్రకారుడు, తన గ్రంథంలో, భారతదేశంలో నానావిధమైన పురుగు రంగుపదార్థము దొరుకునని వ్రాసియున్నాడు. ౧౫౬౩లో గ్రేసియా డీ ఆర్టా (Gracia de orta) యను వైద్యుడు (హిందూదేశంలోనున్న పోర్చుగీసు గవర్నరుకి వైద్యుడు) లక్కను మొట్టమొదట పరిశీలించి, దానిలో నున్న లక్కజిగురుయొక్కయు, లక్కరంగు యొక్కయు ఉపయోగములు విశదంగా వ్రాసియున్నాడు. తరువాత, ౧౫౯౦లో వెలువడిన 'ఐన్ - ఇ - అక్బరి' (Ain-i-Akbari) యను గ్రంథంలో అక్బరు కాలంలో లక్క జిగురుతో రంగు మొదలైన తదితర పదార్థములను చేర్చి వార్నిషు చేయబడిన విరులు చాపలు ప్రభుత్వపు కచేరీలలోను, మహళ్లలోను వాడుకలో నుండినట్లు వ్రాసియున్నది. ౧౫౯౬లో పోర్చుగీసు రాజుచే ఈస్టు - ఇండీస్ (East-Indies) కు పంపబడిన జాన్ హైగ్లెన్ (Jan Huyglen Van Linschoten) యను శాస్త్రజ్ఞుడు విశదంగా లక్కజిగురునుగూర్చి వ్రాసియున్నాడు. ౧౬౭౬లో టెవర్నియర్ (Tavernier) యనువానితడు లక్కరంగు హిందూదేశంలో, 'క్యాలికో - అద్దకపు' (Calico-printing) లోను, లక్కజిగురు పాలిషుల లోను (polishes), ముద్రవేయు లక్కకడ్డీలలోను (sealing - waxes) ఉపయోగపడుచుండె నని వ్రాసియున్నాడు.

ఇప్పటివరకు కూడ లక్కజిగురు హిందూదేశంలో ముద్రవేయు లక్కకడ్డీలపరిశ్రమ (sealing wax) యందును, కర్రవస్తువులకు వేయు పాలిషు (polish for furniture)యందును, ఫోనోగ్రాఫు ప్లేట్ల పైనను, ఆట వస్తువులపైని రంగుగాను, బంగారు వెండి వస్తువులలో నింపుటకును (filler) ఉపయోగపడుచున్నది.

### లక్కరంగు-ఒకనాటి భారతీయపరిశ్రమ :

మొట్టమొదటలో లక్కపరిశ్రమ ప్రాముఖ్యానికి రావడానికి లక్కరంగుపదార్థమే కారణం. లక్క, జిగురు, రంగు క్రొవ్వులో కూడుకొనియున్నది. రంగు జిగురు అధికంగాను, క్రొవ్వుమట్టుకు కొద్దిగాను (నూటికి ౫పాళ్లలోపు) వున్నవి. లక్క ప్రకృతినుండి వచ్చు జిగురులలో (natural resins) ముఖ్యస్థానం ఆక్రమిస్తోంది. ఈ లక్కజిగురు లక్కపురుగుచే చెమటవలె స్రవింపబడుతోంది. జిగురుతోపాటు ఎర్రనిరంగు తెల్లని క్రొవ్వుకూడ స్రవింపబడుచున్నాయి. సుమారు అర మిల్లీమీటరు (౧/౫౦ అంగుళము) పొడుగు గల్గిన లక్క పురుగులు కోట్లుగా గుంపులు గూడి యేచోట ౬౦,౦౦౦-

౫౦,౦౦౦ టన్నుల లక్క తయారుచేయుచున్నవి. ఈ మొత్తం లక్క ఉత్పత్తికి ౧,౫౦౦,౦౦౦,౦౦౦,౦౦౦ ఆరులక్క పురుగులు కారణమని లెక్క వేయబడినది. ఈ పురుగులు కొన్ని చెట్లపైని, కొన్ని పొదులపైని ఉండి రసమును పీల్చుచు, తమ జీవనము నడుపుచుండును. లక్క అనేక చెట్లపై పండును కాని ముఖ్యంగా కుసుమ, మోదుగ, రేగు, కంది, జల్ల మొదలైన చెట్లపై ఎక్కువగా పండును. తొలి, లక్క రంగు పదార్థంగురించి మాత్రమే లక్క పండింపబడెను. అంతకుపూర్వం, మెక్సికో దేశంలో ఒకపురుగునుండి వచ్చిన 'కొచీనియల్' (Cochineal) రంగుపదార్థం వాడుకలో నుండెను. ఈ 'కొచీనియల్' రంగుపదార్థం పరిశ్రమలలోను, వ్యాపారంలోను అత్యావశ్యకంగా కనపడుటచేత, లక్క రంగు పదార్థంగూడ, 'కొచీనియలు'కు బదులు వుపయోగపడ వచ్చునని మనదేశస్థులకు గోచరించింది. కొంచెం కొచీనియల్ కంటె గుణహీనమైనప్పటికి, ఉపయోగంలో దానికి ఎంతమాత్రం తీసిపోకయు, పైగా చాల చవుకగాను తయారగుటవలన ౧౬-వ శతాబ్దంనాటికి, లక్క రంగుపరిశ్రమశాలలు స్థాపింపబడెను అంతవరకు లక్క పరిశ్రమ ఆర్థికంగా లాభించలేదు. ౧౯-వ శతాబ్దంనాటికి, లక్క రంగుపదార్థాన్ని కణికలుగా జేయుమార్గము కనిపెట్టబడి, అటుపిదప, పరిశ్రమ పెద్దదై, వ్యాపారం విస్తీర్ణంగా పెంపొందింది. అప్పుడు లక్క జిగురు (lac resin) పదార్థం రంగుపరిశ్రమయందు ఉపపదార్థంగా తయారగుచుండెడిది. కాని దానికి ప్రాముఖ్య మేమియు లేదు.

కాని, నానాటికి విజ్ఞానం ప్రబలుచు వచ్చెను. రసాయనంలో అనేకపరిశోధనలు చేయబడుచుండెను. రసాయన వైజ్ఞానికులు ఎన్నో రంగులు (synthetic dyes) రసాయన సమ్మేళనముచే కనిపెట్టుట మొదలిడిరి. అందు ముఖ్య రసాయనవేత్త యగు పెర్కిన్ (Perkin) 'అనిలీన్' రంగులను (Aniline dyes) కనిపెట్టిన తదుపరి, 'అలిజరీన్' రంగులు కనిపెట్టబడిన పిదప, లక్క రంగు పరిశ్రమ, కొచీనియల్ రంగు పరిశ్రమలు క్షీణించెను. కాని, లక్క రంగుయొక్క ఉపయోగార్థమై చేయబడుచున్న పరిశోధనలమూలమున, లక్క జిగురు వాడుకలోనికి వచ్చి, దానితో పాటు లక్క పరిశ్రమ పెంపొందెను. ఒకనాటి లక్క రంగుపరిశ్రమ నేడు జిగురు పరిశ్రమగా మారిపోయినది.

## లక్క పురుగు జీవితం - లక్క పండించు విధం:

లక్క పరిశ్రమను గూర్చి వివరించునపుడు లక్క ఉత్పత్తికి కారణభూతమైన లక్క పురుగు జీవితమును గూర్చి, లక్క పండించు మార్గమును గూర్చి క్లుప్తంగా చెప్పుట ఆవశ్యకం. ఎర్రని రంగు గలిగి, చిన్న పనివలె సుమారు అరమిల్లిమీటరు పొడవు గలిగిన, క్రిమిగా లక్క పురుగు జీవితచక్రంలో మొదట అవతరించును. ఈచిన్న క్రిములు (Larvae) యేడాదికి రెండు లేక మూడుసార్లు తమ తల్లిపురుగులు విసర్జించిన లక్కలోపలి తల్లిగర్భములోనుండి వేనకువేలు ఉద్భవించును. సాధారణంగా ఒక పురుగునుండి, ౨౦౦ - ౫౦౦ చిన్నక్రిము లుద్భవించును. ఒకప్పుడు దరిదాపు ౧౦౦౦ క్రిములుగూడ నుద్భవింపవచ్చును. ఈచిన్న క్రిములు తమ జీవనం కొఱకై చిన్న లేతకొమ్మల నాసించి, యాకొమ్మల క్రిందిభాగమున జేరును. అవి ప్రాత, పెద్దకొమ్మల జీవనాధారం గొనలేనందున, అట్టి వాటి చేరువకు పోవు. ఈకారణంచేతనే యీ పురుగులు వసించుటకు సాధ్యమైనన్ని చిన్నకొమ్మలు చిగుర్చుటకై, లక్క చెట్లకొమ్మలను తగుకాలంలో, తగువిధమున, నరుకుట వాడుకలోనికి వచ్చుచున్నది. అయినప్పటికి తగువిధమున నరుకని కొన్ని లక్క చెట్లపై లక్క పండును కాని, విస్తారంగా పండుట కొలదికష్టం. చిన్నక్రిములు తల్లిపురుగునుండి, పైకి వచ్చు సమయమున లక్కతోగూడిన కొమ్మలను చెట్లనుండి నరికి, ౬" పొడుగు, ౧" వెడల్పు గలిగిన చిన్న ముక్కలుగా జేసి, క్రొత్తలక్క సు పట్టు చెట్ల లేతకొమ్మల క్రిందభాగమున కట్టవలెను; లేక పూర్వాచారపద్ధతిని కొన్నికొమ్మల మధ్యన లక్క కట్టెల నుంచవచ్చును. కొన్ని ప్రదేశాలలో చిన్న వెదురు బుట్టలయందు లక్క కట్టెల నుంచి వాటిని చెట్లకు కట్టెదరు. ఈ చిన్న క్రిములు ఒకటి రెండువారములలో వేనకువేలు పైకి వచ్చి కొంతదూరమే ప్రాకగలవు కాన, చిన్న క్రొత్తకొమ్మల దరి జేరును. అట్లు చేరి యీలక్క క్రిమి తనకాళ్లను ముక్కు నోటిని కొమ్మలోనికి దోనిపి వాటిరసమును

లీల్చును పెరుగును. ఈ క్రిములు దట్టముగా కొమ్మల నావరించి, అనగా, ఒక అంగుళం పొడుగునకు దరి దాపు ౧౫౦-౨౦౦ క్రిము లుండి, లక్కను మెరయు చున్న పొరలుగా వాటి దేహములపైని స్వేదింపజేయును. అవి లక్కతోపాటు, తెల్లని క్రొవ్వునుగూడ విసర్జించును. లక్కయందు జిగురు, రంగుపదార్థం కూడుకొని యుం డును. లక్క పైకి వచ్చుకొలది,ఒకపురుగుపైనున్న లక్క, ప్రక్క పురుగుపైనున్న లక్కతోగూడ కలుసుకొని ఏకమగును. మగలక్కక్రిమి బొందెలో (in the cell) రెండవమార్పు పొంది, తనపైని గట్టిపొరను తయారు చేసికొనును (peupal stage). అటుతరువాత,మగలక్క పురుగు, యీ గట్టిబొందెనుండి పైకి వచ్చును. మగ లక్క పురుగు ఎర్రని రంగు గలదై క్రిమికంటె పెద్దదై, మూడుజతలకాళ్లు గలిగి, రెక్కలతో నుండును. ఈ మగపురుగు లక్కగూళ్లమీద నడుచుచు, అనేక ఆడ పురుగులతో, వాటిబొందెలపైనున్న వెనుక కన్నము ద్వారా సంయోగించును. అటుపిదప నాయాడుపురుగు లకు గర్భమగును. మగపురుగులిక, వాటి పని నెరవేరినతరువాత చనిపోవును,లేక పై కెగిరిపోవును. అప్పటికి లక్కబొందెలు పలుచనివై చిన్నవై యుండును. కనుక మగపురుగులు తయారుచేసిన లక్క చాల కొలదియై వ్యాపారకంగా తక్కువయై యుండును. అందువలన నిజంగా మగపురుగులు పై కెగిరినపిదప, లక్కవిసర్జన ఆడుపురుగులచే ఎక్కువగా జరుగును. బీహారులో నున్న రాంచి (Ranchi) పట్టణమునకు సమీపమునయున్న 'నంకూం'లో ౧౯౨౫ సం. లో స్థాపింపబడిన భార తీయ లక్క పరిశోధనాలయమున (Indian Lac Research Institutes, Namkum, Ranchi) లక్కపురుగుయొక్క జీవనచక్రములో, ఆడుపురుగులు మగపురుగులతో సంయోగములేకయే, గర్భము ధరించి, చిన్నక్రిములను ప్రసవించునని పరిశోధనవల్ల తెలిసినది. ఈ సంయోగము లేనిదే గల్గిన ప్రసవమునకు జంతు శాస్త్రంలో పార్తినోజెనిసిస్ (C. parthinogenesis) అంటారు. ఈవిధంగా ౧౯౨౯ సం॥ కార్తికమాసంలో ప్రథమమున, మగపురుగులు తీసివేయబడినవి; తరువాత ప్రతిపంటలో వరుసగా మగపురుగులు తీసివేయబడు చున్నవి. ఈవిధమైన లక్కపంటలు నేటికిగూడ పండుచు న్నాయి; అనగా ౧౫-౨౦ సంయోగములేనిదే వచ్చిన లక్కపురుగుల కుటుంబాలు యిప్పటివరకు నడిచినవి. పరిశోధనచేయు నాకుటుంబములు సాధారణ లక్క కుటుంబములవలె నున్నవి.

ఆడు లక్కక్రిములు కొమ్మపైని ఒకసారి వసించిన తావునుండి మరి కదలవు. ఇవి తమపై స్వేదింప జేసుకొన్న లక్కగూడులోపల పెరిగి, కళ్లు, కాళ్లు పోయి, మూడుమార్పులు చెందును. మార్పు చెందినను లక్కమట్టుకు విసర్జించుట మానవు. ఇవి రానురాను, మొట్టమొదట పలుచగానున్న గూడును దట్టముగాను, పెద్దదిగాను చేయును. ఈకాలములో ఆడుపురుగు తాను తనదేహములో గ్రుడ్లనుపెట్టి,తరువాత వాటిని క్రిములుగా జేయును. ఆ క్రిములు లక్కగూడునుండి మూడువార ములకు పైకి వచ్చును. అట్టి సమయమున లక్కకొమ్మ లను చెట్లనుండి నరికి, వాటిని వేరు చెట్లపై లక్క పండు నిమిత్తం కట్టుదురు. పైని వివరించినట్లు, లక్క గుడ్డు నుండి పెరిగి, పెద్ద లక్క పురుగై మరల నాయాడు పురుగు గ్రుడ్లను పెట్టువరకు గలకాలము లక్కపురుగు యొక్క జీవనచక్రమని మనము చెప్పవచ్చును. ఈ జీవన చక్రములో ఒక లక్కపంట పండును.

సాధారణంగా ఒక సంవత్సరంలో రెండు జీవన చక్రము లుండును. కాని నాలుగు జీవనచక్రాలు మనకు తటస్థిస్తాయి; ఎందు కనగా, లక్క కుసుమవృక్షములపై కొన్ని కాలములందును, కుసుమేతరవృక్షములపై మరి కొన్ని కాలములందును పండును. కాని మైసూరు, మదరాసు ప్రాంతాలలో 'జల్ల' (Shorea Talura) అనే చెట్టుపై, పెరిగే లక్కపురుగుకు ఏడాదికి మూడు జీవనచక్రము లున్నవి; అనగా ఏడాదికి మూడేపంటలు ఆ చెట్లపై పండును. ఈ జీవనచక్రములు, వాతావరణ స్థితిగతులపై సాధారణముగా ఆధారపడియుంటవి.

లక్కపంటలు:

బీహారు మొదలైన ప్రాంతాలలో నాలుగు లక్కపంటలు పండును. వాటికి ఆపంట పండే మాస ములనుబట్టి పేర్లుకలిగినవి. లక్కక్రిము లుద్భవించుచున్న కుసుమేతరవృక్షపుకొమ్మలు జూన్ - జూలై నెలలలో

కొత్తలక్కపండు చెట్లకు చేర్చినయెడల (అనగా, కుసుమేతరవృక్షములకు, రేగు, మోదుగ, కంది మొదలైన చెట్లకు), ఆగస్టు-సెప్టెంబరులలో మగపురుగులు పైకి వచ్చి, అక్టోబరు-నవంబరులలో ఆడులక్కపురుగులు గర్భము ధరించి తమ క్రిమిసంతానమును ప్రసవించును. అప్పటికి ఒకలక్కపంట యగును. ఈ పంటకు కార్తిక పంట యని పేరు. ఇది పంటకు వచ్చినప్పుడు, అనగా, కార్తికమాసములో కోయబడును. ఈ కార్తిక పంటనుండి కోసిన లక్కకొమ్మలు, చిన్నముక్కలుగా జేసి చిన్నక్రిములు పైకి వచ్చుసమయమున వేరు చెట్లపై, అక్టోబరు - నవంబరులలో చేర్చవచ్చును. ఈ చిన్నక్రిములు పెరిగి పెద్దవై, వాటిలో మగపురుగులు ఫిబ్రవరి-మార్చిలలో పైకి వచ్చి, మరల ఆడుపురుగులు గర్భము దాల్చి, తమ చిన్నక్రిములను జూన్ - జూలై నెలలలో ప్రసవించును; అనగా మఱియొక పంట సిద్ధమైన దన్నమాట. ఈ పంటకు వైశాఖపంట యని పేరు. ఈ వైశాఖపంటలో కొంతభాగమును వైశాఖ మాసంలో (ఏప్రిల్-మే) కోయుదురు; మిగిలినది అట్లే చెట్లపై వదలివేయబడును. ఈ మిగిలినభాగము నుండి జూన్ - జూలై నెలలలో చిన్నక్రిములు వచ్చి మఱల కార్తికపంట పండుట కుపయోగపడును. లక్క బాగుగ పండు జిల్లాలలో ఈ వైశాఖపంటయే వ్యాపారిక పంట(commercial crop). ఈకార్తికపంట కొంతవరకు వ్యాపారికంగా లాభించినప్పటికి, ఇది ముఖ్యంగా వైశాఖపంట పండించేనిమిత్తమే ఉపయోగపడును(brood-crop). ఈ కార్తిక, వైశాఖపంటలలో పండేలక్కకు 'రంగిణి' లక్క యని బీహారు మొదలైన ప్రదేశాలలో వ్యవహరిస్తారు.

కుసుమ చెట్లపైగాని, కుసుమలక్క చేర్చబడుటచే ఇతర చెట్లపైగాని పండులక్క 'రంగిణి' లక్కవలెగాక వేరువేరు కాలములందు పండును; అనగా ఆ రెండులక్కపురుగులు వేరు జీవనచక్రములను జూపును; ఎట్లనగా, క్రిములు పైకి యుద్భవించు సమయమున జూన్ - జూలై నెలలో పండే కుసుమ లక్క కుసుమచెట్లకుగాని, కుసుమేతరవృక్షములకు గాని కట్టబడినపిదప, కొత్తలక్క స్వేదింపబడుతరి, పెరిగి పెద్దవైన మగపురుగులు సెప్టెంబరు – అక్టోబరులలో పైకి వచ్చునుగాని ఆడుపురుగులు జనవరి - ఫిబ్రవరి నెలలవఱకు ప్రసవింపవు. కొన్నిప్రదేశాలలో డిసెంబరు – జనవరులలో ప్రసవమగును. ఇట్టిపంటకు 'మార్గశిరపంట' యని పేరు. ఈపంట జనవరి - ఫిబ్రవరులలో పండినప్పటికి, అమ్మకం నిమిత్తం, నవంబరు - డిసెంబరుల (అనగా మార్గశిరమాసం)లో కోత ప్రారంభమగుటచే దానికి అట్టిపేరు వచ్చెను. ఈ అపరిపక్వమైన పంటను కోయుటచే, చిన్నక్రిములు ప్రసవమగు సమయమువరకు (అనగా జనవరి - ఫిబ్రవరుల వరకు) స్వేదింపబడే లక్కజిగురు ఈ పంటలో తగ్గిపోవును.

ఈ మార్గశిర పంటలక్కను, క్రిములు పైకి వచ్చు సమయమున (జనవరి - ఫిబ్రవరులలో) కుసుమచెట్లకు గాని, కుసుమలక్కపండు ఇతరములైన చెట్లకు గాని చేర్చినపిదప, మగపురుగులు మార్చి - ఏప్రిల్ నెలలలో పైకి వెడలును; జూన్ - జూలై నెలలలో, అనగా, ఆషాఢమాసంలో ఆడుపురుగులు ప్రసవించును. కనుక ఈ లక్కపంటకు ఆషాఢపంటయని పేరు. మఱల నీ ఆషాఢపంట లక్కను క్రిములు పైకి ఉద్భవించు సమయమున కుసుమచెట్లకు గట్టిన, మార్గశిరపంట పండును. కాని వ్యాపారికంగా లాభకరమైన మార్గశిర పంట పండేనిమిత్తం, యీ ఆషాఢపంట ఉపయోగపడును. సాధారణంగా వ్యాపారికంగా లాభించే యీ మార్గశిరపంట పక్వమునకు రానిదే కోయగూడదు.

కనుక, కుసుమేతరపుచెట్లపై, కుసుమేతరపు లక్క చేర్చబడుటచే పండెడులక్క కార్తిక, వైశాఖ కాలములందు తనజీవనచక్రములు నడుపును. కుసుమ, కుసుమేతరపుచెట్లపై పండు కుసుమలక్క ఆషాఢ, మార్గశిరములందు తనజీవనచక్రములు నడుపును.

పైని సూచించినట్లు ఈకార్తిక, వైశాఖ పంటల లక్క 'రంగిణి' లక్క యనియు, మార్గశిర, ఆషాఢ పంటల లక్క 'కుసుమ'లక్కయనియు పిలువబడుచున్నది. 'రంగిణి' లక్కకంటె కుసుమలక్క శ్రేష్ఠమైనది.

లక్క పురుగు జీవనమునుగూర్చియు, లక్క పంటలు పండించు విధమునుగూర్చియు క్లుప్తంగా చెప్పడమైనది.

లక్క పండు ప్రదేశాలనుగూర్చి, ఎగుమతులను గూర్చి కొంచెము సూచించి, ముఖ్యమైన లక్క ఉపయోగాలను విశదీకరిస్తాను.

## లక్క పండు ప్రదేశములు, విస్తీర్ణము:

ప్రపంచంలో పండే లక్కలో ౧౦౦ కి ౯౫ వంతులు హిందూదేశం పండించుచున్నది. మిగిలిన ౫ వంతులు బర్మా, సయాము, మలయా, సింహళం జావాలు పండించుచున్నవి.

హిందూదేశంలో లక్క ఎక్కువగనో, కొంచెముగనో బీహారు, మధ్యరాష్ట్రములు (Central Provinces), ఒరిస్సా, బెంగాల్, అస్సాము, సంయుక్త రాష్ట్రములు (United Provinces) భూటాను, టిబెట్, నేపాల్, పంజాబు, బొంబాయి, బీరారు, హైదరాబాదు (దక్కను), మైసూరు, మదరాసు (నీలంజిల్లా), తిరువాన్కూరు, మయూర్‌భంజి (ఒరిస్సా), గంగపూరు (ఒరిస్సా), జయపురం (ఒరిస్సా) ప్రదేశములందు పండుచున్నది. ఇది ముఖ్యంగా బీహారునందలి చోటానాగపూరు, ఒరిస్సాస్టేట్సు, మధ్యరాష్ట్రములు, బెంగాల్, సంయుక్తరాష్ట్రప్రాంతముల కొన్ని ప్రదేశములలోను పండుచున్నది. ఈ ప్రదేశాలు నూటికి ౯౦ పాళ్లు వ్యాపారికంగా లాభించే లక్క పంట పండించుచున్నవి. వీటిలో చోటానాగపూరు, రాంచి జిల్లా, మన్‌భూమి, సింగభూమి, పలామూ జిల్లాలు హిందూదేశపులక్క పంటలో నూటికి ౫౦—౬౦ వంతుల పంట పండించుచున్నవి.

లక్క తయారుచేయు ముఖ్యప్రదేశము లెవ్వియన, మిర్జాపూర్ (U. P.), బలరాంపూరు, జాల్డా (బీహారు), కలకత్తా, రాంచి, ముండు, ముర్హు (రాంచి జిల్లా), పాకూరు, ఇమామ్‌గంజి—రాణి గంజి (గయా జిల్లా), గోండియా (C.P.), ఉమారియా (రీవాస్టేట).

ఈ ప్రక్కన ఏయే సంవత్సరములలో హిందూదేశం మొత్తంమీద ఎంత లక్క పంట పండిందో సూచించబడినది.

| సం॥ | మణుగులు |
|---|---|
| ౧౯౧౮ | ౪,౮౨,౦౦౦ |
| ౧౯౨౦ | ౧౨,౨౪,౫౦౦ |
| ౧౯౨౭ | ౧౪,౫౬,౫౪౬ |
| ౧౯౩౦ | ౧౨,౬౯,౦౦౦ |
| ౧౯౩౫ | ౧౦,౫౪,౫౦౦ |
| ౧౯౩౬ | ౧౫,౮౦,౦౦౦ |

(మణుగు = ౪౦ శేర్లు)

ఏడాదికి, సగటున ౧౦ ½ లక్షల మణుగుల లక్క పండుచున్నది. ఆయా రాష్ట్రములలో ఈక్రింద సూచించినట్లు పండుచున్నది.

| | మణుగులు |
|---|---|
| బీహారు (మయూర్‌భంజి, సిర్‌గుజాస్టేట్సుతోగూడ) | ౪,౧౬,౦౦౦ |
| మధ్యరాష్ట్రములు (C. P) | ౧,౬౦,౦౦౦ |
| బెంగాల్ | ౮౦,౦౦౦ |
| బర్మా | ౫౨,౦౦౦ |
| అస్సాము | ౩౪,౦౦౦ |
| మధ్యహిందూస్థానం (Central India) (రీవాస్టేటు etc;) | ౩౬,౦౦౦ |
| పంజాబు | ౧౦,౦౦౦ |
| బొంబాయి - బరోడా | ౯,౦౦౦ |
| సంయుక్తరాష్ట్రములు (U. P) | ౫,౫౦౦ |
| ఒరిస్సా (గంగపూరుస్టేటుతో) | ౪,౫౦౦ |
| హైదరాబాదు (సింధు) | ౪,౦౦౦ |
| నేపాళ్ | ౨,౦౦౦ |
| జయపురం (ఒరిస్సా) | ౧,౦౦౦ |
| మదరాసు, మైసూరు, తిరువాన్కూరు | ౨,౦౦౦ |
| హైదరాబాదు (దక్కను) | ౫౦౦ |

## లక్క ఎగుమతులు :

తొలి, ౧౬౦౪ సం॥ రం లో హిందూదేశంనుండి లక్క యూరోపు కెగుమతిచేయబడెను. ౧౮౦౫ సం॥ రంలో ౨,౩౪౪ హండ్రెడ్‌వెయిట్ల అటుకుల లక్క (Shellac) ౧౨,౯౪౮ పౌనుల విలువకు ఎగుమతియయ్యెను. కాని ౧౮౦౮ సం॥రంలో ౨౩౯ హండ్రెడ్

మైట్లు మాత్రమే, ౧,౨౪౩ పౌనుల విలువ కెగుమతిచేయబడెను. ౧౮౩౯, ౧౮౪౦ సం॥రములలో ౭,౨౬౬, ౬౦౪౩ హం.ట్ల లక్క పైదేశముల కెగుమతియయ్యెను. కాని లక్కరంగు (Lac dye)యొక్క ఎగుమతి ౪,౭౫౬ హం.ట్లనుండి ౫,౪౪౦ హం.ట్లవరకు ఎక్కువయ్యెను. తదుపరి లక్కరంగుపరిశ్రమ క్షీణించినది; దానితోపాటు రంగు ఎగుమతులు తగ్గిపోయినవి. రాను రాను లక్కజిగురు (Lac resin) పరిశ్రమ విస్తీర్ణం చెంది, ఎగుమతులుకూడ ఎక్కువగుచువచ్చెను.

ఈదిగువ పట్టికలో ఆయా సంవత్సరములలో లక్కరంగు, లక్కజిగురు ఎగుమతులు సూచింపబడినది.

| సంవత్సరము | లక్కరంగు. | | లక్క జిగురు (Shellac) | |
|---|---|---|---|---|
| | హం. | రూ. | హం. | రూ. |
| ౧౮౬౮-౬౯ | ౧౭,౭౪౮ | ౭,౯౬,౬౫౫ | ౪౩,౭౪౦ | ౧౧,౬౫,౭౩౯ |
| ౧౮౭౮-౭౯ | ౮,౨౬౧ | ౧,౯౫,౨౮౫ | ౬౪,౪౮౯ | ౨౨,౨౪,౮౪౩ |
| ౧౮౮౮-౮౯ | ౩౩౩ | ౮,౦౩౮ | ౮౧,౩౯౦ | ౩౧,౯౪,౧౨౫ |
| ౧౮౯౮-౯౯ | ... | ... | ౧,౪౬,౩౯౫ | ౭౦,౦౭,౭౮౧ |
| ౧౮౯౯-౧౯౦౦ | ౧ | ౨౪ | ౧,౯౫,౨౩౯ | ౯౨,౬౫,౬౦౦ |
| ౧౯౨౦-౨౧ | ... | ... | ౩,౯౮,౯౩౭ | ... |
| ౧౯౩౬-౩౭ | ... | ... | ౮,౩౩,౯౬౪ | ... |

౧౯౦౨-౩ సం॥రాలలో లక్కజిగురు ఎగుమతుల విలువ ౧ న్నర కోట్ల రూపాయలవరకును, ౧౯౦౪-౮ సం॥రములలో ౨ న్నర కోట్లవరకును ఎక్కువయి, ౧౯౧౧ సం॥వంవరకు నట్లే నిలచియుండెను. కాని ౧౯౧౨-౧౯౧౬ లలో ఏటాదికి ౧ న్నర కోట్లచొప్పున నుండెను. కాని యూరోపియన్ మహాయుద్ధం మొదలయినతరువాత ౧౯౧౬ సం॥రంనుండి ఎగుమతుల విలువ యెక్కువై, అవి రానురాను ౮ కోట్లనుండి ౧౯౨౦ కోరిసం॥రాలలో ౧౫ కోట్లవరకును పెరుగుదల చూపెను. కాని అటుతరువాత ఎగుమతులవిలువ తక్కువగుచు, ౧౯౩౪ సం॥రంలో రెండు మూడుకోట్ల రూపాయలయ్యెను. విలువ తక్కువైనను, ఎగుమతులుమట్టుకు మొత్తంమీద ఎక్కువగుచు, ౧౯౩౬-౩౭ లో ౮,౩౩,౭౬౪ హం.ట్లును, ౧౯౩౭-౩౮ లో ౬,౬౪,౬౭౧ హం.ట్లును అయ్యెను.

### లక్కఉపయోగములు:

లక్క హిందూదేశంలో నూటికి ౯౫ వంతున పండుచున్నను, నూటికి ౩ వంతున మాత్రమే పరిశ్రమలలో నుపయోగింపబడి, తక్కినదంతయు అమెరికా, ఇంగ్లాండు, జర్మనీ, జపాను, రష్యాల కెగుమతి యగుచున్నది. లక్క యీ దిగువ పేర్కొనిన పరిశ్రమలలో నుపయోగింపబడుచున్నది.

గ్రామఫోను రికార్డులు నూటికి ౩౫-౪౦ చొ॥న
(Gramaphone record industry)

ఎలెక్ట్రిక్ ఇన్సులేటర్లు నూటికి ౧౫-౨౦ చొ॥న
(Electric insulators)

పెయింటు, వార్నిషు పరిశ్రమలు నూటికి ౧౫ చొ॥న
(Paint & Varnish industry)

టోపీలు గట్టిచేయు పరిశ్రమ నూటికి ౧౦ చొ॥న
(Hat-stiffening industry)

ముద్రవేసెడి లక్కపరిశ్రమ నూటికి ౫ చొ॥న
(Sealing waxes)

లక్కపూత, సానరాళ్లు మొదలైనవి-నూటికి ౧౦ చొ॥న
(Lacquer ware, grinding wheels etc;)

ఈ పరిశ్రమలలో పురాతనకాలంనుండి మనదేశంలో, ముద్రవేసెడిలక్క పరిశ్రమ, లక్కపూత పరిశ్రమ వాడుకలో నున్నవి. లక్క, మతియు, ఆయు

శ్వేత చికిత్సలందు కొన్నికొన్ని ప్రాంతములం దుపయోగింపబడుచున్నది. బంగారు, వెండి యాభరణములలో నింపుటకుగూడ లక్క ఉపయోగపడుచున్నది. కొన్నికొన్ని ప్రదేశములందు లక్కను స్పిరిటులో కరిగించి తయారుచేసిన వార్నిషులు, పాలిషులుకూడ వాడుకలో నున్నవి.

ముఖ్యంగాలక్క గ్రామఫోనురికార్డుపరిశ్రమయందు నూటికి ౩౦-౪౦ వంతులవరకు ఉపయోగపడుచున్నది. కాని రసాయన సమ్మేళనముచే తయారుచేసిన పదార్థముల (Synthetic resins) పోటీ చేతను, కొత్త కొత్త విధముల శబ్దమును రికార్డుచేయుట వచ్చుటచేతను లక్కయొక్క ప్రయోగం ఈపరిశ్రమయందు ఇటీవలకొంచెము తగ్గుచున్నది. లక్కనుండి తయారుచేసిన గ్రామఫోను రికార్డులు అమూల్యమైనవి; తక్కిన పదార్థములతో చేసినవాటికంటె శ్రేష్ఠమైనవి. పైని సూచించినట్లు వీటి పరిశ్రమలో లక్క తగ్గిపోవచ్చును. మన హిందూ దేశంలో దరిదాపు ౪౦౦౦ మణుగుల లక్క యీ పరిశ్రమలో నుపయోగింపబడుచున్నది. డమ్ డమ్ (Dum-Dum)లో నున్న గ్రామఫోనుకంపెనీ లిమిటెడ్ వారు తమ రికార్డులలో లక్క యిప్పటికినిగూడ నుపయోగించుచున్నారు. కాని భారతీయపరిశ్రమ యింకను ఈ విషయంలో ముందంజ వేయవలెను.

ఎలెక్ట్రికల్ పరిశ్రమలలో, లక్కతో తయారుచేసిన 'ఇన్సులేటింగు వార్నిషు' (Insulating varnish) కాగితముతో చుట్టబడిన గొట్టములు, బోర్డులు మొదలైనవి తయారుచేయుటలో, వాటిని అంటించి బంధించుటకు లక్కజిగురును, 'మైకానైట్' (micanite) తయారుచేయుటలో, మైకా (కాకిబంగారం) ముక్కలకు అంటించుటకు లక్క వార్నిషు-లక్కగుండయును ఉపయోగపడుచున్నవి ఎలెక్ట్రిక్ బల్బులకు, రేడియో వాల్వులకు లోహపుకొడిములను బంధించుటకు లక్క సిమెంటుగా నుపయోగపడుచున్నది. ఇవి గాక, పెయింటు వార్నిషు పరిశ్రమలలో లక్క బాగుగ నుపయోగపడుచున్నది. భారతీయ లక్కపరిశోధనాలయం (Indian Lac Research Institute)లో ఇప్పుడు కొత్తగా లక్కనుండి 'షేక్‌లైట్'వంటి పదార్థమును తయారుచేసిరి ఈ పదార్థముతో ఎలెక్ట్రిక్ స్విచ్చులు (electric switches,ceiling rose), సిగరెట్టుకేసులు(cigarette cases), పళ్లెములు, కప్పులు, గ్లాసులు, డబ్బీలు మొదలైనవి తయారుచేయుచున్నవి. ఈపరిశ్రమ కొలదికాలంలో పెంపొందింది, విదేశీయమైన 'బేక్‌లైటు'పదార్థమును రాకుండజేయునని నానమ్మకం.

మఱియు, విదేశాలలో టోపీలు బిరుసుగాను గట్టిగాను చేయుటకు (top-hats, stiff hats etc) లక్క వార్నిషు లుపయోగపడుచున్నవి. ఈ పరిశ్రమలో లక్క నూటికి ౧౦ వంతున ఉపయోగమగుచున్నది.

ఇప్పటివఱకీపరిశ్రమలో లక్కకు పోటీగా రసాయన సమ్మేళనపదార్థములు (synthetic resins) రాలేదు.

ఇవి గాక లక్క ఇతరమైన అనేక పరిశ్రమలలో నుపయోగపడుచున్నది. ముద్రవేసెడిలక్క - పరిశ్రమ తోలు, రబ్బరు, వార్నిషులు (leather & rubber finishes), కాగితపువార్నిషులు (paper finishes), ఫోటోగ్రాఫుపనులలోను, టిన్నురేకులను మెరుగుపెట్టుటకు (tinsel finishes), అచ్చువేయు సిరాలు, మార్కింగు సిరాలు(Lithographic, printing and marking inks), సిమెంట్లు, జిగురులలోను, మందుగుండుసామానులలోను, సానరాళ్లలోను, ఆటవస్తువులకును, బల్లలు కుర్చీలు మంచములు మొదలైన వాటికిని పాలిషుచేయుటకును, మఱియు అనేకపరిశ్రమలలో నుపయోగపడుచున్నది. కాని భారతదేశంలో లక్కయొక్క ఉపయోగములు చాల తక్కువ. కావున లక్కను పండించే ప్రతిజిల్లా, ప్రతిరాష్ట్రం, ప్రతిస్టేటు, పైదేశముల కెగుమతిచేయుటకు బదులు, సాధ్యమైనంతవఱకు లక్క ఉపయోగపడే పరిశ్రమలు స్థాపించినచో అవి భావిభారతౌన్నత్యానికి తోడ్పడగలవని నమ్ముచున్నాను.

---

# 'కాలమానము - క్షీణమాసము'

జూలయి మాసములో వెలువడిన భారతి సంచికలో "కాలమానము— క్షీణ మా స ము" అను శీర్షికతో శ్రీ కొంపెల్ల లక్ష్మీనారాయణగారు వ్రాయించిన వ్యాసము చదివితిని. అందులో రెండు సంశయములు తోచి యీ లేఖ వ్రాసికొనుచున్నాను.

మొదటి సందేహము- క్షీణమాసము అను పేరు క్రొత్తగా ఉన్నది. లేఖకుల అభిప్రాయము క్షయమాసము కావలెను. ఏ చాంద్రమాసమందు రెండు సంక్రాంతులు గలుగునో దానికి క్షయమాసము అని పేరు ఆ మాసమును లెక్కలలోనుండి అణచివేయుదురు.

రెండవది- క్షయమాసము సుమారు ౬౨ శతాబ్దులకు ఒకమారు సంభవించు నని శ్రీ లక్ష్మీనారాయణగారు వ్రాసియున్నారు. ఇది సరియని తోచదు. నూరు సంవత్సరములలో ఒకటిరెండు క్షయమాసములు మాత్రము వచ్చును అనియు, క్రీ. శ. ౧౮౨౨-౨౩ లో పౌషము క్షయమాసముగ వచ్చె ననియు, ౧౪౧ క్రీ. శ. ౧౯౬౩-౬౪ సం॥ లో వచ్చు ననియు శ్రీకొమర్రాజు లక్ష్మణరావుగారు ఆంధ్ర విజ్ఞానసర్వస్వములో వ్రాసియున్నారు. శ్రీ స్వామికన్నుపిళ్లగారి లెక్కలలో గూడ అట్లే యున్నది. శ్రీ లక్ష్మీనారాయణగారి వ్రాతకాధార మెద్దియో తెలియకున్నది.

దాసు దామోదరరావు.

# పాచిక

శ్రీ ఇల్లిందల సరస్వతి

[ఇది కేవలం వినోదంకోసంగాని విమర్శన కోసం కాదు. కథకులకు, శ్రీచలంగారికి వారివంద నాలు.]

[ప్రకాశరావు, అతనిభార్య రాజ్యం డ్రాయింగు రూములో కూర్చుని వుంటారు. ప్రకాశరావు దగ్గర బల్ల మీద యువకార్యాలయంవారి గ్రంథమాల, నవ్యా ఖ్యాన్‌వారి గ్రంథమాల, కొన్ని చలంగారి పుస్తకాలు ఉంటాయి. ప్రకాశరావు చేత్తో ఓపుస్తకం పట్టుకుని ఆలోచిస్తూవుంటాడు.]

రాజ్యం — మీతో మాట్లాడదామన్నా మీకు తీరుబడి లేకుండావుంది యీమధ్య. అసలు యీపుస్తకాలు తెచ్చినదగ్గర్నుంచి తలయినా ఎత్తడం లేదుకదా.

ప్రకాశ — (మతి పోయినవాడిలాగ) ఏమిటి ఏమంటున్నావు, రాజ్యం! తీరటంలేదనా?

రాజ్యం — అమ్మా! ఇంతలోకి మనిషికూడా మారిపోయారూ? నేనడుగుతుంటూ నేవున్నా. పుస్తకాలు చూడ్డానికి బాగానే వున్నాయి, ఎరుపు తెలుపు పట్టెలతో. అందులో ఏమిమహాత్మ్యముందో ఆపుస్తకాల్లో. చదివేసరికల్లా వింతవింత ఆలోచనలు పుట్టాయి. నాకయితే మతే పోయిందనుకున్నా పూర్తిగా. ఈసంఘంలో వుండే నీతికట్టుబాట్లు లేకుండా వుంటే నాక్కూడా మైదానపు జీవితం బాగా వుంటుందని తోచింది. వివాహమనే పుస్తకం చదివాక వేంకటచలంగారు ఆ అమ్మాయిని భర్తతో పంపెయ్యక ప్రొఫెసరుగారిదగ్గ రుంచితే బాగుంటుందని తోచింది. భర్తలతో కాపురంచేసేవాళ్ళంతా గతిలేక ... అని పించింది.

ప్రకాశ — నిజమే — నీక్కూడా తోచిందీ. నాకు, ఏమిటో యిన్నాళ్లూ అంధకారంలో ఉన్నట్టు, యిప్పు డేమిటో వెలుతురు కనిపించినట్లు, అనిపిస్తోంది. ఆసౌఖ్యము! ఆప్రణయము! రాజ్యం! వా ళ్లన్నట్టుగా దారిన పోయేటప్పుడు ఏప్రణయిని అయినా చూసి మందహాసము చేసిందంటే ఎంతో ఆనందంగా ఏనుగనెక్కినంత సంతోషంగా ఉంటుంది. ఎవరితోనయినా సౌఖ్యపడితే స్వర్గసౌఖ్యంలా కనబడుతుంది. మనిషి పుట్టింది సౌఖ్యాలకోసము కాకపోతే దేనికి? చదివావుకదూ. సింగుమ ఎట్లా పురమాయిస్తారో అత్యంగారు. ఆప్రణయం తలుచుకుంటేనే హాయిగా వుంటుంది రాజ్యం. నాజీవితంలో ఏప్రణయిని అయినా చేతులు చాపితే ప్రవరాఖ్యుడిపాత్రను నేను ధరించను. ప్రేమించబడటం ఎంత పుణ్యము చేసుకుంటేనో గాని...

రాజ్యం — అవును మరి. అందరికి లభ్యపడుతుందా! సరేకాని నే నోటి అడుగుతాను. ఇప్పుడు మీకు ముప్ఫయిఅయిదు ఏళ్లు వచ్చాక, నాక్కూడా ముప్ఫయి పడ్డాక, మనిద్దరికి ప్రణయంఅంటే ఏమిటో తెలియకముందే సద్దెద్దు చేలోపడ్డట్టుగా సంసారం సాగిస్తూఉంటే, నలుగురు పిల్లలు పుట్టాక, ప్రణయంమీద ఆశా అభిరుచీ కలిగా యనుకోండి — మాటవరుసకు సుమా కోప్పడకండి. ఇప్పుడు మన మేమిటి చెయ్యడం?

ప్రకాశ — ఏం లేదు రాజ్యం. నీవు అల్లరిచేయకుండా వుండు. నేను యిక్కడ బాగుండదు కాని మావూరు ఓసారి వెళ్లి అనుభవించి వస్తాను.

అక్కడ ప్రణయం మార్కెటులో అమ్మినట్లే నేను చూసి వస్తా.

రాజ్యం — మరి నే నేం చేసేది యిక్కడ?

ప్రకాశ — అదా టంటా వెందుకు? పిల్లల్ని చూడు. పెద్దవాడు స్కూలు ఫైనలు పరీక్ష యీసారయినా నెగ్గేట్టు చూడు. మనవ డబుల్ ప్రమోషను రావాలిసిందే. నా గా. కార్యదర్శి పనులు కొన్ని, ఎకౌంటు అవీ వ్రాయడం మిగిలిపోయాయి. అవి పూర్తిచేయి.

రాజ్యం — బలే. నేను ఇక్కడ మీపనులన్నీ చూస్తూంటే మీరు తీరిగ్గా...పాపం ఎంత ఉదారం.

ప్రకాశ — అవును. నే నంటేమాత్రం నవ్వు చూట్టం లేదూ. ఎన్నో రోజులు కాదులే. మహాఎక్కువయితే రెండునెలలు. సెలవులుకూడాను. వీలుగా వుంటే ఎవరయినావస్తే... ఇంకో యిల్లు మాట్లాడుతాలే.

రాజ్యం — మరి నేనో? (కళ్లల్లో నీళ్లు గిర్రున తిరుగుతాయి.)

ప్రకాశ — నిన్నొద్దన్నానా రాజ్యం! అయినా సంతోషంగా ఉత్సాహంగా వుండాలంటే ఏదయినా కావాలి. ఎప్పుడూ దేనికోసమో ఓదానికోసం పణగటమూ, సరిగా వేళకు రాలేదని విసుక్కోటమూ, ఎంత చెప్పినా, ఎట్లా వున్నా అసంతృప్తిగా మాట్లాడటమూ, కృతజ్ఞత లేకపోవటమూ నాకు బాగా జ్ఞాపకముంది. మనం కంచికి వెళ్లినప్పుడు నీకు చీర కొనలేదని రెణ్ణెల్లు మాట్లాడక అల్లరిచేశావు. నీకు ఎన్నో చూపించాను, నీవు సంతోషమయినా చూపించలేదు. వాళ్లెట్లా చేస్తారో చెప్పు. ఎప్పుడూ నవ్వుతూ కలకల్లాడే ముఖాలతో ఉంటారు. అపరనరకంలాగ మనగృహాలు, యమభటుల్లాగ గృహలక్ష్ములు.

రాజ్యం — (చిక్కమొహంతో) నిజంగా అంటున్నారా? ఆపుస్తకాల్లో ఓకథలో యిల్లా వుందా?

ప్రకాశ — నిజంగా నాకు తోచాయి యీ మాటలు అవి చదివాక. ప్రణయం తెలీక జీవించటమేమిటి. ప్రణయము వదిలిపెట్టి మాట్లాడటమే తెలీదు నీకు. నా కేం ఏళ్లు మించిపోలేదు అప్పుడే వృద్ధులిల్లాగా కాళ్లు ముడుచుకు పోవడానికి.

రాజ్యం — అయితే పెళ్లి చేసుకుని యిన్నాళ్లు మీరీవి తోను వ్యర్థంగా గడిపారన్నమాట, మీయావ్వనం అంతా అడివిలో కాసిన వెన్నెల్లా గయిందన్నట్టు. బ్రహ్మచారిగా వుంటే మంచి మంచి 'బెటర్‌హోమ్‌'లు దేవు డిచ్చినట్లుగా...

ప్రకాశ — అబ్బే. అదేం మాట రాజ్యం! ఇల్లు వాకిలి పిల్లలు భార్య, ఎవరయినా వచ్చినా చేసినా గృహస్థు ఎటువంటి వాడైనా గౌరవం వుంటుంది పెద్దమనిషి తరహాగా. బ్రహ్మచారి యిటువంటి పన్లు చేస్తే తొందరగా పట్టుపడతాడు. సంఘంలో గౌరవం వుండదు. అయినా ఎప్పటికీ కాదుగా, అందుకోసం యివన్నీ వదులుకోడానికి మన ఎస్టాబ్లిష్‌మెంటుకు, దాని పర్యవసానము తాకకూడదు. అసలు కళ దాటితే అప్పడములాగా అణిగిపోతారు ఎవరైనా. ఏదయినా యిప్పుడేగా. తరువాత చూసుకోమా పెళ్లాము పిల్లల్ని, వాళ్లకు వదులుకోటమా.

రాజ్యం — అర్థమయింది యిప్పుడు. మీకు కోపము వస్తే పడటానికి, సేవచేయటానికి, లోకానికి చూపించుకోటానికి సంఘంలో గౌరవం పొందటానికి, పిల్లల్ని కనటానికి, యిల్లు నిలపెట్టటానికి భార్య కావాలి. ఇన్ని అయింతరువాత తల్లి చేత చేయించుకుని అలంకృతుడైన పిల్లవాడు ఆడుకోటాని కెళ్లినట్టు, తీరిగ్గా హుషారుగా ... పాలు పొంగిపోయి చప్పగా చల్లారిం తరువాత, ముసలితనములో మళ్లా చేయించుకోటానికి భార్య కావాలికదూ. అయితే ఆభార్య కూడా మీలాగ ప్రణయము, సౌఖ్యం, తృప్తి, సంతోషం ఉండొద్దూ?

ప్రకాశ — రాజ్యం! పిల్లల తల్లులు కూడా పట్టుపట్టితే ఓడిపోతారు సుమా. వాళ్లకు సంతోషం, ఆనందం అంతా పిల్లలే.

రాజ్యం — ఆహా. స్త్రీల చిత్తవృత్తి బాగా గ్రహించారు. పిల్లలతల్లులైతే ప్రణయం మక్కర్లేదూ? అయితే మీరుమాత్రము పిల్లలతండ్రి కారేమిటి?

ప్రకాశ — రాజ్యం! మళ్లీ పొరపాటుపడుతున్నావు. మాతృత్వము వచ్చినతరువాత నీ హృదయం మారుతుంది. మాకు మారదు.

రాజ్యం — ఆమార్పేమిటో తెలుసా? ప్రేమసామ్రాజ్యము వైశాల్యము పొందుతుంది. ఆమాతృప్రేమ భర్తలమీదకికూడా ప్రవహించుతుంది. దానికి తగినఫలం మీదగ్గర్నుంచి రావద్దూ?

ప్రకాశ — రాజ్యం! మన 'విషయం' మారుతోంది. చూడు.

రాజ్యం — ఏమంటారు?— మనభోజనాలవేళయింది. లేవండి. నే నందుకే వచ్చా అసలు.

ప్రకాశ — చక్కగా ఎక్కడికి వెళ్లినా ఎట్లా వున్నా వాళ్లే మనకు. రాజాలాగ ఆహ్వానిస్తారు. మీతోటే గొడవ.

రాజ్యం — ...

ప్రకాశ — ఆనాడు చూడు నా కిప్పడన్నీ జ్ఞాపకమొస్తాయి. మన పనిచేసే కోటికాలికి దెబ్బ తగిలినప్పుడు నేను 'పాపం తొందరగా వెళ్లి మందు రాసుకో' అన్నా అంతే. అప్పటికి యిప్పటికి అదిమాడు, అదోమాదిరిగా చూస్తుంది. నీకు ఎన్నోమార్లు కాఫీ చేసి యిచ్చాను. ఎంతో చేశాను. ఎన్నో చేశాను. నీ కేమన్నా వుందీ?

రాజ్యం — ఈసృష్టి అంతా ఏమిటి. ఒకచూపు మాత్రమే అయితే నేను నూట రకాల చూపులు చూస్తాను. ఒకనవ్వటమే అయితే అదీ చేస్తాను. నాపని అంతటితో ముగియదుగా. నేను సర్వాంతర్యామిపాత్ర ధరించాలని నా నుదుటిమీద వ్రాశాడు దేవుడు. అందుకే భార్య అంటే మీరు ప్రేమతో సంతోషంగా స్వీకరించరు. భార్యను చూచేసరికి మీకు యివన్నీ జ్ఞాపకమొస్తాయి. భర్తను చూచేసరికి మాకూ జ్ఞాపకమొస్తాయి. ఎప్పుడు దగ్గరగావుంటే భార్యమాట వదిలిపెట్టి, ఎవరైనా వినుగోస్తారు. అది కాక 'కార్యేషు దాసీ కరణేషు మంత్రీ' అనే శ్లోకములో చూశారు, భార్య ఒక వినయముగా 'బుల్లి'లాగ పనిచేయాలి. ఎవరి కయినా 'ఫాన్సీ' డ్రెస్సుమీద పోతుందిగా మనసు సహజంగా.

ప్రకాశ — అందుకే చెప్తున్నా అప్పటినుంచి, నిజమైన సౌఖ్యం ఆనందం పొందాలంటే...

రాజ్యం — కాదు కాదు. మనిద్దరికోసం మంచి ఉపాయం ఆలోచించండి.

ప్రకాశ — చెప్పావుకదూ రాజ్యం, నీ కర్థము కాదు అసలు ప్రణయం అంటేను.

రాజ్యం — మీ కర్థమవుతుందా యీ వయసులో?

ప్రకాశ — నీకు ముసలివాణ్ణిగా కనిపిస్తున్నానేమో గాని— ఏం మించిపోలేదు.

రాజ్యం — ఇంకొకరి విలువ మీ కెట్లా తెలుస్తుందో నా విలువకూడా మీకు తెలియదు, కాని యింకొకళ్లకు బాగా తెలుస్తుంది. నాకూ కూడా అభిరుచి కలిగింది ప్రణయమంటే.

ప్రకాశ — నీవు ప్రణయానికి పనికిరావు.

రాజ్యం — మీరు పూరికి వెళ్లేలోపల నాకు ముసలితనము వచ్చిందో లేదో పరీక్ష చేద్దాం, ఏం. సాయంకాలము కాగానే తల్లో పూలు పెట్టుకుని సెంటు రాసుకుని మనదొడ్డి గవాక్షంలో ఓరచూపులు చూస్తూ నిలబడతాను. ఎక్కడికయినా వెళ్లినప్పుడు ఆకర్షణకోసం బాగా అలంకరించుకుని నావంక నేనే చూసుకుని తలవంచుకుంటూ నవ్వుకుంటూ వుంటాను. ఎవరినయినా తలెత్తి చూడకుండా ప్రక్క చూపులు చూస్తూ వుంటాను. రెండర్థాలు

వచ్చేటట్లు మాట్లాడటం, చీకటిలో పచారు చేయడం, ఎవరినయినా చూడటంతోటే ముందు గాభరాపడి, కాళిదాసు శకుంతలలాగ, అవతలవారి ఆకర్షణకొరకు ఉపాయాలు వెదకటం, మందహాసం చేయటం, చిరునవ్వులు కురిపించటం, బాగా నేర్చుకుంటాను. నేను చిన్నప్పుడు శృంగారనైషధము కాళిదాసు ప్రబంధాలు బాగా చదివా లెండి. అవన్నీ యిప్పుడు జ్ఞాపకము తెచ్చుకొని అమలుపరచానంటే ఎంతసేపు క్షణాలమీద...

ప్రకా — ఎంత చేసినా రాజ్యం! యి దేదో ఓనమాల విద్యార్థినిరా అనుకుంటారు ప్రాథక్యం కావాలి. ఎవరయినా నీవంక చూస్తే నేను ప్రకాశరావును కాదు. అంత దద్దమ్మ లుంటారా లోకంలో.

రాజ్యం — తొందరపట్టం ఎందుకు? ముందు భోజనాలు కానీయండి.

* * * *

(రెణ్ణెల్ల తరువాత)

రంగారావు— ఇదేమిట్రా. ఇంతరాత్రి యిట్లా పరిగెత్తి వచ్చావు. ఎవరికయినా జబ్బుగా వుందా? పిల్లలు రాజ్యం బాగున్నారా?

ప్రకాశ — నాకు ఉక్కిరిబిక్కిరి అవుతోందిరా. నా కోకప్పు కాఫీ యివ్వరా. వారంరోజు లయింది అన్నం తిని. చేయి కాలింతరువాత ఆకు లేం లాభంరా. తాడు తెగేవరకు లాగాను.

రంగా — ముందు కాఫీ తాగి మెల్లగా మాట్లాడు. ఆయాసపడకు. నీవు ఆలోచనలేనిమనిషివి మొదట్నుంచీ.

ప్రకాశ — నాసంగతి ఎవరికీ చెప్పకు. నాతో మాట్లాడటానికి తలెత్తని రాజ్యం రాత్రి ౧౧ గంటలకు కార్లో వెళ్లిందిరా! యిప్పుడు నాబాధ తీర్చరా రంగా! నీభార్యావాళ్లు అవతలగదిలో వున్నారా?

రంగా — ఇక్కడ ఎవరూ లేరు; వాళ్లంతా అవతల గదిలో వున్నారు. అందరికీ నీలాగ రాత్రిళ్లు శివాలెక్కుతాయా? ఆమంచంమీద పడుకో కొంచెంసేపు, ఆయాసం తీర్చుకో.

ప్రకాశ — నాకు నరాలన్నీ కాలిపోతున్నాయిరా. నిద్ర రాదు విశ్రాంతి వద్దు.

రంగా — నీబాధేమిటో చెప్పు, నాచేతులో వుంటే తీరుస్తాను. — ఆఁ, రాజ్యం కార్లో వెళ్లిందా? ఏం జర్తే! ఎక్కడి కెళ్లిం దసలు?

[ప్రకాశరావు వణికిపాట్లు పడుతూ కథంతా విశదీకరించాడు. రౌద్రాకారంతో,]

ఓరేయి రంగా! నే కొనిచ్చిన చీరా రవికతో నాదగ్గర ముద్దుగా పెరిగిన దేహంతో, నే తెచ్చిన పూలతో, నాడబ్బుతో కారు తెచ్చుకుని ...

రంగా — ఓరి పిచ్చివాడా! ఎడ్యుకేటెడ్ భార్యలు కూడా లోకంలో వుంటారనుకోలే. నీకు ఏది చదివితే అదిచ్చే పట్టుదలేది చిన్నప్పుడు కూడా. నీవాగుడికి మంచిమందు వేసింది. నీకు ఆవిడ స్వభావం బాగా తెలీలా, యిన్నాళ్లు కాపురం చేసినా. వెళ్దాం పద యింటికి.

ప్రకా — అంతేట్రా. అయితే టాక్సీ తెప్పించు నీవు వెనకనుంచి రా. నే వెళ్తా యిప్పుడు.

# విముక్తజీవనాన్వేషణము

శ్రీ అత్తిలి స్వరాజ్యలక్ష్మి

ఆనాటిస్మృతి యెంతమాత్రము పురాణగాథలలో సైత మెచ్చోటను గాన్పింపదు. నక్షత్రకోటు లనంతాకాశమున వ్యాకులము లగ పరిభ్రమించుచుండినవి. తద్భ్రమణజనితనాద మేదో మహాకరుణరోదనమున కిసుమంతయుఁ దీసిపోకుండెను. ఆదినములలో పృథ్వి సూర్యునిలోని యొకయంగము గనే యుండి, యాయపరిమితజ్వాలాపుంజమున ఖేలన మొనర్చుచుండెను. అనంత శూన్యము తారకాగణము మిలమిల మెరసి పోవుచు, ప్రకాశించుచుండుట యరసిన యామెచిన్నారిహృదయమున తానును వానితో కలసి మెలసి, వానిలో తాను నొకటినై యపారగగనమున పరుగులువారుచు నుబ్బి తబ్బిబ్బులు కావలయునని యెన్నెన్నో కోరిక లుఱ్ఱూత లూగుచుండెను.

ఒకనా డాధరిత్రీరమణి యధీరయై, "తండ్రీ! వా రంద రెవరు? ఎంత సుఖజీవనులు వారు!" అన్నది సూర్యభగవానునితో.

ఆమహాగ్నిసాగర మొకకొంచెము విచలిత మయ్యెను. "పుత్రీ! వారందఱు నాటలాడుకొనుచుండుటలేదు. తమతమకర్మఫలముల ననుభవించుచున్నారు" అని తజ్జ్వాలల నుండి శబ్ద మొకటి వెలువడినది. "అది యెట్లు తండ్రీ! వా రెంతో సుఖులుగాఁ గాన్పించుచున్నారే!" యని పృథ్వి యుత్సుకతతోఁ బ్రశ్నించినది.

కొన్ని క్షణములవఱకు జ్వాలాసమూహమున కాలిమచ్ఛాయ వ్యాపించి, యంతలో నొక గంభీరనాద ముత్పన్నమయ్యెను. "పుత్రీ! వారు నిజముగనే సుఖవంతులు కారు. నే నెట్లు దుఃఖితుండనో, ఎట్లు పశ్చాత్తాపాగ్నిలో జ్వలించిపోవువాఁడనో, యవి యన్నియు నట్టివే. ఒకప్పుడు నేనును వారును కూడ ననంతశక్తిపిండమున క్రీడ యొనర్చుచుంటిమి. పిమ్మట మే మెల్లరము నొక్కొక్కరుగా ముక్తజీవనాన్వేషణమున ప్రత్యేకమై పోయితిమి. ఈశూన్యమున యుగముల తరబడిని పరిభ్రమణ మొనర్చుచునే యుండినను, ముక్తి ఛాయామాత్రమైన లభింపనేలేదు. లభించినది యొక్క...."

అజ్ఞానప్రపూర్ణయగు పృథ్వి యాతని భాషణముల కడ్డువచ్చి, "ముక్తజీవనమా? అది యెట్లు లంభించును?" అని కుతూహలముతో నడిగినది.

"అనంతపిండముతోడి యేకరూపతయే యనంతముక్తి. కాని, ఇపుడో! మే మందరమును దాని కెంత దూరగులము!" అను ప్రత్యుత్తరము వచ్చెను. అంతలోనే యొక వేదనాపూర్ణనిశ్వాసము, ఒక కరుణకంపనము సర్వత్ర వ్యాప్తమై, "ఆమహాపిండము దిశను ఇక ప్రత్యావర్తన మెన్నటికో!" అని వినిపించెను.

పృథ్వి విహ్వలించిపోయినది. కాని, యిప్పటికి నా మెకుతూహలము శాంతము కాక,

"తండ్రీ! అటులే యగునో, నిచ్చటి మా సమ్ముఖములగు నగ్నిస్ఫులింగము లేవియు నాటలాడుచుండుటయే లేదా?" అని యడిగెను.

"పుత్రీ! ఇవియును నీవలెనే నా యొడిలో నాడుకొనుచుండెడివి. క్రీడాలాలసతయు, ముక్తిజిజ్ఞాసయు, వీని నొకటొకటిగా నాయొడినుండి లాగుకొనిపోయినవి. ఇవి యిప్పుడు మెల్ల మెల్లగా నా కెంతయు దూరదూరముగా పోవుచునేయున్నవి. నా స్నేహముకూడ వీని నాపలేకపోయినది. ఈ స్నేహావహేళనము పరంపరాగతమే యని యిప్పుడు సువ్యక్త మగుచున్నది!" అను వేదనా వాత్సల్యమిళితములగు భాషణము లప్పుడు ధ్వనితము లైనవి.

పృథ్వి యప్రతిభయై, "ఏల? ఎట్లు?" అని యడుగ సాగినది.

"నేను నిట్లే మహాశక్తి నవహేళనము చేసియుంటిని. పిమ్మట నా గ్రహకూటము నట్లే యొనర్చినది. ఈనాడు నీహృదయము నందు నదేభావ మంకురిత మగుచున్నది."

పృథ్వి వినియు విననట్లూరకుండి, యూసుదూర చాంచల్యమున పరిభ్రమించు తారకాగణమును వీక్షింపఁజొచ్చినది.

* * *

పృథ్వి క్రీడోత్కంఠత యధికతరము కాఁజొచ్చినది. సూర్యునియెడల నామెకుఁ గల ప్రేమ యంతయు నీభావమున లీనమై పోయినది. తుద కొకనాఁ డామె ప్రబలవేగమున దిర్దిర తిరిగిపోవుచు సూర్యుని కెడము కాక తప్పినదికాదు. ఒక్కక్షణ మామె యానందసాగరమున నిర్మగ్న యయ్యెను. తన సర్వబంధములు, సర్వసీమలును చూర్ణవిచూర్ణమయిన ట్లామెకు తోఁచినది. ఇపు డామె యెంత స్వతంత్ర! ఆమె హృదయమున నుత్కంఠామహాతరంగము లుప్పొంగ సాగెను. ఆ సంతృప్తిసాగరమున నామె యూ కాంతాస్వరూపమే కాన్పింపలేదు. అందు మునిగిపోయినదో, యేమో!

కాని, యుత్తరక్షణముననే యామె శంకాపీడితయై వణఁకసాగెను. అనంతాకాశమున నామె యొంటియై ముక్తజీవన మెచట నన్వేషింపవలెను? ఆమె సూర్యునివైపు చూచినది. అతఁడు చాలదూరమున, దూరమున నున్న తారలలో నొకటిగఁ గాన్పించెను.

మరల కొన్ని యుగములవరకు నాకాశమున నేదియు నిట్లు తప్పించుకొని పోవఁ దలఁపలేదు. పృథ్వీహృదయాన క్రీడాన్వేషణమందలి యుత్సాహము వినష్టమై పోయినదా యనునట్లుండెను. ఇపు డామె సూర్యునిదెసఁ జూచినచో మున్నెన్నఁడు ననుభవించి యెఱుంగని విచిత్రభావము లుత్పన్నములు కాఁజొచ్చినవి. క్రమక్రమముగా నామెయం దుదాసీనతయు, నిరాశయు వ్యాపించుచుండ, నామె హృదయమందే యొకభాగమగు చంద్రుఁడు నామెనుండి విడిపడియెను. అపుడు పూర్వపు క్రీడాన్వేషణోత్కంఠ యొకటే మారు స్నేహజ్వాలలుగా పరిణతమై బాహ్యావరణములను జీల్చికొని వికటవేగమున నీవలికి వచ్చి పడియెను. దూరాన ప్రజ్వలించు సూర్యునిఁ గాంచినంతనే యామె తనలో తానే, "స్నేహావహేళనము పరంపరాగతమా?" అనుకొనియెను. అప్పటినుండియు ధరణిలో భావోద్రేకము కలిగినపు డెల్ల

నాంతరంగికాగ్ని బయటికి వచ్చివేయు చుండును.

ఇప్పు డామె నిట్టూర్పులు పుచ్చి, "నక్షత్రము లాడుకొనుచుండుట లేదు; ఆక్రందన మొనర్చుచున్నవి. అవి చంచలములు కావు; విహ్వలములు... ఈ స్నేహవిరాశాజ్వాలలు హృదయమునఁ దాల్చి, నే నింక నెన్ని నాళ్లు తిరుగవలయు నిట్లు? హా, తండ్రీ!" అనుకొనినది.

భూముఖముపై దొలగింపరాని వేదనా రేఖ లుత్పన్నము లైనవి. ఈనాటికిని కాలము వానిని తుడిచివేయ నేరకున్నది. వ్యథాబాధితయై పృథ్వి కఠోరయు నిశ్చేతయు నైనది.

పృథ్వి కృశించుచున్న చంద్రుని వెలవెలపోవుమోము జూచి చూచి, చింతిత యగుచుండెను. చంద్రుఁ డామెవైపు జాలి యొలుకు చూపులఁ జూడసాగెను. ఆ దృష్టి యందు వేదన, పశ్చాత్తాపము, ప్రార్థనము, సర్వము మగ్నములై యుండెను. ఆతని హృదయస్పందనము భూమి కతిక్షీణముగ వినఁబడుచుండెను. "ఇపు డేమగు" నని భూమి యాలోచించినది. అంతలోనే చంద్రుఁడు తన క్షీణాంగుళి శూన్యముదెస మెల్లగా చాచి, "చూడు!" అనియెను.

పృథ్వి యటు వీక్షించెను. రెండుగోళములు గిరగిర తిరుగుచు నొండొంటిని ఢీకొని, శకలములై, వికలములై, శూన్యమున నస్తమించిపోయెను. పృథ్వి కంపించెను. భూమిపై వసియించు గణనాతీత ప్రాణికోటి తత్కంపనమున విలీనమయ్యెను. భూమి యాలోచనలోఁ బడినది—"ఇదియేనా ముక్తజీవనాన్వేషణము? ఇదేనా యీ యమర జిజ్ఞాస?..."

* * *

ఈ మహాశక్తియం దొకయంశమగు మానవుఁడును తన లఘుజీవనసమస్యలందు నీపరంపరాగత ప్రశ్నావళిచేతనే కంపించి పోవుచున్నాడు. - ఒకవేళ, వీనికి నదే యుత్తరమేమో!

(హిందీనుండి.)



# ఉన్మాది

శ్రీ నళినీకాంతరావు

'రాజా'కి

"ఇది నేను ప్రత్యహం పడుతూన్న బాధ. తెలిసో, తెలియకో పదిమందీ పడుతూన్న బాధ. పడునైన ప్రతిమనిషీ తప్పకుండా పడేబాధ. ఇది మబ్బుగా, చీకటిగా, మందమందంగా తోచే మాయబాధ. మన మనఃక్షణమూ — ఎరిగీ, ఎరగకా — అనుభవిస్తూన్న వింతవేదన. అర్థంకాని అగాధ వ్యాకులత. ఒకజాడ్యం — ఊఁహుఁ — ఒక విదాహం, వెర్రి ఆకలి. ఎముకలు పిప్పిచేసే తీవ్రవాంఛ, ఆవురావురుమనే భీకర అసంతృప్తి. బ్రతుకంతా బావురుమనే పెద్దఖాళీ:..

దీన్ని ఉత్తి ఉన్మాదంకింద తీసిపారెయ్యకండి —

జీవితమంతా ఒక్కవిధంగా వేధించే ఈ మహాబాధ ఆఖరికర్థమైంది. ఒక సృష్టి రహస్యం అమాంతంగా కరతలామలకమైపోయింది. మనది మొదలూ — చివరా లేని ఒకటే ఒంటరితనం! ఈఏకాంతం తప్పించుకోడానికే మనం పడే పాట్లన్నీ, చేసేపనులన్నీ.

నేను భయంకరమైన ఏకాకిత్వంలో బ్రతుకుతున్నా! ఈవాస్తవం తెల్లమైంది మొదలు పీడిస్తూన్న పాడుబాధ కొన్నాళ్లు సహించాను; దీని నేదీ తుదముట్టించలేదని నాకు తెలుసు. ఏదీ! — వింటున్నారా? ఎంతతంటాలుపడ్డా, ఏంచేసినా; ఎంతబాధపడ్డా; ఎలాంటి ముద్దుపెట్టినా, ఎంతగట్టిగా కౌగలించినా — మన మెప్పుడూ ఒంటిగాళ్లమే! ప్రాణం తినేసే ప్రత్యేకభావమే!

ఇల్లంటే చెప్పరానిబెంగ, పెద్దభయం. బావురుమంటూన్న ఇంట్లో ఉండలేక, ఇకడికీ అకడికీ వెళ్లిపోతుంటాను — ఇప్పుడు మీతో మాట్లాడుతున్నా. మీరు వింటున్నారు. ఏం లాభమంటాను? ఉభయులం ఏకతంగానే ఉన్నాం. ఒకరికొక్క నొకరముండీ ఎడంగానే ఉన్నాం... తెలిసిందా?

కల్లబొల్లిసుకాల్లో కళ్లు మూసుకుని కలలు కనడం నాచేత కాలేదు. ఈ ఒంటరి వ్యసనం దాపరిచింది. బుజాలరాపిడి మినహా ఇతరసంపర్కం లేకుండా, అంతులేని ఒంటిపాటు నవగతం చేసికొన్నా ననే గర్వమైన తృప్తివినా వేరు సంతోషం ఎరగకుండా ... వెర్రెత్తినట్టు తిరుగుతున్నా నీ ప్రపంచంలో.

నా కొంచెం మతి చెడిందని మొహమొహాలు చూసుకొంటున్నారు, అవునా?

ఇలా వినండి. ఈ దిక్కుమాలి నవస్థ ప్రాప్తించింది లగాయతు, అంచూ దరీ తెలీకుండా అలా ఆనాటి కానాడు ఏదో అంధకారకూపంలో అడుగడుక్కీ దిగబడి పోతున్నట్టు బాధపడతా. చుట్టుపక్కల నెవరూ లేకుండా, నాలా విషాదయాత్ర సాగిస్తూన్న మరోజీవి తోడు లేకుండా ఇలా ఒక్కణ్ణే కుంగిపోతున్నా. ఈకూపం -జీవితం. ఒక్కొక్కప్పు డేవో సందళ్లు, ఎవేవో కంఠాలు, అరుపులూ వినిపించి ఆ గందర గోళంకేసి వెడతా. కాని, ఎక్కడినుండి వచ్చిందో ఆగోల ఎప్పుడూ సరిగ్గా తెలియ లేదు. ఒకళ్లూ తారసిల్లరు ; ఆవరించిన ఈ కారుచీకట్లో ఇం కెవరూ కనిపించరు ; "మన మందరం ఎడారిలో ఉన్నాం: పరస్పరం అర్థం కాము."—

అంతే- ఎవరూ ఎవ్వరికీ అర్థంకారు. ఎంత చెప్పినా, తల బ్రద్దలు చేసికొన్నా, ఎన్ని తిప్పలు పడ్డా. కొన్నిటి మిన్కు మిన్కుమనే కాంతి తప్ప వేరేవీ కనబడ నంత దూరంలో విశాలాకాశంలో అగ్ని కణాల్లా రుప్పిన ఆనక్షత్ర సముదాయంలో ఏం జరుగుతోందో భూమ్మీదివాళ్ల కేం తెలుసు? ఆ అనంతపథంలో అంతర్హిత మైపో యిన మిగతా కోటానుకోట్ల సంగతి ఏం చెప్పగలం ? మాట్లాడ లేం ?—

మరొకనిలో ఏముందో మనిషికూడా అంతమాత్రమే గ్రహిస్తున్నాడు. నక్షత్రం నక్షత్రంకంటె పరస్పరం మన మెక్కువ దూరంలో ఉన్నాం. మన ఒంటిపాటు పదిరెట్లు - వెయ్యిరెట్లు అధికం. తలపోత లోతు తెలియలేం కనక. మన మర్థం చేసికోలేని మనుష్యులతో ఈ నిత్య సంప ర్కంకంటె ఘోరమైన దేముంది? చాచిన చేతుల్తో - చేరడంమాత్ర మెన్నడూ లేకుండా ఎంతో దగ్గరివాళ్లలాగ, కలిపి కట్టేసినట్టుగా, ఒండొరులం ప్రేమించుకుం టాం. ఐక్యంకోసం పూరికే ఇదయిపోడం చాలా ఇబ్బంది కలిగిస్తుంది. కాని, మనశ్రమ లన్నీ వృథా, ప్రాకులాట నిరుపయోగం, నమ్మకాలు వ్యర్థం, కౌగలింతలు పని చెయ్యవు. కలియాలని ఉద్రూత లూగేనరికి మన ఆకస్మిక మనోవికారాలు మధ్య నిల్చి మనల్ని డీకొన చేస్తాయి....

ఏ స్నేహితునికో ఈహృదయం విప్పి చెప్పేటపుడే ఎక్కడలేని ఒంటరితనం నన్ను బాధిస్తుంది. అప్పుడే దాటరాని ఈ అడ్డంకి బాగా బోధపడుతుంది. నామిత్రుడు పక్కనే ఉన్నాడు. అతని తేటకళ్లు నాపైని ప్రసరిస్తు న్నాయి. కాని, కాని - కదిలే ఆకళ్ల వెనక మెదులుతూన్న ఆత్మమాత్రం దృగ్గోచరం కాదు. హుఁ. నే చెబుతూన్నది వింటాడు. ఏమనుకుంటున్నాడో ?— ఈయాతన మీా కర్థం కాదు. నన్ను ద్వేషిస్తున్నాడో, నిరసి స్తున్నాడో, వెక్కిరిస్తున్నాడో ? నే నన్నది విమర్శించి నన్నతిసామాన్యునిగానో, ఒట్టి తెలివిమాలినవానినిగానో జమకడతా డను కొంటాను. ఏం ?- అసలు వినడమే లేదేమో? అతని ఆలోచన లెలాగ తెలుసుకోడం? నే

నతన్ని ప్రేమించినట్టుగా నన్నూ ప్రేమిస్తున్నాడో లేదో కనుక్కోడ మెలాగ ? ఆ చిన్నతలకాయలో ఏముందో ? అబ్బా, అంతా అయోమయం! విశదపడని మనిషి ఆలోచన - నిగూఢం, స్వతంత్రమైన ఆలోచన - ప్రాణాంతకమైన ఆలోచన ఎంతమిస్టరీ! దీని నాకళించాలేం, అదుపులో పెట్టాలేం; శాసించాలేం, సాధించనూలేం.

ఇంక నేను! - నా జీవనసర్వస్వం సమర్పించుకుందామనీ, నా ఆత్మద్వారాలన్నీ తెరిచి పెట్టేదామనీ ఎంతో, ఎంతో ఉబలాటపడతా. చూడగా - నే నింకా ఆ అగాధంలోనే- అట్టడుగున - ఇతరులు ప్రవేశింప శక్యంకాని నా రహస్యవాసంలోనే దిగబడిపోయాను. దాని నెవరూ కనిపెట్టలేరు, చొరలేరు. నన్ను పోలినవా ళ్లుండటం దుర్లభం ఒకరినొకరు గ్రహించడం దుర్ఘటం...

మీకైనా ఇపు డర్థమయా ననుకొంటా —లేదు! వీడికి మతిపోయిం దనుకుంటున్నారు. పరిశీలనగా పరికిస్తున్నారు. పరికించి వెరగుపడుతున్నారు. 'ఇంతట్లోకి ఏమొచ్చిం దని' తెల్లబోయి చూస్తున్నారు. ఒద్దు! కాని, ఏనాడైనా దారుణం, దుర్గ్రాహ్యమైన నా ఆవేదన, నా ఆరాటం ఇంత గ్రహించగలిగినట్టయితే, నాదగ్గిరి కొచ్చి 'నిన్ను తెలుసుకొన్నానోయ్!' అనండి చాలు. చాలు: ఒకనిమిషమైనా రవంత శాంతి కల్పిస్తారు.........స్త్రీలమూలంగా నా ఒంటరి బ్రతుకు, నా దిక్కుమాలినస్థితి మరింత ఘోరంగా తెలిసిపోయింది. అబ్బబ్బా! స్త్రీలనుంచి యమయాతన పడిపోయాను. పురుషుల్నిమించి స్త్రీలే నేనొంటరిని కానని వెర్రిభ్రమ కలగచేశారు.— ప్రేమావిష్టునికి తా నేదో విశ్వమంతా విరిసిపోతోన్నట్టు, మహదానంద మేదో తన్ను చుట్టుకొన్నట్టు వెర్రిగా ఉంటుంది. ఎందుచేతనో కనిపెట్టారా? ఇంకేం కాదు; — తా నింక ఏకాకిని కానని భావిస్తాడు. ఒంటిపాటు, అసహాయత్వము అంతరించినట్టు కనిపిస్తాయి. ఎంత పొరపాటు!

దీర్ఘకేశాలతో, మోహనరూపంతో, ప్రణయవీక్షణాలతో మురిపించే వ్యక్తిముందర వెళ్లబుచ్చినగడియ లెంత మధురమధురమో మీకు చెప్పనవసరంలేదు. ఆ ఉద్రేకంలో, విభ్రాంతిలో, ఆబుద్ధిమాంద్యంలో—అపుడే ఆత్మలు రెండూ ఏకమైపోతా యనిపిస్తుంది. అంతే. ఆ 'అపుడే'మాత్రం ఎప్పుడూ రాదు. వారాలతరబడిని అలా వెర్రిఆసతో, నమ్మడానికి వీల్లేని ఉత్సాహంలో ఉండుండి చివరికోనాడు పూర్వంకన్నా ఎక్కువ ఒంటరిగా ఉన్నట్టు తెలుసుకుంటాం. ప్రతిముద్దు చివరా, ప్రతికౌగలింతతరవాతా, ఈ దిక్కుమాలిన బాధ ఎక్కువౌతుంది. ఎంత దారుణంగా బాధపడతాం!

అగమ్యగోచరమైన ఆ అన్యోన్యభావంలో అభిప్రాయాలు - ఆశలు పూర్తిగా కలిసిపోయి ఆమె అంతరాంతరం అవగాహనైపోతోం దని తోచే ఆ ముహూర్తంలోనే

ఒక్కమాట, ఒకేమాట హఠాత్తుగా మన ళ్లు తెరుస్తుంది, మధ్యనున్న భయంకర అఖాతం మెరుపులా చూపెడుతుంది... వినా, — మన ప్రియురాలిదగ్గిర — ఉబికి పోయే ఆ భావోద్రేకంలోనే అంత హాయిగా కంటూ - కిక్కురు మనకుండా ఒకరాత్రి గడపడంలాంటి మహాదృష్టం ఇంకోటిలేదు. ఈప్రపంచంలో! — అంతకంటె ఎక్కువడ నొద్దు - ఇంతవర కేరెండుప్రాణులు ఒకటి కాలేదు!

నామట్టుకు ఆత్మ మూసి కూర్చున్నా ఎపుడు. నానమ్మకాలు, ఇష్టాలు, ఆలోచనలు ఇతరులతో చర్చించడము మానేశాను. ఒంటిగా బ్రతకడం మన ప్రారబ్ధమని బోధ పడింది మొదలు నామనోభావాలన్నీ మరుగు పరిచాను. ఉద్దేశాలతోటి, నమ్మకాలతోటి —వాదనలతో నా కేమవసరం? ఎవ్వరితో నూ కూడలేక తొలగి అందరికీ దూరంగా ఉండిపోయాను. అదృశ్యమైన నా ఆత్మ గుట్టు గానే ఉండిపోయింది. దినమూ ఎదుర్కొనే ప్రశ్నలకి మామూలు జవాబులు నోరు కద పడానికే ఇష్టం కానపుడు - చెవివారనే చిరు నవ్వు జాగ్రత్తపెట్టాను.—

అర్థమౌతోందా? అలా చూస్తున్నా రేం ఇదంతా నిష్ఠామహాశ్య మనుకుంటున్నారా, ఉన్మాదంకింద తోసిపారేస్తున్నారా? బుద్ధి శాలి నని బుర్ర లాడిస్తున్నారా, బోధ పడక తెల్లబోతున్నారా?"

---

# నా గు ట్టు

'పరాశర'

వేపించు లోకంపు విసపు దృష్టులు తొలగ
వేగిరించే వలపు విధమంత లో నణచి
అతి గుట్టుగా బరువు బ్రతుకు ఈడ్చుచునుండ,
వెలిబుచ్చినది నన్ను వాడు వారినమోము.
'భావనా లోకంపు బడబానలము నిన్ను
బాధించునా'యనుచు పరిహాసించెను జనము.

---

# పుస్తక సమీక్ష

## నాడు - నేడు

గ్రంథకర్త ఏ. అడయంకో. అనువాదకుడు: రామమోహన్. వెల ౧-౮-౦. విశ్వసాహిత్య మాల—ముంగండ. అంబాజీపేటపోష్టు.

ఇది రష్యాప్రజల జీవితానికి సంబంధించిన ఒక నవల. నాడు - నేడు అనేశబ్దాలే చెప్పేకథ రెండు భాగాల్లో ఉందని సూచిస్తోంది. ఇందులో సన్యా అనే వ్యక్తి తన జీవితగాథను సవిస్తరంగా చెపుతాడు. ఒక విధంగా ఇది 'ఆత్మకథ'. సన్యాయొక్క తాతపేరు నికనోర్. తండ్రి ఓస్టప్. నికనోర్ చాలా బలం, ప్రాణశక్తి కలమనిషి. అతనిజీవితం అంతా కష్టాలతోనే గడచిపోయింది. ఆఖరుకు అతడు పిచ్చివాడవుతాడు. అప్పు డతను తన ఆత్మకథ చెపుతాడు మనమలకు— "అనగా అనగా ఒక ఊరు. ఆవూళ్లో ఒకమనిషి వుండే వాడు, చాలా బలమైనవాడు, శక్తిమంతుడు. ఆశక్తి కూడా అంతా - ఇంతా శక్తి కాదు, రాక్షసిబలం. రెండుచేతుల మధ్య నొక్కి, వల్లరాళ్లనికూడా గుండ - పిండి చేసి పారవేసేవాడు. వట్టి ఇనుము అనుకోండి. మరెందుకు కాని అతనికి ఉన్నదల్లా అబలమే. ఏదేవుడు గాని, ఏదెయ్యంగాని, అతనికి అంతకంటే వే రేమీ ఈయలేదు. ఎంతబలం ఉంటేనేం? వట్టి దరిద్రుడు! అభాగ్యుడు! పాపం ఎప్పుడూ సుఖపడాలని అనుకొనేవాడు. సుఖంకోసం ఎంత బరువుపనికైనా సిద్ధం అయ్యేవాడు? ఎంత శ్రమపడిఅయినా సరే ఆ సుఖంకోసం దానివెంటబడి పరుగెత్తేవాడు. కాళ్లు నొప్పులు పుట్టేయి. పరుగు ఆపలేదు. ఒగర్పు పుట్టింది. ఊహూం. ఆగలేదు. ఆఖరుకి ఆసుఖదేవతకే దయ పుట్టి తనంత తాను అతనికౌగిటికి దొరికింది. కాని సుఖదేవత అతనిని సుఖపెట్టడానికి దగ్గిర చేరలేదు. హింసన చేయడానికి - ఏడిపించడానికి - నాశనం చేయడానికి - అతనిజీవితాన్ని నాశనంచేయడానికి — మాత్రమే అతని దగ్గిరకి వచ్చింది...అప్పుడు ఆకథలోనిమనిషిచేయవలసిందేమిటి? అంతకష్టమూ పడి చేజిక్కించుకొన్న ఆసుఖ స్వప్నం ఇట్టే చూసేటప్పటికి కరిగిపోయి ఊరుకుంది. ఆ కౌగిలింతలో మిగిలినది కేవలమూ బొగ్గులూ-బూడిదా మాత్రమే. ఇప్పుడు ఆలోచించండి, అతడు ఎంత బాధ పడతాడో, తల నేల కెట్టి కొట్టుకున్నాడు, పళ్లు విరుగ కొట్టుకున్నాడు, జుట్టు పీకుకున్నాడు. కళ్లు పొడుచుకున్నాడు.— ఆ రోజు మొదలుకొని ఆ దురదృష్టవంతుడు పిధులుపట్టిపోయేడు. అతనికి ఎక్కడా శాంతిగాని, సంతోషంగాని దొరకలేదు. ఇంక చచ్చిపోయేక గోరీలో పడుక్కుని అక్కడ పెరిగిన రేగుచెట్ల ఆకుల ధ్వనులు వింటూ ఉంటే ఏమైనా శాంతి లభిస్తుందేమో మరి."

ఇదీ తాతకథ. చాలా రోజులవరకూ మంచం పట్టిపోయి చివరకు చనిపోతాడు. తరువాత సన్యా యొక్క తల్లి, తండ్రి, సోదరులు సోదరి అంతా ఒక్కొక్కళ్లే, అతన్ని విడిచిపోతారు. ఇక ప్రపంచంలో సన్యా ఒక్కడే. అతని తాత అష్టకష్టాలు పడి 'బురద గుంట' లో కట్టిన గుడిసె ఇప్పుడు నిరర్థకం. నా అన్నవాళ్లు లేనప్పుడు ఆ గుడిసెవల్ల ప్రయోజనం ఏముంది? గుడిసె ముందరికి వెళ్లినప్పుడల్లా ఏడుపేగాని నవ్వు రాదుగా మరి.

అప్పటికి సన్యావయస్సు పదమూడేళ్లు. 'లింగ్స' అనే ఒక జేబుదొంగలమేస్త్రీతో పరిచయం కలుగుతుంది. నెమ్మదినెమ్మదిగా ఆ చిన్న వయస్సులోనే సన్యా 'గజదొంగ' పదవిని అలంకరిస్తాడు కాని అక్కడా అతనికి నిలకడ కుదరలేదు. తరువాత మిలిటరీలో చేరుతాడు. మిలిటరీ యజమానియొక్క ఆగ్రహానికి గురియై అక్కడినుండి వెళ్లిపోతాడు. ఒక అనాథాలయంలోకి చేరుకుంటాడు కాని కాళ్లకని వదిలేకమా! తరువాత ఇంజన్లలో బొగ్గువేయటానికి పోతాడు. అక్కడా నిలకడ లేకుండా పోయే పరిస్థితి దాపురించింది. కాని ఎలాగైతేనేం, నిలద్రొక్కుకుని ఇంజను డ్రైవరు పరీక్ష ప్యాసవుతాడు. అతనితోపాటు ఇంకా కొంతమంది అతని సాయంవల్ల ఆ పరీక్షలో కృతార్థులౌతారు. చివరికి లీనా అను యువతిమీద అతనికి ప్రేమ కలుగుతుంది.

పన్నా పుట్టుకవరకు కథను రచయితయే నడిపిస్తాడు. పన్నాకు కొంచెం జ్ఞానంవచ్చినతర్వాత అతనే ప్రతిఘట్టాన్ని వివరిస్తాడు. కుటుంబంలో ఉన్నంత వరకు అతని జీవితం 'నాడు', తరువాతిది 'నేడు.'

మొదటిభాగంలోకథ మహోఘాటుగా ముందుకు సాగింది. తరువాత ఆత్మకథగా మార్చకుండా ఉంటే బాగుండును అనిపిస్తుంది. మొదటిభాగంలోనికథ పాఠకునిమనస్సును కలిచివేస్తుంది. నికచేర్ జీవితం మహాకష్ట సంకులం, అందుకనే మహాద్భుతం. అతనిమనోభావాల్ని బహురమ్యంగా చిత్రించాడు కథకుడు. ఈ నవలకు ప్రాణం నికచేర్. ఆ పాత్రసృష్టి అద్భుతం.

ఇకపోతే రెండవపాత్ర పన్నా. పన్నా చాలా మురుకైనవాడు. పరిస్థితులు అతన్ని అనేకపాట్లకు గుంజుకుపోయినాయి. అతనిజీవితంలో వేగిరపాటు లేదు. పరిస్థితులు ఎలా తీసుకుపోతే అలా పోతాడు. కథకునిదృష్టిలో ఈనవలకు నాయకుడు పన్నా. అందు కనే అతనిజీవితాన్ని తూచా తప్పకుండా వర్ణించాడు. కథయొక్క రెండవభాగం రష్యాదేశపు కార్మికజీవితపు ఫొటో అని చెప్పవచ్చు. మొదటిభాగం అలా కాదు. అందులోనూ కార్మికుల దురదృష్టాలను,—త్రాగుడు వల్లను అధోగతికి పోయినవారిజీవితాలనూ, జీవితంలో సుఖమునేది ఎరుగక తమమానములను పణంపెట్టి అమ్ముకోవడానికి వెనుదిరగని యువతులజీవితాలను, దారిద్ర్యం వల్ల జ్ఞానశూన్యత హెచ్చి మనుష్యత్వం నశించి పశువుల్లాగ తయారుకావడం మొదలైనవిషయాలను కళ్లకు కట్టినట్లు లేఖకుడు చిత్రించాడు. అయినా అందుకే కాదు దాని గొప్పతనం. అందులో వాఙ్మయం వుంది. ముందెను గట్టిగా అదిమిపట్టి చదువవలసివస్తుంది కథ. నికచేర్ జీవితం పాఠకుణ్ణి ఎన్నెన్నో భావాల్లో, ఎన్నెన్నో మార్గాల్లోకి తీసుకుపోతుంది. అతనిబలం, అతని సుఖాసక్తి - చివరకు లభించిన పిచ్చితనం అబ్బ! ఎంతటి ట్రాజిడీ! ఎంతటిదయనీయమైన బ్రతుకు. ఈ ఒక్క పాత్రను సృష్టించినందుకే అనేయంకో ధన్యుడు.

సోషలిజందృష్టితోనే అనువాదకులు దీనిని అనువదించినారు. అయినా నాదృష్టిలో "అమ్మ" తరువాత "నాడు - నేడు" తెలుగువాఙ్మయానికి రెండవకానుక. అమ్మలాగు దీనిలోకథ ఓకేవిధంగా చివరవరకు నడవక పోయినా కథ హృదయాన్ని ఆకట్టుతోంది. "అమ్మ" లోని తెలుగుభాష మళ్లీ ఇందులో కనపడింది. అక్కడక్కడ గోదావరిజిల్లా వాడుకపదాలు వాడబడినా భాష ప్రవాహంవలె ధారాపట్టిగలిగి రమ్యంగా వుంది. "అమ్మ"ను ఆదరించినట్లు తెలుగుదేశం "నాడు-నేడు"ను కూడ ఆదరిస్తుందని ఆశ.

పోతే ఒక్కవిషయం. ఈ పరాయిధనాన్ని ఎరువు తెచ్చుకుని ఎంతకాలం ఈవిధంగా మనం సంతోషించడం?

వెంకటేశ్వరరావు.

---

## నాటికా గుచ్ఛము

కవి: పి. వి. రాజమన్నారు. ప్రకాశకులు: నవ్యసాహిత్య. పోస్టుబాక్సు ౨౨౬, వెల ౦-౬-౦.

ఈ గుచ్ఛంలో ముఖ్యంగా మూడు పుష్పాలున్నాయి. విముక్తి-మాతృప్రేమ-నిష్ఫలం. మూడింటికి ఒకటే కారణ ప్రేమ. రంగులలోను రీతులలోను మాత్రం మూడు మూడు మోస్తరులు.

మొదటిది విముక్తి. ఎత్తుగడలో బాగుండక పోయినా తరువాత తరువాత సాఫీగా నడిచింది రచన. కథ విషాదాంతం. చేతులారా విషాదాంతంగా వ్రాయాలని వ్రాసినట్టే కనిపిస్తుంది.

రాధ బాలవితంతువు. గర్భవతి. కేవలం ఒక్కతె అయితే బావిలోనో, నూతిలో చూచుకునే ఉండేది. ఇంకొకప్రాణం మూలాన్ని కామేశ్వరమ్మగారిని ఆదరించమని ఆశ్రయించింది. కామేశ్వరమ్మ వదినగారు సుబ్బమ్మ, వాళ్లు అన్నపరుషవాక్యాల మూలాన్ని అభిమానంకలిగి మూర్ఛపోయింది. తటాలున కామేశ్వరమ్మకొడుకు సత్యనారాయణ పడిపోకుండా చేతులలో పట్టుకుని ముఖంపైని నీళ్లు చల్లాడు. కండ్లు తెరచి సత్యనారాయణ్ణి చూచింది రాధ. కృతజ్ఞత వెల్లువగా కురుస్తాయి చూపులు ఆపళంగా వాళ్లకు ప్రేమ అంకురించింది. వినక ప్రేమ స్వరూపమే తెలియనిరోజుల్లో

అర్థతాత్పర్యాలులేని భావాలతో రాఘవరావుగారి కొడుకుని ప్రేమిస్తున్నా ననుకుని గర్భవతిఅయింది. ఇప్పుడు, ఎప్పుడూ ఎదురున్న సత్యాన్ని చూడ్డంతోటే ప్రేమస్వరూపాన్ని తెలుసుకున్నా నంటుంది. ఈ మోస్తరు ప్రేమ మహా చెడ్డది. మనయిష్టం వచ్చినరకంగా మసేతలకిపోతూ ఉంటుంది. తల్లిదండ్రులను వదలిపెట్టి రాధతో వేరేకాపురం పెడతాడు సత్యనారాయణ. మూడుమాసాలు కాలక్షేపం చేస్తారు. సత్యనారాయణకు ఎక్కడా ఉద్యోగం దొరకదు. చాలా కృశించి పోతాడు. ఎంతో ఘోరమైనపాపం చేస్తూన్నట్టు రాధకు దుఃఖం కలుగుతుంది. అందరి విముక్తికోసం ఆత్మహత్య చేసుకుంటుంది. బాగా డబ్బు ఉన్న మరో పుణ్యాత్ముడు అడ్డపడి ఆదుకుంటే యింకో ప్రేమ స్వరూపాన్ని పరికించి ఉండేదేమో. రాధ స్థైర్యంగల స్త్రీలా కనిపించదు. ప్రేమించానన్న సత్యనారాయణ కోసమేనా బ్రతికింది కాదే! పైపెచ్చు అతనికోసమే జీవితాన్ని త్యాగంచేసేసిం దంటారు!...ఏమో?

ఈ పుస్తకంలో మరో కథ ఉంది. సుబ్బమ్మగారి కూతురు సుభద్ర. బాలవితంతువే. ఈ కథకుమాత్రం పోషణ బాగా జరిగింది.

ఈపుస్తకం సృష్టించడంలో కర్తవ్యం ఉన్నట్టు కనిపించదు. ఏరకంగాను సంఘసంస్కరణకు సాయ పడదు.

రెండవది మాతృప్రేమ. రీతి చాలా అందంగా ఉంది. వాపవమాత్రం హేయం.

వేణు కోరి, ప్రేమించి, అనురాగంతో శారదను వివాహం చేసుకుంటాడు. కర్మరపాత్తు ఖాయిలా పడ

తాడు. మొదటిలో శారద విచారంతో అన్నపేనా తి జేసేకాదు. సత్యం పరీక్షలు కాగానే యింటికి వస్తాడు భార్య కృశించి పోవడం చూడలేక ఇతర విషయాల్లో కొంచెం ఆసక్తి తీసుకునేటట్టు చెయ్యరా మీ వదిన గారిని అంటాడు వేణు సత్యంతో. తరువాత కొన్నాళ్లకు రావడ భర్త దగ్గరకే వెళ్లడం మానేస్తుంది. ఆవిడలో అంతా మార్పు. సిల్కు చీరెలు, ఫేసుపౌడరులు, సినీమాలు, పికార్లు పెరిగిపోతాయి. వేణుకు అనుమానం, బాధ కలుగుతాయి. తన శారదకు తనమీద ప్రేమలేదు. కోడలు చర్యంతా తల్లికి తెలుసు. కొడుకుకు బాధ కలుగకుండా అంతా కప్పి పుచ్చుతుంది, మాతృప్రేమ మూలాన్ని. అసలు సంగతి... సత్యం...శారద... ఇప్పుడు మూడు మాసాలకడుపు. వేణు నిద్రమందు కావాలంటాడు. చేతులు తడబడినవి కాబోలు గ్లాసులో ఎక్కువ చుక్కలను పోసి యిస్తుంది: వేణు గాఢంగా నిద్రపోతాడు- పూర్తి నిద్ర. సత్యానికికూడ ఆవిడే తల్లి. తల్లికి అందరికొడుకుల మీద సమానప్రేమ ఉండదు మరి.

మూడవది నిప్పులం. మాడింటిలోను చక్కటిపువ్వు. వేశ్యకుకూడా హృదయం, ప్రేమ, విశ్వాసాలు ఉండవచ్చును. ఇది ఒక్క పెండ్లాడిన భార్యలసొత్తే కాదు. మరొకవిషయం; పెండ్లాడిన భార్యలలో బలవంతం పాతివ్రత్యం ఉంటే ఉండవచ్చు. వేశ్యలో పాతివ్రత్యం ఉంటే స్వతంత్రమైన స్వచ్ఛందవృత్తి-గణనీయమయినదే నిజంగా. కాని ఒక అనుంతరంమాత్రం ఉంది. వేశ్య వనితలో యాసుసుణాలు నిజంగా ఉన్నా నిరుపయోగాలు ఎవరి దోషం? తాడిక్రింద పాలుత్రాగిన మాస్తరయి పోతుంది.

ఆచంట సూర్యనారాయణమూర్తి.

---

## జాతకకథాగుచ్ఛము

(ఆంధ్రకావ్యమాలాపుష్పము, ౧). గ్రంథకర్త: శిరోమణి శ్రీ సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రిగారు. రచ్చ జీరా, గోపులను —సికింద్రాబాదు (దక్కన్). మూల్యము రు. ౧-౦-౦.

ఉదారాశయసందీపితమైనది ఉత్కృష్టసాహిత్యము. ఈయంశమును దృష్టినిడికొంటిమేని, సాహిత్యకళకును, తత్త్వశాస్త్రమునకును, మతమునకును అవినాభావ సంబంధము కలదని స్ఫురింపును. ఉదాత్తసత్యములను కథలం దుచ్చరించి మతాచార్యులు వాని నవలీలగ ప్రజల మనసుల కెక్కించిరి. ప్రపంచవాఙ్మయమం దీకథలకు మహోన్నతస్థానము కలదు. బైబిలుకథలును, రామకృష్ణ కథామృతమందలి కథలును సుప్రసిద్ధములు. బైబిలుకథలకు మున్దే జగతియందు ప్రసిద్ధములైనవి జాతకకథలు. శాక్యముని పూర్వభవముల యొక్కయంశమును దెలుపునవి. ఇవి నిర్మలనీతిబంధురములు. వీనిని పఠించినపుడు బౌద్ధమతమాహాత్మ్యము హృదయంగమమగును. ప్రాచీనభారత నాగరకతను సులభించిన వృత్తాంతము సుబోధకమగును. "బావేరు" జాతకమును పరిశీలించినపుడు, భారతీయులు ప్రాచీనకాలమున నౌకాయాత్రయం దాఱితేఱినవారనియు, బేబిలను మున్నగు దూరదేశములతో వాణిజ్యము చేయుచుండువారనియు, నెమళ్లు మున్నగు పక్షులనుకూడ గొంపోయి వానిగతులవలన లెక్కలను గుర్తించువారనియు గ్రహింతుము. ఆంధ్రరాజులు బౌద్ధమతపోషకులగుట, తెలుగునకును, పాళీభాషకును కొంతె సంబంధ మేర్పడినది. ఈయంశమును పరిశోధకులు గమనింపగలరు. కాని ఆంధ్రపండితులందు పాళీ నభ్యసించినవారెందఱో లేరు. కాని పాళీవాఙ్మయము సంస్కృతము ద్వారా కొంతవఱకు తెలుగుహృదయముల కెక్కినది. "సుంసుమార", "న్యగ్రోధమృగ", "వానరేంద్ర", "దధివాహన" "మహోషధ", "జవనహంస", "ఉత్సంగ", "ఉలూక", "వేదబ్బ" మున్నగు జాతకములు కొందఱికి పరిచితములైనవి. ప్రస్తుత గ్రంథకర్తగారు ఆర్యశూరుని సంస్కృత "జాతకమాల"నుండి యిరువదికథలను గైకొని పద్యరూపమున నీగ్రంథమును రచించిరి. ఇది బౌద్ధమతసిద్ధాంతములతో, నుదారాశయములతో, గంభీరభావములతో కూడిలపై యున్నది. "Sermon of the mount" మహోత్కృష్ట భావములతో నిండిన ఏసుబోధనమని సభ్యజగతి ఎఱుగును. ఈ ప్రబోధము ప్రపంచమున శ్రుతిగోచరము కాకమున్న దీనికంటె ఘనతర ప్రబోధము బౌద్ధవాఙ్మయమున కలదని ప్రస్తుతగ్రంథము చెప్పక చెప్పుచున్నది. శిబికథయును, దధీచికథయును గోరక్షణార్థమై

ఆత్మార్పణ మొనరించుకొనదలపడిన దిలీపునికథకును ఈడువచ్చుకథ లిందు గలవు. స్థలపరిమితికతన వీని నిందు వివరింపజాలము. ఉత్కృష్టత్యాగాశయమును దృష్టాంతీకరించు మూర్తులను పాఠకులు పరికింతురుగాక:

గీ. "కన్నఁ బరులు కొట్టుచున్నఁ దిట్టుచున్నఁ
జంపుచున్న నరుఁడు శాంతి విడక
రాతికంటెగట్టియైన ద్రవియించి రేఁటులై
పణచునట్లు నేయవలయుఁగాద!"

"ఒరపిడిసైన శాంతిఁ గాని
యుంటనె రత్నము ప్రోజ్జ్వలించుఁ; దన్
నలఁచిన వానికిం దరువు
నైకముగా ఫలపుష్పశాఖలన్
గరుణ వహించి యిచ్చుఁ గాని
శాంతియె; కొంచక కన్నఁ ద్రొక్కినన్
ధరణి వహించు జంతుతతిఁ
దాల్చియు శాంతి నిరంతరంబుగన్."

"పారపడితి నో! మునిముచ్చని......"

"శత్రునిగ్రహణక్రియాశక్తికన్న శాంతినిర్వహణక్రియాశక్తి మేలు."

గ్రంథము ఉపమలతోను, అర్థాంతరన్యాసాద్యలంకారములతోడను, "పానలదీసిన జాతిరత్నముల" వంటివైన పదజాలముతోను వెలయుచున్నది. చూడుడు:

"చక్రనేమిక్రమంబున జనుఁడు తిరుగు"
"పడితిఁబడ్డ రొంటకవనపుఁబైఁ జెమరొంపిఁ
గూలఁబడ్డ యేస్గునన్న భాతి
ముండ్లకొమ్మఁబడ్డ పట్టంబునై."
"తత్త్వశాస్త్రార్థముల నద్భుతముగఁ దెలుపు
నరఁటిపం డొల్చిపెట్టినకరణి"
"వయసురానట్టి పడుచుల వరకఁ గొన్ని
,, ,, ,, ,,
వృక్షములు తద్వనమునఁ గన్పించు నేయు"
"వసఁబోసిన పియూషము
వసివృన సంతప్తమైన స్వర్ణంబువలెన్
గడుఁగడు వెలుఁగుచునుంటివి"

"పులుఁగులరాయనిఁ గాంచిన
చిలువకువలె త్రాతె నృపతిశీర్షము సేలన్."
"కడవంతకాయమును లోఁ
బడుఁ గత్తికి; శౌర్యధైర్యబలసాహసవంతుఁ
డు వేఁడెంత?............... ,,"

ఈపద్యమందలి గంభీరభావమును గమనింపుఁడు:

క. "గలుల న్నలకఁగ రాఁగాఁ
బురందరుం డేకసంద్రముల దాఁగిన య
గ్గిరు లెల్ల నీవు నీంద్రుని
చరితకుఁ దలవాంచుకొనవె? సత్యముగ వివన్."

గ్రంథము ఆధునాతన ఆంధ్రసాహిత్యకి చక్కని కైనేత యనుట నిస్సంశయము.

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి.

---

## హైద్రాబాద్ రాజ్యాంగ సంస్కరణలు

అనువాదకుల: ఎల్లూర్తి మాణిక్యరావు. ప్రకాశకులు: అణా గ్రంథమాల, 3-1-౧౧ బి, తూర్పుబజారు. హైద్రాబాద్ - దక్కన్. వెల. ఒక అణా.

ఈమధ్య హైద్రాబాద్ సంస్థానమున సంస్కరణలను గూర్చి నైజాంగారిచే చేయబడిన ప్రభుత్వప్రకటనను, నైజాం ప్రధానామాత్యుడు సంస్కరణలను గూర్చి నైజాంగారికి పంపుకొనిన విజ్ఞాపనను ఇది ఆంధ్రానువాదము. నైజాంరాష్ట్రమున ఆంధ్రులు అధిక సంఖ్యాకులున్నను సంస్కరణప్రకాలిక ఇంగ్లీషులోను, ప్రభుత్వభాషయగు ఉర్దూలోనుమాత్రమే ప్రకటింపబడి, తెలుగుమాత్రమే తెలియువారి కందుబాటులో లేని లోపమును ఈ పుస్తకము తీర్చి ప్రభుత్వకర్తవ్యమును నెరవేర్చుచున్నది. ప్రభుత్వ ప్రకటనము వలెనే ఈ పుస్తకముగూడ అణా ధర కలిగియుండి ఎల్లర కందుబాటులో నుండుట ప్రశంసనీయము.

ఇందు రెండు భాగము లున్నవి. మొదటిది మాడపాటి హనుమంతరావుగారు వ్రాసిన పీఠిక, రెండవది ప్రకటన కనువాదము. ప్రభుత్వ ప్రకటనయందలి ముఖ్యాంశము లన్నియు అందరకును అర్థమగు చక్కని

తెలుగులో క్లుప్తముగను ఏర్పాటుగను పీఠికయం దీయబడినది. ప్రభుత్వ ప్రకటనయొక్క అనువాదము క్లిష్టముగా నున్నను ఈ పీఠిక దాని నర్థము చేసుకొనుటకు బాగుగా ఉపయోగింపగలదు.

ఈ పుస్తకము హైద్రాబాద్ సంస్థానమునందలి యాంధ్రులెల్లరును చదువ దగినది. పీఠికయు ప్రకటనయు పూర్తిగా చదివినట్లయిన నైజాంగా రొసగు సంస్కరణలెంత స్వల్పమైనవో తేటపడగలదు. దేశాభ్యుదయమునకు హానికరమైన వృత్తి ప్రాతినిధ్యము, అల్పసంఖ్యాకులగు మహమ్మదీయుల కధిక ప్రాతినిధ్యము ఎట్లీ సంస్కరణలలో చొప్పింపబడినవో ఎల్లరును తెలుసుకొనుటకును, హైద్రాబాదు ఆంధ్రులలో రాజకీయ ప్రవృత్తి కలుగుటకును ఈ పుస్తకము తోడ్పడగలదు.

ప్రకటనానువాదము అన్వయకాఠిన్యము లేక సులభముగా నుండినట్లయిన జనసామాన్యమునకు మిగుల ఆకర్షణీయముగ నుండెడిది.

సి. వి. దీక్షితులు

---

## పాలవుంత

కర్త: అత్తిలి సూర్యనారాయణమూర్తి, భీమవరం. వెల అర్ధరూపాయి.

ఈ పుస్తకానికి పీఠిక తల్లావఝ్ఝుల శివశంకర శాస్త్రిగారు వ్రాశారు. ఇందులో కొన్ని గేయాలూ, కొన్ని పద్యాలూ ఉన్నవి. వాటిలో కొన్ని దేశభక్తి పూరితాలైనవీ, కొన్ని ప్రేమకు సంబంధించినవీ, కొన్ని ప్రకృతిని వర్ణించేవీ ఉన్నవి. ప్రథమగేయంలో పుస్తకాన్ని బాపిబావకు (అడవి బాపిరాజు గారికి) అంకిత మిచ్చారు.

కవికి సంగీతజ్ఞానం ఉన్నట్లు కావ్యంవల్ల తెలుస్తున్నది. కొన్నికొన్ని గేయాల్లో కవిహృదయానుగతంగా వెల్వడిన రాగాలుకూడా సూచింపబడినవి. 'అమ్మ', 'కవి' అనేగేయాల్లో కవియొక్క స్వాతంత్ర్యేచ్ఛ స్పష్టమౌతున్నది. కవి దాస్యశృంఖలాలు మాయమవడానికి 'సంగరమ్మున జట్టు కూడగ మరలుసుతునకు విరుగుపాలిడి విరిగ పసులని చురుకులాడే తల్లి కావాల' నని కోరుచున్నాడు. కవులంతా నీరసమైన ప్రణయ విషయాలు కట్టిపెట్టి ఉడుకురక్తపుపోటు చూపించే ఉజ్జ్వలద్గీతాలను పాడమని ప్రబోధిస్తున్నాడు. 'ఉదయగొబ్బి', 'గోగీతి' అనుగీతాల్లో జాతీయత కనబడుతున్నది. కొన్నిగీతాలలో భావం గూఢంగా ఉన్నది. కొన్నిట్లో బాగా వున్నా మరికొన్నిట్లో శైలి కుంటుపడింది. సూర్యనారాయణమూర్తిగారు ముమ్ముందు మంచికావ్యాలు రచిస్తారని ఆశిస్తున్నాము.

వెం. శ్రీ.

---

## హిందూదేశ యాత్రాస్థలముల:

శ్రీ ఆచంట బాపిరాజుగారు, బి. ఏ. మేనేజరు, ఆంధ్రపూర్ణయాత్రాకంపెనీ, విశాఖపట్టణం. వెల రు ౧-౦-౦.

గ్రంథకర్త: ఉత్తరహిందూస్థానంలోనూ, దక్షిణహిందూస్థానంలోనూ గల ౫౭ ప్రధాన పుణ్యక్షేత్రాల వర్ణనలూ విశేషాలూ ఇందులో వున్నాయి. తీర్థయాత్రలకు పోవువారి కిది మిగుల ఉపయోగకరమైనది. రైల్వే టైముటేబిల్ గైడ్‌లాగు యాత్రికులకు ఇది తోడుపడుతుందిముఖ్యంగా ఒంటరిగా తీర్థసందర్శనానికి బయలుదేరినవారికి. ఇంట కూర్చున్నవారుకూడా కులాసాగా చదువుకొంటూ కాలంగడపవచ్చు.

---

# పత్రికాస్వీకారము

---

**పిఠాపూర్ రాజాగారి కాలేజీ మేగజీన్-శరత్ సంచిక**-సంపాదకులు:— ఏ ఆర్. పొన్నుస్వామి అయ్యంగారు.

కాకినాడలోని శ్రీ పిఠాపూర్ రాజాగారి కాలేజీవారిచే ప్రకటితమయ్యే ఈ మేగజీను యొక్క అయిదో సంపుటపు ప్రథమ సంచిక-శరత్. రఘుపతి వెంకటరత్నం నాయుడుగారి స్మారక వ్యాసాలుకల అనుబంధంతో సహా-మా

కార్యస్థానం చేరింది. ఆంధ్ర ఆంగ్ల భాషల్లో నేకాక సంస్కృతభాషలోనూ సంస్కృత లిపిలో రెండుమూడు రచనలున్నవైనా వుండ డం మిక్కిలి ముదావహం. శ్రీ నాయుడుగారి స్మారకానుబంధంలోని వ్యాసాలు రచయిత లకు వారియెడలగల భక్తి ప్రపత్తులను వెల్లడి చేయును వారిని సాక్షాత్తుగా చూచియుండని చదువరులకు వారియెడల గౌరవ ఆదరాభిరాగా లను పుట్టించేరిగా వున్నాయి. నాయుడుగారు ఆంధ్రమాతృగర్భాన్ని పండించిన అనర్ఘక మహాపురుషుల్లో ఒకరు. దైవీప్రకృతి సంజాతులు. ఎందుకంటే: "అహింసా, సత్యం, మక్రోధ, స్త్యాగ, శ్శాంతి, రపైశునం, దయాభూతే ష్వలోలు ప్త్వం, మార్దవం, హ్రీ, రచాపలం, తేజః, క్షమా, ధృతి, శ్శౌచం, అద్రోహో, నాతిమానితా, భవంతి సంపదం దైవీం అభిజాతస్య భారత." ఈదైవీ ప్రకృతి సుణాలన్నీ శ్రీనాయుడుగారి యందున్నట్లు ఇందలి రచనలనుబట్టి స్పష్టపర చుకో వచ్చును. ఇవి అలౌకిక, అమానుషిక సుణాలుకావు కాని సమస్తమానవులలోను హార్దికంగా దొరకవు. నిండు యౌవ్వనంలో వుండగా ధర్మపత్ని మరణించినప్పటికీ ఆజన్మమూ బ్రహ్మచర్యమును నిర్వహించి అవసానకాలమున ఆసాధ్వి చిత్రపటమును తన వక్షఃస్థలమున నిడి తన కళేబరమును అగ్నిసాత్కృతి గావింపమని మిత్రులను వేడుకొనినట్లు వకచోట వ్రాయబడి యున్నది. వీరి ఏకపత్నీవ్రతపాలనా స్థైర్యాని కిది బంగారంవంటి నిదర్శనము. రఘుపతి యనే వీరిగృహనామము ఇందువల్ల మహా చక్కగా సార్థకమైంది. అనుబంధపు ఆరంభరచన శ్రీ పిఠాపురం మహారాజాగారిది. రాజాగారు దీనిద్వారా నాయుడుగారి యెడలగల గురుభావాన్నీ, మిత్ర భావాన్నీ ప్రకటించుకొని కృతకృత్యులైనారు. అసలు సంచిక సైతం శ్రీ నాయుడుగారి స్మారక వ్యాసంతోటే ఆరంభమవుతుంది. ఇందు త్రిభాషారచన లున్నాయి కాని ఆంగ్లానిదే పైచేయి. ఎంతైనా పాలకభాషే ఆయెను. భౌతిక, శిల్పశాస్త్ర సంబంధమైన రచనలు సము యానుకూలంగానే వున్నాయి కాని ఇవి ఆంధ్రం లోనే వుంటే ఇంగ్లీషురానివారి కెంతో వుపకా రంగా వుండేది. ఇంగ్లీషు వచ్చినవారి కిట్లాటివి ఎన్నైనా దొరుకుతాయి. చదువుకొంటారు. కాని ఇంగ్లీషు తెలియనివారికే ఇటువంటివాని ఆవశ్యకత ఎక్కువ.

**తెలుగుతల్లి:**—క్రొత్తగా వెలువడిన మాసపత్రిక. నిజాంఇలాకా తెలంగాణమందలి సికింద్రా బాదు జన్మస్థానం. రాచమల్ల సత్యవతీదేవిగారు సంపాదకురాలు. ప్రథమసంపుటపు ప్రథమసంచిక మాకు చేరింది. ఇప్పట్లో క్రొత్తపత్రిక వెలు వడడమే ఒక గొప్ప. అందులో అంధకార మయంగా వున్న తెలంగాణంనుంచి కావడం మరింత గొప్ప. అంతకంటే మించింది స్త్రీసంపా దకత్వం. ఇంకా శోభనిచ్చేది సుప్రసిద్ధలేఖ కుల నానావిధగద్యపద్యరచనలు. సకలాంధ్ర సంతాన. ఇట్టి ఈ తెలుగుతల్లిని ఎంతోప్రేమాద రాలతో పోషించి యీ వెలుగు కాంతులు నల్దిక్కుల ప్రసరింపచేయడానికి ఎంతవరకు సహాయపడుతారో చూడాలి. సంవత్సరం చందా కేవలం రు ౧-౮-౦. విడిసంచిక రు ౦-౨-౦ లు. ౩౬ ఎ. బన్సీలాల్ పేట. సికింద్రాబాదు (దక్కన్)

## గ్రంథస్వీకారం

**లీలావతీనాటకము**—గ్రంథకర్త-ప్రకటనకర్తా: శ్రీ తెన్నేటి వేంకటదీక్షితులుగారు. పెనుగొండ, పశ్చిమగోదావరిజిల్లా. వెల రు ౦-౧౨-౦.

**దశోపనిషత్తులు**— ద్వితీయభాగం: మూలానువాద సహితం. అనువాదకులు రా॥ సా॥ బచ్చు పాప య్యశ్రేష్ఠిగారు. ద్వారకానాథ్ అండ్ కంపెనీ

౨౨ ప్రాడ్వేటు ముత్యాలుమొదలిస్ట్రీటు, జి. టి. మద్రాసు. వెల రు ౦-౧౦-౦.

**శ్రీ పరేశశతకము:**—గ్రంథకర్త: శ్రీ పిండి రామయోగిగారు. ప్రకాశకులు రా॥ సా॥ మండపాక అప్పలనరసయ్యగారు, రిటయిర్డు అసిస్టాంటు ఇంజనీర్, లలితానగరం, వాల్తేరు రయిల్వే స్టేషన్, వాల్తేరుపోస్టు. వెల రు ౦-౧౦-౦.

**జాతక పారిజాతము:—గ్రంథకర్త:** వేదమూర్తి గంగాధరముగారు; ప్రకాశకులు: శ్రీ కొండపల్లి వీరవెంకయ్యగారు, శ్రీ సత్యనారాయణ బుక్ డిపో, రాజమండ్రి. వెల ౦-౮-౦.

**వైదానం:**—కర్త: నుడిపాటి వెంకటచలంగారు; వెల రు ౦-౮-౦ లు.

**శ్రీ తత్వరత్నాకరము:**—గ్రంథకర్త: శ్రీ పిండి రామయోగిగారు. ప్రకాశకులు రా॥ సా॥ మండపాక అప్పల నరసయ్యగారు. పైన పేర్కొన్న ఎడ్రెసుకే వ్రాసిన ఈ గ్రంథము పడయవచ్చును. వెల రు ౦-౬-౦.

**అదృష్టం:**—కర్త: నుడిపాటి వెంకటచలంగారు; ప్రకాశకులు: కె. శవమయ్యగారు, టీచరు, శుక్రవారంపేట, నర్సాపురం. వెల ఆరుఅణాలు.

**ఆంధ్రరామాయణము-౧-వ భాగము:**—ప్రకటనకర్త: శ్రీ కోగంటి దుర్వాసులుగారు, అంగలూరు. గుడివాడ బాలసరస్వతీ ప్రెస్సులో ముద్రితము. వెల రెండణాలు: విఘ్నేశ్వర గ్రంథమాలలోని ప్రథమ ప్రచురణము.

**వెలుగోటివారివంశావళి:**—పరిష్కర్త: డాక్టరు వేలటూరి వేంకటరమణయ్యగారు, రీడరు, మద్రాసు యూనివర్సిటీ. ప్రకాశకులు: మద్రాసు యూనివర్సిటీవారు. వెల రు ౦-౩-౦ లు.

**ఆంధ్రజాతీయ నూతనగీతములు:**—రచయితలు: వాడ్రేవు శేషగిరిరావు, వేదమూర్తి గంగాధరము గార్లు, జ్ఞానేశ్వరీబుక్ డిపో, లక్ష్మీవారపుపేట, రాజమండ్రి అనిగాని, వాడ్రేవు శేషగిరిరావు గారు చొప్పెల్ల (మడికిపోస్టు) వయా, ద్వారపూడి, తూ॥ గోదావరి అనిగాని వ్రాసి పుస్తకాలను తెప్పించికోవచ్చును. వెల రు. ౦ ౧-౦.

**శ్రీరామోత్తరేతివృత్తము:**—రచయిత: సాహిత్య విశారద, కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు. కాకినాడముద్రాక్షరశాలలో ముద్రితము. కాకినాడ. పై ఎడ్రెసుకు వ్రాసిన పుస్తకం ఖరీదు తెలియగలదు.

**శ్రీ వేంకటేశ్వరశతకము:**—రచయిత: విద్వాన్ శ్రీ దర్భా వేంకట కృష్ణమూర్తిగారు ఎం. ఏ. మదనపల్లికళాశాల, మదనపల్లిపోస్టు, చిత్తూరు జిల్లా. వెల గ్రంథకర్తకు వ్రాసిన తెలియును.

**నారాయణీయం లేక శ్రీమద్ భాగవత సంగ్రహం:**—గ్రంథకర్త: శ్రీ మెప్పత్తూర్ నారాయణభట్ట తిరిపాదుగారు. ప్రకాశకులు: పి. ఎన్. మేనన్ గారు B. A. B. L. ప్రధాన సంపాదకుడు. 'ఇండియన్ క్లాసిక్స్', పాలఘాటు మలబారు.

---

Printed and Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St., Madras. Editor:— S. Sambhu Prasad.

